# గుర్తుంచుకోండి, పోషణనిచ్చే సమపాళ్ళలోని ఆహారాన్నివ్వకపోతే జరిగేదిదే-మీ పాప విటమిన్, మినరల్ వీటి లోపానికి గురికావచ్చు.

## “అందుకే నేను మా పాపకు సెరిలాక్ యిస్తాను.”

విటమిన్‌లు, మినరల్స్ సమపాళ్ళలో ఉన్నట్లయితే పోషక పదార్థాలను హరించుకొనడంలో తోడ్పడతాయని మీకు తెలుసా. ఇది, మీ పాపాయి కొరతకు గురి కాకుండా చూస్తుంది.

మీ డాక్టర్‌ని అడగండి. ఈ విటమిన్‌లనూ, మినరల్స్‌నూ పొందేందుకు పోషణ రూపేణా సమతూకంలోని ఆహారమే ఉత్తమ మార్గమని మీ డాక్టర్ చెబుతారు. అటువంటి సమతూకమైన పోషకాహారంలో ప్రొటీన్లూ, కార్బోహైడ్రేట్లూ, కొవ్వుపదార్థాలు, ఇనుము, కాల్షియం కూడ సరైన పాళ్ళలో ఉంటాయి-ప్రతిసారి ఆహారం యిచ్చినప్పుడు, ప్రతి రోజు క్రమం తప్పకుండా రోజు రోజూ లభించాలి.

చాలా మంది తల్లులకు మామూలుగా పారంపర్యంగా యిచ్చే ఆహారంతో యిలా సమతూక ఆహారం యివ్వడం సాధ్యం కాని పని.

దీనికి పరిష్కారం ?

సెరిలాక్. ఇది పాపాయిలకు యిచ్చేందుకు పోషణ రూపేణా సమతూకమైన ఘన ఆహారం వారికి నాలుగు నెలల నుంచి యిచ్చేందుకు. ఎందు కంటే, పిల్లలకు ఆ వయసు నుంచి పాలు ఒక్కటే చాలవు.

సెరిలాక్ ఎ,డి,సి,బి కాంప్లెక్స్ మరియు 'ఇ' విటమిన్లతో బలవర్ధకం చేయబడింది. దీనిలో ప్రొటీన్లూ, కొవ్వు పదార్థలూ, కార్బోహైడ్రేట్లూ, ఇనుము, కాల్షియం కూడా ఉన్నాయి-అన్నీ మంచి సమపాళ్ళలో. దాని రుచి పిల్లలకు చాలా యిష్టం.

కాబట్టి, పోషణ నిచ్చే సమతూకంలోని సెరిలాక్ సమకూర్చే లాభాలన్నింటి ని మీ పాపాయికి అందించండి. పాపాయికి 6 నెలలు రాగానే వీట్-ఆపిల్, వీట్-ఆరెంజ్, వీట్-వెజిటబుల్ యొక్క అదనపు ప్రయోజనాన్ని పాపాయికి సమకూర్చండి. ప్యాక్ మీద యివ్వబడిన సూచనలను దయ చేసి పాటించండి.

---

**ఉచితం సెరిలాక్ బేబీ కేర్ బుక్**

వ్రాయండి : సెరిలాక్, పోస్ట్ బ్యాగ్ నం. 21, న్యూ ఢిల్లీ-110 029

---

నెస్లె వారి నాణ్యమైన ఉత్పాదన




మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం.

# సరియైన ధరలో సర్వోత్తమమైన షాంపూకోసం వెధకడం ఇక్కడతో మొదలై...

| బ్రాండు | *ధర (రూ.) | |
|---|---|---|
| లాక్మే | 25.00 | (పన్నులన్నిటితో సహా) |
| సన్‌సిల్క్ | 23.10 | (స్థానిక పన్నులు అదనం) |
| హేలో | 22.00 | (స్థానిక పన్నులు అదనం) |
| వెల్‌వెట్ | 13.50 | (పన్నులన్నిటితో సహా) |

* బొంబాయిలో మే 21, '90 తారీకునాడు 100 మి. లీ. ధర

# ...ఇక్కడ పూర్తయిపోయింది.




సాషే కేవలం 1 రూపాయలో




కేవలం యీ మాత్రపు
ధరలోనే మీ యింట్లో
వాళ్ళు పొందగలుగుతారు
అందమైన, నుతిమెత్తని,
పొందికగా అమరే జుట్టు.
మీ జుట్టు పోషణకోసం
వెల్‌వెట్ ఎగ్ కండీషనర్
షాంపూ మరియు
పొడుగైన, నల్లని
జుట్టుకోసం వెల్‌వెట్ బ్లాక్
కండీషనర్ షాంపూ

90/pc/185-II

## వెల్‌వెట్ యొక్క మెరుపు: కేవలం సగం ధరలో

## డిస్ట్రిబ్యూటర్లు: గోద్రెజ్ సోప్స్ లిమిటెడ్

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✶ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

------------------ కూపన్ ------------------

అక్టోబర్ చతుర నవల 'ఎండమావి'

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................

# ఇండ్ల స్థలములు

## విశాఖపట్నం,రాజమండ్రి నగరములలో

## 60 సులభ వాయిదాలలో పొందండి!




ఇప్పుడు మీ బిడ్డకు S.V.L. నగర్ లో ఒక స్థలం కొనండి

దాని విలువ మీ బిడ్డతో పెరుగుతుంది



**యస్.వి.యల్. రియల్ ఎస్టేట్స్ &**
**కన్స్ట్రక్షన్స్ ప్రై..లి..**

A. పాండురంగపురం
ఖపట్నం-3. ఫోన్ 66871

మేనేజింగ్ డైరెక్టర్
కె.యస్.యన్.చౌదరి

25-8-7/1, జయకృష్ణపురం
రాజమండ్రి-5. ఫోన్ 75920

# "నరబలి"పై చతుర సమీక్షలు

**అగస్టు 'చతుర'లో ప్రచురితమైన కె.విశ్వమోహన్‌రెడ్డి నవల 'నరబలి'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.**

## సామాజిక దుర్మార్గం

**(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)**

ఒక సామాజిక దుర్మార్గాన్ని ఇతి వృత్తంగా ఎన్నుకొని, చక్కని కథాకధన చాతుర్యంతో సమస్యని రచయిత అందించిన తీరు ప్రశంసించతగ్గదిగా ఉంది. అత్యంత సాధారణంగా ప్రారంభమైన కథ, అనూహ్యమైన మలుపులు తిరిగి 'ఏ క్షణంలో ఏం జరుగుతుందో' అనే ఉత్కంఠతో ఆద్యంతం చదివించింది.

'నరబలి' అక్కడక్కడ జరుగుతోందనే విషయం దినపత్రికలలో అప్పుడప్పుడు చూస్తున్నాం. కాని ఈ ఘోరం వెనుక ఏ విధమైన సామాజిక శక్తులు పనిచేస్తున్నాయనే విషయాన్ని రచయిత చక్కగా విశ్లేషించారు. నరబలి వంటి ఘోరాలు జరగడానికి వివిధ స్థాయిలలో ఎందరి సహకారమో కావలసి ఉంటుంది. పొట్టకూటికోసం నానాగడ్డీ కరిచే నారాయణ వంటి సాధువులదగ్గరనుండి, 'బాబా' అనుగ్రహం కోసం ప్రాకులాడే నరసింహారావు వంటి వారెందరో దీనికి కారణం అవుతారు.

ఐదేళ్ల 'రవి' అదృశ్యం అయినప్పుడు తల్లిదండ్రులైన వసుంధర, ప్రసాద్‌లు పడిన ఆత్రుతను,రవి కొందరు దుష్టుల దురన్యాయానికి 'బలి' అయిన ఘట్టాన్ని చూసిన తర్వాత చెందిన భయాందోళనలను చాలా సహజంగా చిత్రించారు రచయిత.

తమ స్వార్థంకోసం ముక్కుపచ్చలారని పసిబిడ్డలని నిర్దాక్షిణ్యంగా బలి ఇచ్చే నరసింహారావులు మనుమల రక్తమాంసాలతో వ్యాపారం చేసే 'బషీర్‌బాబా'లు, అతనికి సహాయంచేసే సెక్రటరీ 'అవధూత'లు, వీరిని తలచుకుంటేనే జుగుప్స కలిగే రీతిలో చిత్రించారు రచయిత. నరబలి జరిపే దృశ్యాన్ని దాని తరువాత జరిగే బీభత్సాన్ని భయంకరంగా చిత్రించారు. ఇవన్నీ నరబలి సమస్య తీవ్రతను గుర్తించడానికి పరోక్షంగా సహకరించాయి.

ప్రజలు మతమౌఢ్యంతో అజ్ఞానులుగా ఉన్నంతకాలం 'బషీర్‌బాబా'లాంటి దొంగ సాధువులు 'మహా యోగులు'గా చెలామణీ అవుతారు. మోసాన్ని తెలుసుకున్ననాడు అదే ప్రజలు వీరిని చెప్పులతో సత్కరిస్తారు.

చైతన్యవంతమైన జనవాహిని ముందు ఏ దుష్ట సామాజిక శక్తీ ఎదురు నిలవలేదనే సత్యాన్ని మరొకసారి నిరూపిస్తుంది-ఈ 'నరబలి' నవల.

**-పంతుల లక్ష్మీదేవి,**
హైదరాబాద్.

## విభిన్నమైన నవల

**(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)**

ప్రజల మూఢ విశ్వాసాలనీ, బలహీనతలనీ ఆసరాగా చేసుకొని దేవుడి పేరు మీద ఎంతో మంది బాబాలూ, అమ్మలూ, బాలయోగులూ మొదలగు వారంతా లక్షలకు లక్షలు సంపాదిస్తూ మోసం చేస్తున్నారనేదీ నిర్వివాదాంశం.

ముఖచిత్రం: **వికీహండా**

వీటికి వ్యతిరేకంగా ప్రజలని చైతన్యవరచే ఉద్దేశంతో వాళ్ళ బండారాన్ని బయట పెట్టడానికి కొన్ని హేతువాద సంఘాలు, నాస్తిక సమాజాలు ప్రయత్నాలు చేస్తున్నాయి. అయినా రాజకీయ నాయకుల అండతో ప్రభుత్వ యంత్రాంగం ఆ ప్రయత్నాలను అడ్డుకోవడం జరుగుతున్నది. కారణం: ఎంతోమంది బడా రాజకీయ నాయకులూ, మేధావులుగా చలమణీ అవుతున్న పెద్దలు గూడా మూఢ విశ్వాసాలలో కొట్టుకుపోతున్నారు. మంత్రులు, స్పీకర్లు లాంటి వారు కూడా బాబాల కాళ్ళు తలపైపెట్టించుకొని ఆశీర్వాదాలు పొందుతున్నట్లుగా ఫొటోలలో చూశాము.

ఈ మూఢ విశ్వాసాలలో అత్యంత ఘోరమైనదీ, హేయమైనదీ తోటిమనిషినే ముఖ్యంగా పసిపిల్లలను ఎంచుకొని 'బలి' ఇవ్వడం. ఈ విషయాన్ని తీసుకొని అదెంత దారుణమైన విషయమో తెలియజేస్తూ చైతన్యవంతమైన నవల వ్రాసిన రచయిత విశ్వమోహనరెడ్డి అభినందనీయులు.

పసిపిల్లలను తీసుకుపోయి వికలాంగులుగా తయారుచేసి వాళ్ళద్వారా భిక్షాటన చేయించి డబ్బు సంపాదించే వ్యాపారం చేస్తున్న ముఠాల గురించి గూడా బాగానే వ్రాశారు. అయితే అటువంటి ముఠాల వెనుక ఉండే 'పెద్దమనుషుల' బండారం ఇంకా ఎక్కువగా బహిర్గత పరచి ఉంటే బాగుండేది. స్వాతంత్ర్యం వచ్చి నలభై మూడు సంవత్సరాలైనప్పటికీ డబ్బు సంపాదించడానికి మనిషి ఎంతటి దారుణానికైనా వెనుదియ్యడం లేదంటే మనం ఎటువంటి దుస్థితిలో ఉన్నామో అర్థం చేసుకోవచ్చు.

ఇటువంటి చైతన్యవంతమైన నవల వ్రాసిన రచయితకు అభినందనలు.

అలాగే తాము వ్రాసే చెత్త నవలలకు పాఠకులూ, ప్రచురణకర్తలే కారణమంటూ తమ బాధ్యతనుండి తప్పించుకుంటున్న రచయితలున్న రోజుల్లో ఇటువంటి విభిన్నమైన నవలను ప్రచురించి తన ప్రత్యేకతను నిలబెట్టుకున్న 'చతుర'కు నా అభినందనలు.

-అధికార్ల జగన్నాథశాస్త్రి
హైదరాబాద్.

## పైశాచిక ప్రవృత్తికి పరాకాష్ఠ

**(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)**

వైజ్ఞానికంగా, శాస్త్రీయంగానూ అన్నివిధాల అభివృద్ధి చెందానని చెప్పుకుంటున్న ఈ రోజుల్లోకూడా మానవుడు మూఢ నమ్మకాలకు ఎంతగా బానిసై పోయివున్నాడో కళ్లకు కట్టినట్టుగా చెప్పే గాథ 'నరబలి'. స్వలాభం కోసం అర్థంలేని నమ్మకాలతో అమాయకులైన పసిపిల్లలను బలిఇవ్వడం గురించి చదువుతుంటే, మానవుడిలోని పైశాచిక ప్రవృత్తి ఏ స్థాయికి చేరుకొందో, అర్థమౌతోంది. ఇలాంటి యదార్థగాథలెన్నో వార్తాపత్రికలలో చదివినా, నవలలో రచయిత 'నరబలి'ని వాటి వెనుకనున్న మనుషులలో దాగివున్న స్వార్థం గురించి వర్ణించిన తీరు గగుర్పాటును కల్గించక మానదు. కఠిన శిలలను సైతం కరిగించకా మానదు.

అమాయకుడైన ఒక పసివాడి నరబలితో, హృదయాన్ని కదిలించేలా ప్రారంభమైన కథ, ఆ సంఘటన చివరలో ఆ పసివాడి శవం కన్పించిన విధం, పాఠకులను భయభ్రాంతులను చేస్తుంది. నరసింహారావు ఇంట్లో మాంత్రికుడు ఒక పసివాడిని బలి తీసికొన్న వైనం, అవధూత ఇంట్లో పసిపిల్లలను నిర్దాక్షిణ్యంగా అంగవికలులను చేయడం, కంటతడి తెప్పించేలా ఉన్నాయి. మానవత్వం, దయ, జాలి ఇలాంటి పదాలకు అర్థం మానవుడు మరచిపోతున్నాడా అన్పించింది.

కథలో రెండవ అంశం నరబలుల వెనుక, కాషాయవస్త్రాలు ధరించి మెస్మరిజం నేర్చి దేశం మీదకు విషపు పురుగుల్లా తయారవుతున్న స్వామీజీల స్వార్థం. ఇలాంటి స్వామీజీలను దేవుళ్ళవలే కొలిచే జనానికి కళ్లు తెరిపించేలా వివరించబడింది. తాము చేస్తున్న పాపాలను సమర్థించుకోడానికి, ఈ స్వామీజీలు ఏ విధంగా ఆలోచిస్తారో భాను, నరసింహారావు పాత్రలద్వారా వివరించారు. "ఒక్క చిన్న

పుణ్యం చేస్తే చాలు, అంతవరకూ చేసిన పాపాలన్నీ పటాపంచలవుతాయి''. ''చేతనైనంత వరకూ సుఖం పొంది చివరలో పశ్చాత్తాప పడితే చాలు పాపం పోతుంది''''చంపేది నేను, చచ్చేది నేను. ఇందులో ఎవరి బాధ్యతా లేదు'' ఇలాంటివి చదువుతుంటే పురాణాలు, మత గ్రంథాలలో చెప్పబడిన విషయాలను స్వార్థపరులు ఈ విధంగా ఉపయోగించుకొంటున్నందుకు విచారం కల్గుతుంది.

అయితే ఈ నరమేధాన్ని ఆపడంలో సామాన్య పౌరుడి పాత్ర ఏమిటో రచయిత సరిగా వివరించలేకపోయారు. శంకర్రావు అనే వ్యక్తి పోలీస్‌స్టేషన్‌లో 'నరబలుల విషయంలో పోలీసులకు భాగముంది, నిరూపించగలను' అంటాడేగాని తరువాత ఆ పాత్ర గురించి ఏమీ చెప్పలేదు. చివరలో పోలీసుల కృషి ప్రయత్నం పెద్దగా లేకుండానే యాక్సిడెంటల్‌గా బాబా వంటి పెద్ద నేరస్థులు పట్టుబడినట్లు చెప్పడం కొంత అసంతృప్తిని కల్గించక మానదు. ఇప్పటికైనా కళ్లు తెరచి సమాజంలో మహమ్మారిలా వ్యాపిస్తున్న ఈ దురాచారాన్ని ఆపకపోతే కొద్దికాలానికి మనుషులకు, నాగరికత తెలియని కానిబాల్స్‌కు తేడా ఉండదు అనిపిస్తోంది.

-కె.పద్మావతి,
గూడూరు.

## ఆలోచనాత్మకం

*(నాలుగవ బహుమతి రు. 25/- పొందిన సమీక్ష)*

**కె.**విశ్వమోహనరెడ్డిగారి నవల 'నరబలి' ఆద్యంతం ఉత్కంఠ కలిగించింది. ఒక సినిమా చూసిన అనుభూతిని మిగిల్చినా మనసులో ఆలోచనల్ని రగిల్చింది.

డబ్బుకోసం ఒక రాజకీయనాయకుడు, ఒక గూండా, ఒక బందిపోటు, ఒక స్మగ్లర్ వంటివారు ప్రజలముందు ఎన్ని వేషాలు వేసినా ప్రజలను ఎలా మోసగించినా, ఎలా దోపిడీ చేసినా అర్థంచేసుకోవచ్చునేమోగానీ, కర్మ సిద్ధాంతాన్ని నమ్మి, తమ నొసటిమీద రాతని దేవుడు రాశాడనీ, ఆ రాత ప్రకారమే తమ బ్రతుకు ముందుకు సాగుతుందనీ అనుకునే అమాయక ప్రజల్ని గడ్డాలు పెంచుకొని, కాషాయాంబరాలు ధరించి ఒక వీధి గారడీవాడు చేసే విద్యల్ని అలవర్చుకొని, ఏం కావాలన్నా తమ అరచేతుల్లోనుండి సృష్టిస్తున్నట్టుగా నటిస్తున్న కలియుగ దేవతలనబడే ఈ బాబాలనూ, స్వాములనూ క్షమించడం అసాధ్యం.

వీళ్ళు చేస్తున్న మోసాలు, కుతంత్రాలు, దౌర్భాగ్యపు పనులు ఎలా వుంటాయో నవలలో అడుగడుగునా బయటపడ్డాయి. చిన్న పిల్లల్ని ఎత్తుకెళ్ళి దేవతలకు నిధులకోసం బలి ఇవ్వడం, డబ్బులకోసం పిల్లల అవయవాల్ని తొలగించి బిచ్చగాళ్ళను చేయడం, ఆడవాళ్ళను అనుభవించి వేశ్యలుగా మార్చడం, దొంగ నోట్లు ముద్రించి అసలు నోట్లుగా చెలామణి చేయడం, బంగారం స్మగ్లింగ్, రాజకీయనాయకుల్ని, బడాబడా పారిశ్రామిక వేత్తల్ని, పెద్దపెద్ద వుద్యోగస్తుల్ని తమ గుప్పెట్లో వుంచుకోవడం కిరాతకమయిన పనుల్లో కొన్ని మాత్రమే. వీళ్ళ మోసాలు తెలియక వీళ్ళను నిజంగా నమ్మితే ఎప్పుడో ఒకప్పుడు 'నరసింహారావు'లా బలి కాక తప్పదు అని హెచ్చరించే నవల ఇది. పోలీసుల గురించి రచయిత ''వీళ్లే హంతకులు, వీళ్లే దొంగలు, వీళ్లే రౌడీలు, డకాయిట్‌లు, పిక్‌పాకెట్‌గాళ్ళు. సర్వం వీళ్లే! వీరి అలవాట్లు మిగిలిన వారికి నేర్పి జనం మీదకు తోలుతున్నారు'' అనీ..., చదువుకున్న వారి గురించి ''భయ్యా ఈ లోకంలో జరిగే ప్రతి ఘోరం వెనుకా ఓ చదువుకున్నవాడే వుంటాడు'' అనే అక్షర సత్యాల్ని పలికించారు. చదువురాని లక్షలాదిమంది సంగతలా ఉంచి చదువు వచ్చిన వారైనా ఈ నవల చదివి స్వాములకూ, బాబాలకూ దూరంగా వుంటే ఈ నవల ఆశయం కొంతవరకైనా సిద్ధించినట్టే.

-సి. హెచ్.సనత్‌కుమార్,
గోదావరిఖని.

## కొత్తసీసాలో పాతసారా...?

*(అయిదవ బహుమతి రు. 25/- పొందిన సమీక్ష)*

**మ**నిషి ఆటవిక అనాగరిక అంధకార కూపంనుంచి నాగరిక కాంతి శిఖరాలకు చేరు




కున్నాడు. 21వ శతాబ్దంలోకి అడుగిడుతూ విజ్ఞాన పథంలో పురోగమిస్తున్నాడు. శాస్త్రీయ రంగంలో అనేక అద్భుతాలను సాధించాడు. అయినా ఈ కాలంలోకూడా బాబాలనీ, మాతాజీలనీ, మాయలూ, మంత్రాలూ, నిధులూ, నిక్షేపాలూ, బలులూ ఈవలయంలో చిక్కుకుని అజ్ఞాన తిమిరంలో కొట్టుమిట్టాడుతున్నారు కొందరు. అటువంటి వారికి కనువిప్పు కలిగిస్తుంది నరబలి నవల. మనుషుల మూఢ నమ్మకాలను, అజ్ఞానాన్ని అమాయకత్వాన్ని సొమ్ము చేసుకుంటూ పబ్బం గడుపుకుంటున్న బాబాల బతుకు బండారాల్ని బయటపెట్టి ఎండగట్టే నవల నరబలి.

ముక్కుపచ్చలారని పిల్లల్ని దయాహీనంగా, బలిపశువుల్ని చేయడం పోలీసుశాఖను గుప్పెట్లో పెట్టుకుని బాబా అవధూతలు సాగించిన దారుణాలు పాఠకుల రక్తాన్ని మరిగించాయి. ఒక దశలో పోలీసులపై జనం సాగించిన తిరుగుబాటు ఆ శాఖలోని అవినీతి పరులకు ఒక చక్కని గుణపాఠం కాగలదు. కానీ నవలలో నూతనత్వం లోపించింది. బాబాల కథలు ఎన్నో చదివిచదివి, సినిమాలుగా చూసిచూసి ఉన్న పాఠకులకు ఈ నవల కొత్త సీసాలో పాతసారాగా కనిపిస్తుంది. బాబా ముసుగులో బంగారం స్మగ్లింగు, కరెన్సీ ముద్రణ, అమ్మాయిలతో విలాసాలు, అనుచరుడు మోసంచేసి పారిపోవాలనుకోవడం, అది తెలుసుకుని బాబా అతన్ని చంపించడం ఇవన్నీ పాత చింత కాయపచ్చడి! ఎటొచ్చీ పిల్లల్ని దొంగిలించి నరబలికి ఉపయోగించడం ఓ కొత్త ప్రయోగం.

-గుబ్బల సత్యనారాయణమూర్తి,
ఏలేశ్వరం.

## హారర్ నవల

*(ఆరవ బహుమతి రు.25/- పొందిన సమీక్ష)*

ఉన్నతమైన సామాజిక విలువల్ని ప్రతిపాదించే 'స్వేచ్ఛ', 'మానవి' లాంటి నవలల్ని 'భయం', 'డబ్బు' లాంటి మౌలిక సమస్యల్ని పరిశీలనాత్మక దృష్టి కోణం నుండి ప్రతిపాదించే నవలల్ని ప్రచురిస్తూ వస్తున్న చతుర, ఈనెల బొత్తిగా ఏ స్థాయీలేని పేలవమయిన 'నరబలి' లాంటి నవలని ప్రచురించడం అభిరుచి కలిగిన పాఠకులను నిరుత్సాహ పరుస్తుందని చెప్పకతప్పదు. 'నరబలి' మరీ సినీమోడల్‌గా నడిచిన నవల. ఈనాడు తామరతంపరగా వస్తున్న తెలుగు హారర్ పిక్చర్స్‌కి పనికి వచ్చే మసాలాతో నవల రాయాలని రచయిత వుద్దేశంలా కనిపిస్తుంది. దొంగస్వాములు, వారి గూండా అనుయాయులు, దొంగ నోట్లు, బాబాల అనుగ్రహం నుండి వెలివేయబడిన వారు ఏ లారీ గుద్దేయడం వల్లనో మరణించడం, డబ్బు సంచుల్తో కుమ్మక్కయే పోలీసాఫీసర్లు, స్వాముల అడుగుజాడల్లో నడుచుకునే హాస్పిటల్ సూపరింటెండెంట్లు-ఈ ఘట్టాలన్నీ ఏదో ఒక సినిమాలో మనకి తారసిల్లే వుంటాయి. అంచేత ఈ నవలలో మనకి కొత్తగా కన్పించేదేదీ లేదు. పోనీ కథలో ప్రయోజనం వుందా అంటే హారర్ హారర్ కోసమే అన్నట్టుగా సాగుతుంది గానీ ఈ నరమేధాన్ని ఒక సామాజిక సమస్యగా చూపించి విశ్లేషించలేదే. అనాది నుండి మన దేశం స్వాముల వ్యవస్థవల్ల మంచిగానూ, చెడుగానూ కూడా ప్రభావితం అవుతూ వస్తోంది. ఈ వ్యవస్థ తాలూకు ఉచ్ఛదశ ఎలా వుండేదో మనకంతగా తెలీదుగాని, నీచదశ ఎలావుంటుందో ఈనాడు మనకందరికీ తెలుస్తోంది. ధీరేంద్రబ్రహ్మచారి తుపాకుల ఫ్యాక్టరీ నడపడం, ఆచార్య రజనీష్ విశృంఖల సెక్స్ జీవితాన్ని మహోన్నతమతంగా ప్రతిపాదించబూనడం, చంద్రస్వామి విదేశీ బ్యాంకు ఖాతాల ఊబిలో ఇరుక్కోడం- ఇవన్నీ 'స్వాముల వ్యవస్థని' అనుమానంతో చూసే పరిస్థితుల్ని కల్పిస్తున్నాయి. 'మునులు, స్వాములు, బాబాలు' ప్రతిపాదించిన వ్యవస్థల అస్థిత్వాన్ని ప్రశ్నించి, పరిశీలించవలసిన అవసరం ఎంతైనా వుంది. ఆ సమస్యని కథావస్తువుగా తీసుకుని నవల రాయగలగడం నిజంగా రచయితధీశక్తికి పరీక్ష. అటువంటి ప్రయత్నం మానేసి, మరొక కోణంలో బాబాయిజానికి ప్రతీకలాంటి సబ్జెక్టుతో 'నరబలి' లాంటి నవలలురాయడం అతి తక్కువస్థాయికి చెందిన కమర్షియల్ టెక్నిక్.

-ఎ.వి.రెడ్డి శాస్త్రి,
చోడవరం.

# చతుర కథలు

## ఇద్దరూ ఇద్దరే

**మ**ధు, రావులకు స్టీల్ ప్లాంట్‌లో సూపర్‌వైజర్ ఉద్యోగాలు. ఒకరిది శ్రీకాకుళం, మరొకరిది నూజివీడు. వారిద్దరూ ఒకేసారి ఇంటర్వ్యూలో కలిశారు. ఒకేసారి అప్పాయింట్ అయ్యారు. ఇద్దరిదీ ఒకే డిపార్ట్‌మెంట్ కావడంవలన ఒకరికొకరు సన్నిహితంగా కలిసిపోయారు. ఇద్దరూ ఉమ్మడిగా ఒక రూం తీసుకున్నారు. ఇంటి అద్దె చెరినగం. వారిద్దరిదీ ఒకే రకం పిసినారి తరహా మనస్తత్వం. బయటికి మాత్రం బహు బుద్ధిమంతుల్లా కనిపిస్తారు. ఒకరికొకరు అప్తుల్లా, నిజమైన స్నేహితుల్లా ప్రవర్తిస్తారు. ఒకే రూంలో కలిసిమెలసి వుంటున్న వాళ్ళు ఎవరి వస్తువులు వాళ్ళే కొనుక్కుని చక్కగా సర్దుకున్నారు. వాళ్ళవి షిఫ్ట్ డ్యూటీలు కావడంవలన వారిద్దరూ ఎప్పుడో గాని కలుసుకోవడానికి వీలుపడదు.

ఆరోజు మధు బ్రష్ చేసుకొని స్నానానికి ఆయత్తమయ్యాడు. తను కొన్న సింథాల్ సోప్ బాక్స్ తీస్తుంటే ప్రక్కనే రావు వాడే 'రెక్సోనా' సోప్ కనిపించింది సువాసనలు వెదజల్లుతూ. అతని పీనాసి మెదడులో ఫ్లాష్‌లా ఓ ఐడియా తళుక్కున మెరిసింది.

'రావు డ్యూటీ నుంచి రావడానికి ఇంకా అయిదు గంటల వ్యవధి వుంది. అతడు చూసే అవకాశం లేదు కాబట్టి అతని రెక్సోనా సోప్‌తో స్నానం చేస్తే...!? ఈలోగా తడి ఆరిపోతుంది కూడానూ' బ్రహ్మాండంగా వుంది అయిడియా. ఈరోజే కాదు. ప్రతిరోజూ తను రావు సోప్‌తో స్నానం చేస్తే సరి. తన సింథాల్ సోప్ ఎప్పటికీ అలాగే వుంటుంది. తనకు నెలకి అయిదు రూపాయలు ఆదా. డబ్బులు మిగిలించే ఐడియా రావడంతో మధులో హుషారు ఎక్కువయింది. రావు సోప్‌తో బాత్‌రూంలోకి వెళ్ళాడు ఈల వేసుకుంటూ. ఒంటికి ఒకసారి



సోప్ ఎక్కించుకునే మధు ఆరోజు మూడుసార్లు ఎక్కించుకున్నాడు.

ఆరోజు లగాయతు మధు ప్రతిరోజూ రావు సబ్బుతోనే స్నానం చేసేవాడు. అతని టూత్‌పేస్టే వాడేవాడు. పౌడరు, తలనూనె సంగతి సరేసరి. ఆవిధంగా రావు సబ్బు త్వరగా అరిగిపోసాగింది. ఒకరోజు అకస్మాత్తుగా మధుకి రావు సబ్బు కనిపించలేదు. భుజాలు తడుముకోవలసి వచ్చింది.

ఇహ చేసేదిలేక చాలారోజులుగా వాడకుండా వదిలేసిన తన సోప్ బాక్స్ ఓపెన్ చేశాడు. అంతే! లోపల సబ్బు బిళ్ళని చూసి హతాశుడయ్యాడు. అది తను వాడే సింథాల్ సబ్బే. కాని దాని పరిమాణం చాలావరకూ తరిగిపోయి వుంది! సగంకూడా లేదు. ఇది ఎలా సాధ్యం? తను చివరిసారి వినియోగించినప్పుడు అది కొత్తది. రెండేసార్లు వాడాడు. మరి... ఇంతలో...!?

అంటే... అంటే... రావు కూడా తనలాగే ప్రవర్తించాడా? అనుకుంటూ తన పౌడర్ డబ్బా, తలనూనె సీసా వగైరాలన్నీ ఓసారి చెక్ చేసుకుని చతికిలబడ్డాడు మధు.

---

## మొదటికే మోసం

**స**త్యవర్ధన్‌కి ఆ ఇల్లు బాగా నచ్చింది. వచ్చిన చిక్కల్లా అద్దె ఎక్కువ కావడమే. ఆ ఇంట్లో అతడు అప్పటికే చాన్నాళ్ళుగా అద్దెకి వుంటున్నాడు. సకల సౌకర్యాలుగల ఆ ఇంట్లో నివశిస్తున్నందుకు ఒకవైపు సంతోషంగా వున్నా ఇల్లు ఎప్పుడు ఖాళీచేసేయమంటారోనని ఓవేపూ, అద్దె రెట్టింపు చేస్తారేమోనని మరోవైపూ ఆందోళనగా వుంది. అలాటి పరిస్థితిలో ఆ ఇంటి వోనరు ఓరోజు సత్యవర్ధన్ దగ్గరికి వచ్చాడు.

"నమస్కారం, రండి కూర్చోండి" ఆహ్వానించాడు వినమ్రతగా.

కూర్చున్నాడు ఇంటి వోనరు.

కాఫీ తెచ్చి ఇచ్చాడు సత్యవర్ధన్.

"ఏమిటిలా వచ్చారు?" సాలోచనగా అడిగాడు.



"మీతో పని పడి వచ్చానులెండి"

"నాతో పనా!?"

"అవునండీ. నా వ్యాపారానికి పెట్టుబడిగా ఓ అయిదు వేలు కావాల్సివచ్చింది. ఇంట్లోనే వుంటున్నారుగా. ఈ ఇల్లు హామీగా పెట్టుకుని ఆ అయిదు వేలూ మీరే ఇస్తారేమోనని..."

సత్యవర్ధన్ ఎగిరి గెంతేసినంత పని చేశాడు. ఆ ఇంటి వోనర్ పక్కా త్రాగుబోతు. త్రాగుడులోపడి చాలా ఆస్తి కోల్పోయాడనీ అతడికి తెలుసు. ఇప్పుడతనికి మిగిలినది ప్రస్తుతం తను వుంటున్న ఈ ఇల్లు మాత్రమే. దఫదఫాలుగా అప్పులు తెచ్చుకొని ఈ ఇంటిని కూడా ఎప్పుడో ఒకప్పుడు అమ్మేయడం ఖాయం. ఆ అప్పు తనే ఎందుకు ఇవ్వకూడదు? ఆ ఇల్లు తనే ఎందుకు సొంతం చేసుకోకూడదు? ఏ వస్తువైనా కొనాలంటే త్రాగుబోతు కాస్త చౌకగా అమ్ముతాడు. త్రాగుబోతు దగ్గర కొనడం నైతికంగా తప్పే అయినా సత్యవర్ధన్‌కి ఇది తప్పనిపించలేదు.

"డబ్బు నా దగ్గర మాత్రం రెడీగా వుందేంటండీ, మీరు అంతగా అడుగుతున్నారు కాబట్టి ఎవరిదగ్గరైనా అప్పు పుట్టించి ఇస్తాను. వడ్డీ మాత్రం నూటికి అయిదు రూపాయలు గుంజుతారు వాళ్ళు" నాటకీయంగా అన్నాడు సత్యవర్ధన్.

"పోతే పోనివ్వండి వెధవ వడ్డీ. వడ్డీకి భయపడేవాడిని కాదండీ నేను"

"అయితే రేపు రండి, నోటు కూడా రాసి సిద్ధం చేస్తాను" అని పంపేశాడు.

★ ★ ★

ఆ మరునటిరోజు పెందరాళే ఇంటి వోనరు వచ్చాడు. డబ్బు ఇచ్చి అతనిచేత నోటుమీద సంతకం చేయించుకొన్నాడు సత్యవర్ధన్.

అతనిని సాగనంపుతూ "మీకెప్పుడైనా అప్పు కావాలంటే నా వద్దకే రండి" అని ఓ సలహా కూడా ఇచ్చాడు.

అలాగే ఓ వారంతర్వాత మరో అయిదు వేలూ ఇచ్చాడు. ఇహ ఆ ఇల్లు ఎప్పటికయినా తనదే అవుతుందన్న ధీమాతో వుంటున్న సత్యవర్ధన్ ఓరోజు పిడుగులాంటి వార్త విని స్థాణువైపోయాడు.

త్రాగుడు వ్యసనంలో పడి సర్వస్వం కోల్పోయిన ఇంటి వోనర్ ఉన్న ఆ ఒక్క ఇంటిని కూడా భార్యాపిల్లలకు లేకుండా చేస్తాడని ఆ ఇంటిని భార్యాపిల్లలకి కోర్టులో రాయించేశారుట పెద్దలు! భార్యాపిల్లల అనుమతి లేకుండా ఇచ్చిన అప్పులు లీగల్‌గా చెల్లవట. పైగా అద్దె పెంచమనీ లేదా ఖాళీ చేయమనీ కబురు పంపారు!

— కొల్లిమల్ల అప్పారావు

---

## అప్పు

**"హలో!... రాజూ..!"** అంటూ పెద్దగా పిలుస్తున్న గోపాలంను చూడ్డంతోనే నా గుండెలుఝల్లుమంది. గోపాలం కలిస్తే చాలు అప్పు అడుగుతాడు ఒక గంటలో తెచ్చిస్తానంటాడుగానీ సంవత్సరమైనా ఇవ్వడు. ఆ బాపతుకింద నావి రెండు వేల రూపాయలదాకా అతడివద్ద ఇరుక్కుపోయి ఉన్నాయి.

మరి అతడికి అప్పు ఎవరిస్తారూ? అందుకనే అతడిని గమనించనట్లు నటిస్తూ నాపాటికి నేను నడుచుకుంటూ పోసాగాను.

తెలిసినవాళ్ళు ఎవరైనా కనిపిస్తే మాత్రం గోపాలం వదలడు.

గోపాలం పరుగులాంటి నడకతో నా దగ్గరకు వచ్చి, నా వీపుమీద చెయ్యివేసి "ఏమిటి రాజూ పిలుస్తుంటే అలా వెళ్లిపోతున్నావ్?" అని అడిగాడు.

"నన్ను పిలిచావా? వినిపించలేదు గోపాలం. మరోలా భావించకేం" అన్నాను.

"పరవాలేదులే" అన్నాడు గోపాలం "నిన్న నీకోసం మీ ఇంటికి వచ్చాను తెలుసా?"

"అలాగా? అన్నాను.

"ఎందుకని అడగవేం?" కోపంగా అడిగాడు గోపాలం.

"ఎందుకేమిటి? అప్పుకోసం వచ్చి ఉంటావు" అని మనసులోనే అనుకుంటూ నాకు తెలియకుండా పైకే అనేశాను.

ఆ మాట విన్న గోపాలం విషాదంగా మొహం పెట్టి అన్నాడు, "నన్నెంతగా అపార్థం చేసుకున్నావ్ రాజూ"

ఆ సమయంలో ఏం మాట్లాడాలో అర్థంకాని నేను మౌనంగా ఉండిపోయాను.

గోపాలమే అన్నాడు "నేను నీ దగ్గర పూర్వం అప్పుడప్పుడూ అప్పుగా తీసుకున్న బాపతు రెండు వేల రూపాయలూ ఇచ్చేద్దామని వచ్చాను. వచ్చి తలుపు తడితే ఎంతసేపటికి ఎవరూ తలుపు తీయలేదు. మీ తలుపు నుకొట్టి నా చెయ్యి నొప్పిపుట్టిందనుకో. నిన్ను



పిలిచి పిలిచి నా గొంతు మూగవోయింది సుమా''.

గతుక్కుమన్నాను. నిజానికి నిన్న నేను కావాలనే తలుపు తీయలేదు "అరెరె! నిన్న నేను ఇంట్లోలేను. ఆ సమయంలో నా శ్రీమతి ఇంటి వెనుకవైపున ఉండి ఉంటుంది. ఆమెకు వినిపించి ఉండకపోవచ్చు. అందుకే తీసి ఉండదు'' అన్నాను.

"అవునా!'' ఆశ్చర్యపోయినట్లు అన్నాడు గోపాలం

"సరేలే! జరిగిపోయిందేదో జరిగిపోయింది. అలా హోటల్‌కి వెళ్లి టిఫిన్ చేసి వద్దాం పద'' గోపాలం డబ్బిస్తాడన్న ఆనందంలో అన్నాను.

గోపాలం నన్ను అనుసరించాడు. హోటల్ లోకి వెళ్లి కూర్చున్నాము. బేరర్ వచ్చాడు. "రెండు చపాతీ తీసుకురా!'' చెప్పాను.

బేరర్ వెళ్లి తెచ్చిన చపాతీ తింటూ ఉంటే "ఇంకా ఏమైనా కావాలాసార్!'' అని అడిగాడు బేరర్. గోపాలం ఏదో ఆర్డరివ్వబోయాడుగానీ, వెంటనే అన్నాను "వద్దులే కాఫీ, బిల్లు తీసుకురా!'' గోపాలం గమ్మునుండిపోయాడు.

"గోపాలం! డబ్బిస్తానన్నావుగా ఏదీ?'' అని తొందరగా ఇవ్వమన్నట్లు మొహం పెట్టాను. ఎందుకంటే ఆ క్షణాన నా జేబులో ఐదు పైసలు కూడా లేవు. గోపాలం రెండు వేలిస్తే వాటిలో ఓ వది రూపాయలు ఖర్చు పెట్టాల్సిందే.

"ఇద్దామనేగా నిన్న మీ ఇంటికి వచ్చింది'' చెప్పాడు గోపాలం.

"సరే! ఇప్పుడివ్వు''

"ఇప్పుడా! ఇప్పుడు నా దగ్గరెక్కడున్నాయి. నా జేబులో నయాపైసా కూడా లేదు'' చపాతీ నోట్లో పెట్టుకుంటూ అన్నాడు గోపాలం.

"అదేమిటి గోపాలం! ఇప్పటిదాకా డబ్బిస్తానన్నావ్. ఇప్పుడు లేదంటావేమిటి?'' కంగారుగా అడిగాను.

చపాతీని మింగి పక్కనున్న గ్లాసులోని నీళ్లన్నీ తాగేసిన తర్వాత శాంతంగా అన్నాడు గోపాలం. "నిన్న ఇద్దామనే గదా మీ ఇంటికొస్తే తలుపు తీయలేదు. దాంతో వేరొకడికి ఇవ్వాల్సి ఉండి ఆ రెండు వేల రూపాయలు వాడికిచ్చేశాను''.

అది విన్న నా మొహం మాడిపోయింది.

"ఈ విషయం చెబుదామనే నిన్ను పిలిచాను! అడుగో బేరర్ వస్తున్నాడు. నాకు అర్జెంటు పనుంది, వస్తాను'' అంటూ వెళ్లిపోయాడు గోపాలం.

దూరంగా బేరర్ నవ్వుతూ బిల్ తీసుకొస్తున్నాడు.

—పాలకొల్లు రాజమోహన్‌రెడ్డి

# చతుర

సంపుటి: 13 సంచిక: 9

అక్టోబర్ 1990

"దురాశ దుఃఖానికి చేటు బావా! కష్టపడి సంపాదించిందే నిలుస్తుంది. తల్లి
దండ్రులు మార్గదర్శులు కావాలేగాని పిల్లలచే చెప్పించుకోగూడదు" అంటున్న
బావమరిదిని ఈసడిస్తూ-

"చూడు బామ్మర్దీ! నా జీవితం, నా పిల్లల భవిష్యత్తు నేను తీర్చి దిద్దుకోగలను.
నీ సలహా నాకక్కర్లేదు. ఎవరి హద్దుల్లో వాళ్లుండటం శ్రేయస్కరం. నీ ఉచిత
సలహాలు విరమించుకోకుంటే గెటవుట్ అనాల్సొంటుంది" అని కటువుగా
పలికి...

అందని అందలాలను అందుకోవాలనే తహతహతో ఎంతటి మూల్యం అయినా
చెల్లించటానికి సిద్ధపడిన ఆ ఆశావాదికి అయినవాళ్ళనుండి ఎదురైన అంద
ఎలాంటిది?

తనకూ, తన కుటుంబ ప్రతిష్టకూ సంబంధించిన జటిల సమస్యలు
ఎదురైనపుడు కూడా తన ఓటమి నంగీకరించక స్నేహితులమీది నమ్మకంతోవా
రిని ఆశ్రయించినపుడు, వారు చేసిన సాయం ఎలాంటిది? స్వంత కొడుకుల
చేయూతపై ఆధారపడక తప్పని పరిస్థితిలో వారి చెంతకి వెళ్ళిన అతనికి
ఎలాంటి అనుభవాలెదురయ్యాయి? తన సుపుత్రులు తనకి తగిన వారనులేనని
అతనికి బోధపడేసరికి సమయం ఎలా మించిపోయింది?

పశ్చాత్తాపంతో హృదయం దహించుకుపోగా పరిష్కారానికై అన్వేషిస్తున్న
అతనికి వచ్చిన ఆలోచనలెలాంటివి?

ఒకే ఒక్క పరిష్కారంతో అన్ని సమస్యల్నీ తీరుద్దామనుకున్న అతనిమార్గం
ఏమిటి? అతను మంచిదనుకున్న పరిష్కారం ఆచరణలో ఏవిధంగా పరిణ
మించింది? చివరికి అతనికేం మిగిలింది? అందుకు అతను చెల్లించిన మూల్యం
ఎంత?

వ్యసనపరులకి కనువిప్పు కలిగిస్తూ, పాఠకుల హృదయాలను ఆర్ద్రతతో
ద్రవింపచేస్తూ ఎం.ఎస్.ఆర్.చౌదరి రచించిన ఎండమావి
ఈ నెల చతుర సమర్పిస్తున్న సమగ్ర నవల.

# ఎండమావి

రాత్రి పదిదాటింది. సెకండ్‌షోలు కూడా బిగిన్ కావడంతో నగర వీధులు నిశ్శబ్దానికి స్వాగతమిస్తున్నాయి. వీధిలైట్ల ధగధగల్లో ముచ్చట్లు ముగిసిన పెళ్ళివారి ఇల్లులా ఉంది నగరం.

నగరపు నడిబొడ్డులోనున్న ఆడిటోరియం మాత్రం దాదాపు వారం రోజుల్నుంచీ సందడిగానే ఉంది. ఓ సాంస్కృతిక సంస్థ వార్షికోత్సవాలు జయప్రదంగా జరుగుతున్నాయి. నియాన్‌లైట్ల వెలుగులో ధగధగలాడుతూంది ఆడిటోరియం. రక్తవర్ణపు బోర్డ్‌పై నల్లటి కాటుక లాంటి అక్షరాలు సీరియల్ బల్బుల్తో తళతళ్ళాడుతున్నాయి.

"పాండవ వనవాసం" తమ సాంస్కృతికోత్సవాల్లో ఆఖరిభాగంగా ఏర్పాటు చేశారు ఆ సంస్థ సభ్యులు. నాటకం ప్రారంభించి చాలాసేపయింది కాబోలన్నట్లు ఆడిటోరియమంతా ఇసుకవేస్తే రాలనంత జనంతో కిటకిటలాడుతూంది. ఉత్కంఠతతో చూస్తున్నారు ప్రేక్షకులు. నటులు కూడా అవధుల మేరకు తమ పాత్రల్లో లీనమై నటిస్తున్నారు.

సీన్ తర్వాత సీన్ వేగంగా పరుగులుతీస్తున్నాయి. కురు పాండవుల మధ్య జూదఘట్టం ప్రారంభమైంది. చేతికంకణాల్తో సరదాగా మొదలైన జూదం.. వజ్రవైఢూర్య మరకత మాణిక్యాల నుంచి కోశాధికారాల వరకు పాకి, రాజ్యాల దగ్గర్నుంచి వ్యక్తుల పణంవరకూ వచ్చింది. ప్రథమంలో ధర్మజుడు స్వల్ప విజయాలు సాధించినా శకుని మాయోపాయంవలన అంతిమ విజయం సుయోధనుడినే వరించింది. పాండు నందనులతోపాటు ద్రౌపది కూడా ఓడిపోయింది.

ద్రౌపదిని నిండు సభలోకి ఈడ్చించడం, వివస్త్రను గావించప్రయత్నించటం.. శ్రీకృష్ణుడి ద్రౌపదీ మాన సంరక్షణం.. ధృతరాష్ట్రుడి వరాలు... ఆ తర్వాత మరలా జూదం.. అపజయాన్ని చవిచూసిన పాండుసుతుల వనవాసం...

రసవత్తరంగా సాగుతూంది నాటకం.

ఇసుకతిన్నెల మీద ప్రవహించినా.. రాళ్ళ గుట్టలను చీల్చినా.. లోయల్లో పడిపోయినా.. పాయలుగా విడిపోయినా.. చివరకు నదులన్నీ కడలిలో కలిసిపోక తప్పదన్నట్లు లాభనష్టాలెలా ఉన్నా జూదగాళ్ళందరూ దుఃఖసాగరంలో మునుగక తప్పదు. అందుకు ఈనాటికీ ఉదాహరణలే ఆనాటి ధర్మరాజూ.. నలుడూ.. అనుకున్నాడు రెండో వరుసలో కూర్చుని నాటకం చూస్తున్న త్రివిక్రమరావు.

★ ★ ★

కానీ ఆ మర్నాటి ఉదయం...

ప్రాతఃకాలపు ప్రశాంత వాతావరణం నిండు కుండలా తొణక్కుండా ఉందా ఇంట్లో.

ఆటు అలివేలు మంగ వైపు చూడాలో, ఇటు పద్మావతి వైపు చూడాలో అర్థంకాని ఇద్దరు భార్యల వేంకటేశ్వరునిలా అయిదుకీ ఆరుకీ మధ్య ఊగిసలాడుతూంది గోడగడియారంలోని చిన్నముల్లు.

ప్రేయసిని ఏమార్చే ప్రియుడిలా ఆరుని వదిలి ఏడును చేరాలని పరుగెత్తుతూంది పెద్దముల్లు.

ముచ్చటగా మూడు గదులున్న పాతకాలపు పెంకుటిల్లది.

మధ్య గదిలోనున్న తాతలకాలంనాటి పట్టె మంచంపై శేషశయనుడిలా పవళించి ఉన్నాడు త్రివిక్రమరావు.

పూజగదిలోంచి అలలుఅలలుగా తేలి వస్తూంది భాగ్యం కంఠంలోంచి సుప్రభాతం.

వాతావరణంలో అలుముకున్న నిశ్శబ్దాన్ని భగ్నపరుస్తూ ఎక్కడో సైకిల్ బెల్ మోగిన శబ్దం వినబడింది.

ఎవరో పిలిచినట్లు ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు త్రివిక్రమరావు.

మధురంగా వినిపిస్తూన్న సుప్రభాతాన్ని ఆలకించలేదతని కర్ణేంద్రియాలు. చేరువలోనే కూర్చుని చదువుకుంటూన్న వనితపైనా కేంద్రీకృతమవలేదతని నేత్రాలు.

పంచేంద్రియాలూ బయట్నుంచి మరోమారు వినిపించబోయే సైకిల్ శబ్దం కోసం ఎదురుచూస్తున్నాయి.

అంతలోనే మళ్ళీ శ్రావ్యంగా వినిపించిందతనికా చిరపరిచితమైన సైకిల్ బెల్ మరింత దగ్గర్నుంచి.

ఒక్క ఉదుటున మంచంపై నుంచి దూకి




బయటకు పరుగెత్తాడతను.

అతను గేటు తె. మకుని వీధిలోకి అడుగు పెట్టడం పేపర్ బాయ్ పేపర్ విసిరేయడం ఒక్కసారే జరిగాయి. ఇది రోజూ జరిగే తంతే గనుక కనీసం దృష్టి కూడా అటు మరల్చలేదు వనిత.

రాయంచలా ఎగురుకుంటూ వచ్చి అతని హస్తాల్లో వాలింది పత్రిక. ఆప్యాయంగా స్పృశించాయతని చేతులు. వెంటనే లోపలకు పరుగెత్తి లైటు వెల్తురులో నిల్చుని పేపర్ తిరగేశాడు.

నాలుగో పేజీలో అతనిక్కనిపించింది కావాల్సిన విషయం. అయస్కాంతానికి ఇనుములా ఆ పేజీకి అతుక్కుపోయాయతని చూపులు.

ఆ పేజీలో-

పై నుంచి కింది వరకూ ఆకర్షణీయమైన డిజైన్లతో వరుసగా ప్రచురిస్తున్నారు వివిధ లాటరీ ఫలితాల ప్రకటనలు.

ఆరోజు ప్రచురించబోయే ఫలితాల తాలూకు తను కొన్న లాటరీ టిక్కెట్ల నంబర్లను కాగితం తీసి ఒక్కసారి చదువుకుని మనసులోనే మననం చేసుకున్నాడు త్రివిక్రమరావు. ఫొటోస్టాట్ కాపీలా.. ఫిలిమ్‌రీలులా అతని మనోనేత్రం ముందు మెదిలాయా నంబర్లు.

ఒక్కొక్క నంబర్‌ను మననంచేసుకుంటూ పేపర్‌ను పైనుంచి కిందకు శల్యపరీక్ష చేశాడు.

'శ్రీ తిరుపతి సూపర్ వీక్లీ. మొదటి బహుమతి లక్ష రూపాయలు'. తన లిస్టు చూసుకుంటూ నంబర్లవైపు పరిశీలనగా చూశాడు. లక్ష రూపాయల్లో కాదుగదా కనీసం అయిదు రూపాయల్లో కూడా అతని నంబర్ కనిపించలేదు. నిరాశగా నిట్టూరుస్తూ చూశాడు.

'మహాబలి వారం వారం లాటరీ'

'మంగళ వీక్లీ లాటరీ'

'ఖజానా వారం వారం లాటరీ'

'మహారాజ లాటరీ'

-దేశవ్యాప్తంగా ప్రచారంలో ఉన్న ఒక్కొక్క ఫలితం చూస్తుంటే అతని ఉత్సాహం ఒక్కోమెట్టు దిగజారిపోతోంది. ఆసక్తి సన్నగిల్లుతోంది.

"మణిపూర్ స్టేట్ లాటరీ"

నిరాశగా పేపర్‌ని విసిరేయబోయాడు త్రివిక్రమరావు. అప్పుడు ఆఖరిక్షణంలో అతని కంటపడిందా నంబర్.

ఆశ్చర్యంతో ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు. సన్నగిల్లుతూన్న ఉత్సాహం రెట్టింపైంది.

భారతీయ విద్యాభవన్‌వారి విద్యాలక్ష్మి వీక్లీ లాటరీ ఫలితాలవి.

ప్రథమ బహుమతి లక్ష రూపాయలు. సిరీస్ **VGK-226624** శుక్రవారం మధ్యాహ్నం కొనిన టికెట్‌నంబర్ అతని మనసులో మెదిలింది. తన లిస్టు చూసుకున్నాడు.

**VGK-226624.**

తను కొన్న టికెట్‌కు ప్రథమ బహుమతి లక్ష రూపాయలు.

'యా హూ' తనకు యాభై ఆరేళ్ళన్న విషయాన్ని మరచి ఇరవైయేళ్ళ కుర్రాడిలా ఎగిరిగంతేశాడు త్రివిక్రమరావు.

టప్‌మని బుక్ మూసేసి కంగారుగా అతని వైపు చూసింది వనిత. పూజగదిలోంచి ఆందోళనగా పరుగెత్తుకొచ్చింది భాగ్యం. ఆమె పూజింకా ముగిసినట్లు లేదు. పెదవులు మంత్రోచ్చారణగావిస్తూనే ఉన్నాయి. తల వెంట్రుకల్నుంచి నీటి తుంపర్లు రాలుతూనే ఉన్నాయి.

"అహ్హా..హ్హా" పేపర్ చేత పట్టుకుని ఆనందం పట్టలేక ఎగిరి గంతులేస్తున్నాడు త్రివిక్రమరావు.

"ఏమిటండీ?" కంగారుగా అడిగింది భాగ్యం అతన్ని సమీపించి.

"భాగ్యం.. నా భాగ్యం.. ఈనాటికి నా కలలు ఫలించాయి. నీ పూజలు ఫలించి ఆ దేవుడు నన్ను కరుణించాడే భాగ్యం.. ఫస్ట్ ప్రైజొచ్చిందే. లక్ష రూపాయలు... లక్ష రూపాయలొచ్చాయి. లక్కీ. అయాంద లక్కీ ఫెలో" అయసపడ్తూ, ఆనందంతో ఉక్కిరిబిక్కిరవుతూ చెప్పలేక చెప్పాడు.

ఆశ్చర్యం ప్లస్ ఆనందంతో ఉక్కిరిబిక్కిరయ్యారు భాగ్యం, వనితలు. భాగ్యంని కిందకు దించి పూజ గదిలోనున్న చెక్కబీరువా దగ్గరకు పరుగెత్తాడు త్రివిక్రమరావు.

అతనికి ఆనందంగా ఉంది. ఒక్కొక్క

రాజ్యాన్ని జయించుకుంటూ పోతున్నప్పుడు అలెగ్జాండర్ పొందినంత ఆనందం. ఒక్కొక్క విజయాన్ని సాధించినప్పుడు హిట్లర్ అనుభవించినంత సంతోషం. ఫస్ట్ మాచ్‌లోనే సెంచరీ కొట్టినంత ఉత్సాహం. మొట్టమొదటి టెస్ట్ మాచ్‌లోనే పదిహేడు వికెట్లు సాధించిన నరేంద్ర హిర్వాణీకన్నా రెట్టింపు సంబరం.

బీరువా తలుపు తెరిచాడు.

పై అరలో ఇస్త్రీ బట్టలు.

రెండో అరలో ఏవో కాయితాలు.

మూడో అరలో ఉందో చిన్న ఇనప్పెట్టె. త్రివిక్రమరావు తండ్రి వారసత్వపు ఆస్తిగా ఇచ్చిందది.

పెట్టె తెరిచాడతను. లోపల వరుసగా నీట్‌గా దొంతర్లుగా పేర్చున్నాయి లాటరీ టిక్కెట్లు.

హైదరాబాద్‌లో ఎన్నిరకాల లాటరీ టికెట్లు లభ్యమవుతాయో అన్నీ ఉన్నాయా పెట్టెలో. కాలం చెల్లిపోయిన వాటి స్థానాన్ని కొత్త టికెట్లు భర్తీ చేస్తుంటాయి. ఆ పెట్టెలో మొత్తం ఏడు వరుసల్లో ఉన్నాయి టిక్కెట్లు. ఒక్కో వరుస ఒక్కొక్క వారానికి సంబంధించింది. శుక్రవారపు వరుసలో చేయిపెట్టి టిక్కెట్లు చేతిలోకి తీసుకున్నాడు.

'శ్రీ తిరుపతి సూపర్ వీక్లీ లాటరీ'

ప్రైజ్ రాని టిక్కెట్లను చింపేశాడు.

కంగారు ప్రవేశించిందతనిలో... విద్యాలక్ష్మి టికెట్ కనిపించలేదా వరుసలో.

పెట్టెలో చూశాడు.

మిగతా వరుసల్లో గాలించాడు.

సంజీవి కోసం గాలించిన హనుమంతుడిలా, బట్టలన్నీ చిందరవందర చేశాడు. కాయితాలు నేలపాలయ్యాయి.

ఎంతో కష్టపడి సంపాయించుకున్న తాయిలాన్ని ఎవరో ఎగరేసుకుపోయినట్లు ఫీలయ్యాడు.

మిగతా టికెట్స్ ఉన్నాయిగాని ప్రైజొచ్చిన ఆ టికెట్ మాత్రం లేదు. అతని నుదుటిన స్వేదం అలుముకుంది. ఆత్రంగా ఇల్లంతా వెదికాడు.

"ఏమైంది నాన్నా?" అతని వాలకం అర్థంగాక అడిగింది వనిత.

"టికెట్ కనిపించటంలేదమ్మా"

వనిత కూడా అతనికి తోడైంది.

కళ్ళు మూసుకుని ఆలోచించాడు త్రివిక్రమరావు.

నిన్న మధ్యాహ్నం ఒంటి గంటకు రామకృష్ణా థియేటర్ దగ్గరున్న గణేష్ లాటరీ ఏజన్సీలో ఆ టికెట్ కొన్నాడతను. నేరుగా ఇంటికొచ్చి భోంచేసి తిరిగి ఆఫీసకెళ్ళి రాత్రి ఎనిమిదింటికి ఇంటికి తిరిగొచ్చాడు. టికెట్ కొన్నప్పుడల్లా ఆ రాత్రి టిక్కెట్‌ను పెట్టెలో పెట్టడం అతని అలవాటు.

సినిమాలో ఆఖరి సీన్‌లో హీరోకో, హీరోయిన్‌కో హఠాత్తుగా గతం గుర్తొచ్చినట్లు గుర్తొచ్చిందతనికి. మధ్యాహ్నం లంచ్‌కొచ్చినపుడు లాండ్రీ అతను ఇంటికి రావడంతో తను బట్టలు మార్చుకున్నాననీ, తను విడిచిన ఆ బట్టల్లోనే లక్ష రూపాయల విలువచేసే ఆ విద్యాలక్ష్మి టికెట్‌ను మరచిపోయానని అప్పుడు గుర్తొచ్చిందతనికి.

వెంటనే హేంగర్‌కు వేలాడుతున్న షర్టును లాక్కుని తొడుక్కుంటూ పక్కింటికి సైకిల్ కోసం పరుగెత్తాడు. ఆ హడావుడిలో రెండు రోజుల క్రితం అతనితో జరిగిన ఘర్షణ, అతని మొహం తను చూడనని చేసిన ప్రతిజ్ఞ అన్నీ మరచిపోయాడు.

పక్కింట్లో వరండాలోనే స్టాండ్ వేసున్న హీరో సైకిల్ను అడగటం కూడా మరచి స్వంత సైకిల్ను స్వారీ చేసినట్లు కదిలించాడు.

అలికిడి గమనించి స్వంతదారుడు బయటకొచ్చే లోపలే దూసుకుపోయాడు త్రివిక్రమరావు.

"దొంగ... దొంగ" అంటూ అరవబోయిన సైకిల్ ఓనర్ త్రివిక్రమరావును గుర్తుపట్టి అసహనంగా చిందులేసుకుంటూ లోపలికెళ్ళాడు.

త్రివిక్రమరావు దృష్టిలో అతి నికృష్టపు పనేమిటంటే సైకిల్ తొక్కటమే. కానీ అవసర నిమిత్తం తప్పలేదు. పిక్కలు నొప్పెడుతున్నా, మోకాళ్ళు సహకరించకున్నా లెఖ్ఖచేసే స్థితిలో లేడతను.

ఒక్కక్షణం ఆలస్యమైతే ఏమవుతుందోనన్న కంగారు. లక్ష రూపాయలు విలువచేసే లాటరీ టికెట్ గంగపాలు కావచ్చు. చినిగిపోవచ్చు. మరేదైనా కావచ్చు.

అప్పటికింకా పూర్తిగా తెల్లవారకపోవడంతో నగర వీధులింకా వేడిని పుంజుకోలేదు. రష్ లేకపోవడంతో రెండు కిలోమీటర్ల దూరాన్ని అయిదే అయిదు నిముషాల్లో అధిగమించి లాండ్రీవాలా ఇంటిముందు సైకిల్ ఆపి దిగాడు త్రివిక్రమరావు.

స్టాండ్ వేయాలనే విషయం కూడా మరచి ''రాజయ్యా... రాజయ్యా'' అంటూ ఎలిగెత్తి అరుస్తూ లోపలకు వెళ్ళాడు. ధన్‌మంటూ కిందపడిన సైకిల్ శబ్దాన్ని వినిపించుకునే స్థితిలో కూడా లేడతను.

రాజయ్య లేడు. అతని భార్య కూడా లేదు. అతని కూతురు కాబోలు ఓ నాలుగేళ్ళ పాప మాత్రం ఉంది.

''పాపా... మీ నాన్న లేడామ్మా?''

నాలుగైదు ప్రశ్నలు. జవాబులు తర్వాత రాజయ్య బట్టలు తీసుకుని సిటీ చివరున్న వాగుకు వెళ్ళాడని అర్థమైందతనికి.

గుండె గుభిల్లుమంది త్రివిక్రమరావుకు. బి.పి., టెంపరేచర్ రైజయ్యాయి. వెంటనే బయటకు పరుగెత్తి సైకిల్ లేవనెత్తి సిటీ లిమిట్స్ వైపు సాగిపోయాడు.

సిటీకి దక్షిణంగా రెండు కిలోమీటర్ల దూరంలో పారుతుందో ఏరు. పుష్కలంగా నీరులేకపోయినా రజకులకు మాత్రం సరిపోతాయి. ఏటిగట్టున సహచరులతో బిజీగా ఉన్నాడు రాజయ్య.

సైకిల్ ఆపి ఒక్కొక్క మనిషినీ శల్యపరీక్ష చేసుకుంటూ అయిదు నిముషాల తర్వాత రాజయ్యను సమీపించాడు త్రివిక్రమరావు.

ఉతకటం ఆపి కంగారుగా వస్తూన్న అతని వైపు ఆశ్చర్యంగా చూస్తున్నాడు రాజయ్య. అప్పటికే త్రివిక్రమరావు బట్టల్ని నీళ్ళలో ముంచేస్తున్నాడతను.





ముందురోజు విడిచిన పాంట్, షర్టులను గుర్తించి నీళ్ళల్లోంచి బయటకు తీశాడు త్రివిక్రమరావు.

షర్టుజేబులో వెదికాడు. టికెట్ లేదు.

పాంట్ బాక్ పాకెట్లో కనిపించింది మడతలు పెట్టున్న లాటరీ టికెట్.

యుద్ధరంగంలో విజయం సాధించిన వీరుడిలా, తేలిగ్గా నిట్టూర్చాడు త్రివిక్రమరావు.

అతని కళ్ళల్లో రిలీఫ్.

బాగా నాని చిరిగిపోవటానికి సిద్ధంగానున్న టికెట్‌ను జాగ్రత్తగా మడతలు విప్పాడతను. ఒక్కొక్క మడత విప్పుతుంటే చేతులు స్వల్పంగా వణుకుతున్నాయి.

టెన్షన్... ఆరాటం... ఆ లక్షరూపాయల్ని ఏంచేయాలనే ఆలోచనలు... ఉద్వేగం... ఉత్సాహం... ఉత్సుకత అతని మనసును ప్రశాంతంగా ఉండనీయటంలేదు.

షాక్... కరెంట్ ప్లగ్‌లో వేలు పెడితే కలిగేటువంటి షాక్.

చల్లటి నీళ్ళతో మొహంపై కొట్టినట్లు ఉక్కిరిబిక్కిరయ్యాడతను. ఆ టికెట్‌పై కనిపించిన నంబర్ చూసి.

మంచి నీటికొలననుకుని దగ్గరకుపోతే అది ఎండమావి అయినట్లుందతని పరిస్థితి.

అక్షరాలు... అంకెలు అలుక్కుపోయాయి.

కళ్ళు తుడుచుకుని మరీ మరీ చూశాడు.

అతన్ని వెక్కిరిస్తూ కనిపించింది నంబర్.

**'VGL - 226624'**

శిఖండి దెబ్బకు నేలకొరిగిన భీష్మునిలా... ఆ టికెట్ వైపు నిర్లిప్తంగా చూస్తుండిపోయాడు త్రివిక్రమరావు.

★ ★ ★

లాటరీ టికెట్లుకొనే అలవాటు అతి విచిత్రంగా అలవడింది త్రివిక్రమరావుకి.

అతని ఇరవైమూడో ఏట ఉద్యోగంలో చేరిన తొలిరోజుల్లో... ఆఫీస్ ఎదురుగా నున్న పాన్ షాప్‌లో ఓరోజు సిగరెట్లు కొన్నప్పుడు చిల్లరకు బదులు ఓ లాటరీ టికెట్‌ను అతని చేతిలో పెట్టాడు షాపతను.

ఆశ్చర్యంగా చూశాడు త్రివిక్రమరావు అది బిజినెస్ టెక్నిక్కని తెలీక.

"ఉంచండి సర్... చిల్లరలేదు" నవ్వాడతను.

వినోదంగా టికెట్ వైపు చూశాడు త్రివిక్రమరావు. అతని జీవితంలో లాటరీ టికెట్‌ను టచ్ చేయటం... ప్రత్యక్షంగానైనాగాని... పరోక్షంగానైనాగాని అదే మొదటిసారి. అలా అని వాటిని చూడలేదని కాదు... ఎప్పుడూ కొనాలనుకోలేదు అంతే.

నాలుగురోజుల తర్వాత ఆ టికెట్ తాలూకు ఫలితాలను పేపర్లో ప్రకటించారు.

ఉత్సాహంగా పేపర్లో వెదికాడతను.

అతని కళ్ళు మెరిశాయి...

అతని దగ్గరున్న టికెట్‌కు అయిదొందలొచ్చాయి.

అప్పటికి తొలినెల జీతాన్ని కూడా అందుకోలేదతను.

అదే అతని మొదటి సంపాదన.

కష్టపడకుండా వచ్చినటువంటి సంపాదన. కేవలం రూపాయి పెట్టుబడితో అయిదు వందలు లాభం...

ఆ మరుసటివారం పది టికెట్లు కొన్నాడతను... ఓ దానికి పది రూపాయలు మాత్రం వచ్చాయి. ఆ తర్వాత మరో వంద రూపాయలు.

బిగినర్స్ లక్ అంటే అదేనేమో... మొట్టమొదట అంతా లాభమే... నష్టముండదు. ఏదైనా అంతే... పొరపాటుగా ప్రారంభమై... అలవాటుగా మారి చివరకు గ్రహపాటవుతుంది.

త్రివిక్రమరావుకు పెరుగుతున్న వయసుతో పాటు లాటరీ టికెట్లపై ఆసక్తి కూడా పెరిగింది. అయితే అప్పుడప్పుడూ చిన్నచిన్న మొత్తాలను సాధిస్తున్నా... మొత్తం మీద నష్టమే ఎక్కువ.

ప్రపంచంలో జూదంలో కేవలం నిర్వాహకులు తప్ప లాభం పొందినవాడెవడూ లేడని ఘంటాపథంగా చెప్పొచ్చు.

త్రివిక్రమరావుకి పెళ్ళైన తర్వాత మరో అలవాటు వంటబట్టింది. భార్య తొలికాన్పుకని పుట్టింటికెళ్ళిన రోజుల్లో... నిద్రపట్టని రాత్రులను సెకండ్ షో సినిమాలతో గడిపేవాడు. ఓరోజు రాత్రి సరదాగా ఓ ఫ్రెండ్‌తో కలిసి మట్కాకు వెళ్ళాడు.

కుతూహలం కొద్దీ తనూ ఓ నంబర్‌పై పది రూపాయలు కాశాడు. చిత్రం- వంద లాభం వచ్చాయి.

మరో రోజు అదే ఫ్రెండ్‌తో వెళ్ళాడు. వెయ్యిపైనే వచ్చింది.

ఈసారి ఫ్రెండ్ సాయం లేకుండానే వెళ్ళాడు. రెండొందలదాకా వచ్చాయి.

అదే సమయంలో పరిచయమైన ఓ హస్త సాముద్రికుడు... మీ జీవితంలో జూదాలు అచ్చొస్తాయనీ... వాటి వలనే ఏనాటికైనా లక్షాధికారవుతారనీ... జోస్యం చెప్పి ఓ పది వదలగొట్టాడు.

అంతే! ఆ క్షణంనుంచీ లాటరీ టికెట్లకు... మట్కాకు అంకితమైపోయాడు త్రివిక్రమరావు.

క్రమంగా అదొక వ్యసనంగా మారిపోయిందతనికి. నెలజీతంలో దాదాపు సగంపైనే వాటిమీద వెచ్చించసాగాడు. పిల్లలు పెద్దవాళ్ళైనా అతని అలవాటులో మార్పు రాలేదు.

వెనకటికి ఎవరో అన్నారట- వేసవికాలమైతే బీరు... శీతాకాలమైతే బ్రాందీ సేవించి... కారాకిళ్ళీ వేసుకుని... సాయంత్రాలు అలా సానివాడల మీదుగా షికారు కెళ్ళటం తప్ప మగాడికె లాంటి చెడు అలవాట్లు లేవని...

త్రివిక్రమరావుకి కూడా లాటరీలు... మట్కా... సిగరెట్లు తప్ప మరే వ్యసనాలు... సరదాలూ ఇంచుమించు లేవనే చెప్పొచ్చు... ఎప్పుడో నెలకో సినిమా... అదీ భార్య బలవంతపెడితేనే.

హైదరాబాద్‌లో ఎన్ని లాటరీ టికెట్లు చలామణీలో ఉండేవో అన్నీ కొనేవాడు. కొండొకచో ప్రైజులు కూడా వచ్చేవి. ఏనాటికైనా కనీసం లక్ష రూపాయల ఫస్ట్‌ప్రైజ్ కొట్టాలనేది అతని జీవితాశయం. హస్త సాముద్రికుడు చెప్పిన మాటలతని మనసులో సదా మెదుల్తూనే ఉన్నాయి.

ఇక ప్రస్తుతానికొస్తే-

'రాఘవా లాటరీ ఏజెన్సీ' షాపు ముందు నిల్చుని ఉన్నాడు త్రివిక్రమరావు. అతని చే



తిలో ఆరోజే విడుదలైన ఓ వారపత్రికుంది.

రాశిఫలాలను అతి శ్రద్ధగా చదువుతున్నా డు.

"ఈ రాశి స్త్రీ పురుషాదులకు యోగ్యం. ఉద్యోగావకాశాలున్నాయి. సంపదాభివృద్ధి... ఐశ్వర్యాభివృద్ధి... రాజకీయరంగాభివృద్ధి... ఒక టేమిటి సకల సంపదాభివృద్ధి. కొందరికి ఏదో నెపంతో విదేశగమనం చెప్పదగిన ము ఖ్యాంశం. కొందరు నూతన వృత్తిని చేపట్టను న్నారు. నూతనగృహ నిర్మాణానికి కొందరికి సదవకాశం. వృత్తి వ్యాపారములందు ప్రతి బంధకములున్ననూ సమసిపోవును. వివాహాని కై యత్నించువారికి బంధుసంబంధం నిశ్చయం... కళారంగాన ప్రసిద్ధిగలవారికి సక లాభీష్టాలు తీరతాయి. విరోధవర్గం వారాంతాన తల ఎత్తవచ్చు. గ్రహింపగలరు... మొ త్తంమీద పట్టిందల్లా బంగారమే..."

తృప్తిగా చదువుకున్నాడు త్రివిక్రమరావు. 'పట్టిందల్లా బంగారమే' అన్న వాక్యం అతనికి బాగా నచ్చింది. మొత్తం మీద అతని రాశి శుభమగ్గా ఉంది. అంతా లాభదాయకమే...

ఉత్సాహంగా రాశిఫలాలిచ్చిన నూతన బలంతో టికెట్లు కొంటూ షాపతనివైపు ఈర్ష్యగా చూశాడతను. ప్రతిరోజూ అక్కడ టికెట్లు కొ నటం... అతని వైపలా చూడ్డం అతని కలవా టైపోయింది నాలుగైదు నెలలుగా... అందుకు కారణముంది కూడా.

మొదట్లో అంటే నాలుగైదు నెలల క్రితం వరకూ్కడా బజార్ల వెంబడి తిరిగి టికెట్లమ్మేవా డు రాఘవ. ఓ రిక్షాబండి తొక్కుకుంటూ గొంతు చినిగిపోయేలా అరుస్తూ... ఎలాగైతేనేం డ్రా తేదీకి ముందే ఆ టికెట్లన్నీ అమ్మేసేవాడు.. ఓ వారం మాత్రం ఎంత కష్టపడినా ఆఖరి నాలు గు టికెట్లని అమ్మలేకపోయాడు.

అదే అతనికి భాగ్యాన్ని కొని తెచ్చింది.

అమ్మలేకపోయిన ఆ నాలుగు టికెట్లని తనే ఉంచుకున్నాడు రాఘవ. అదృష్టవశాత్తూ ఓ టికెట్‌కు యాభైవేల సెకండ్ ప్రైజొచ్చింది. వెంటనే రిక్షాబండిని అమ్మేసి... మాంచి సెంట ర్లో ఓ షాప్‌ను రెంట్‌కు తీసుకుని రాఘవా లాటరీ ఏజెన్సీని ఓపెన్ చేశాడు. ప్రస్తుతమ తని సంపాదన... 'మూడు లాటరీలు ఆరు టికెట్లు'గా ఉంది.

కష్టించకుండా లక్షలు సంపాదించాలను కునే త్రివిక్రమరావులాంటి వాళ్ళున్నంతవ రకూ రాఘవలాంటి వాళ్ళ సంపాదన కడ్డే ముంది?

లాటరీ టికెట్లుకొని వెనుదిరిగిన త్రివిక్రమ రావెదురుగా ప్రత్యక్షమయాడో వ్యక్తి. దాదాపు యాభై సంవత్సరాలుంటాయతనికి. తైల సంస్కారాల్లేని జుట్టు... శుభ్రతకి విడాకులి చ్చి... అశుభ్రతని వివాహమాడిన బట్టలు... దుర్గంధానికి పుట్టిల్లైన శరీరం... అసహ్యానికి మెట్టిల్లైన చూపులు... పిచ్చోడిలా ఉన్నాడతను.

"ఇహ్హి... హ్హి... హ్హి..." అంటూ నవ్వాడా వ్యక్తి.

అతనివైపు జాలిగా చూశాడు త్రివిక్రమ రావు.

లాటరీ... ఫస్ట్ ప్రైజ్... లక్షరూపాయలు... అహ్హహ్హ... నేనే లక్షాధికారిని... అహ్హహ్హ..." అంటూ బిగ్గరగా నవ్వాడతను.

లాటరీల వల్ల ప్రత్యక్షంగా నష్టపోయిన వ్యక్తతను. అతని పేరు రామనాథం. త్రివిక్రమ రావుకు బెస్ట్‌ఫ్రెండ్ ఒకప్పుడు...

బాధగా చూస్తూ నిట్టూర్చాడు...

అందం జారిపోయి... వయసుడిగిపోయిన వేశ్యకుండే ఫ్లాష్‌బాక్‌లాంటిది రామనాథం ఫ్లాష్‌బాక్...

అతను ఒకప్పుడు బాగా బతికినవాడే... మూడు సంవత్సరాల క్రితం వరకూ లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్లో పని చేస్తుండేవాడు. హాస్యప్రియుడు... శాంతిప్రియుడు... లాటరీ ప్రియుడు... మట్కాప్రియుడు... ఒక విధంగా చెప్పాలంటే త్రివిక్రమరావుకు మట్కాపై కలి గిన అభిమానం అతని సావాసదోషమే.

రామనాథానికి నలుగురు పిల్లలు. ఇద్దరు కొడుకులు, ఇద్దరు కూతుళ్ళు. కొడుకులు ఉద్యో గనిమిత్తం వేరే ఊర్లలో స్థిరపడ్డారు. కూతుర్లిద్ద రూ పెళ్ళిళ్ళై అత్తవారిండ్లలో ఉన్నారు.

మూడు సంవత్సరాల క్రితం రామనాథం కొన్న లాటరీ టికెట్‌కు ఫస్ట్ ప్రైజ్ రెండు





లక్షల రూపాయలొచ్చాయి. అంతకు ముందు అతనికి హార్ట్‌ఎటాక్ వచ్చిందని టెలిగ్రాంలిచ్చినా అవి అందలేదనే మిషతో కనీసం చూడ్డానికైనా రాని కన్నబిడ్డలు. అతనికి రెండు లక్షలొచ్చాయని ఎలా తెల్సిందో... ఏ కాకి కబురుమోసుకెళ్ళిందో కాని... బహుమతి డబ్బును రామనాథం బీరువాలో దాచే సమయానికే వచ్చారు.

అప్పుడు చూశాడు రామనాథం... మనుమల్లోని కుత్సిత బుద్ధి యొక్క విశ్వరూపాన్ని. డబ్బు కోసం మనుమలెంత నీచానికైనా దిగజారగలరనే వాస్తవాన్ని కన్నబిడ్డల ప్రవర్తనలోనే చూశాడతను.

దేవుడికి పూజలు చేసినట్లు... కొత్తల్లుడికి మర్యాదలు చేసినట్లు రామనాథాన్ని సేవించారు రెండు రోజులు. ఆ తర్వాత వెళ్ళగక్కారు తమ మనసుల్లోని విషాన్ని.

"నాన్నా... ఆఫీస్‌కెళ్ళాలంటే చాలా కష్టంగా ఉంది. స్కూటర్ కొనాలనుకుంటున్నా. ఓ ఇరవై వేలు సర్దండి..." పెద్ద కొడుకు అభ్యర్థన...

"కలర్ టీ.వీ... ఫ్రిజ్ కొనాలని మీ కోడలు ముచ్చట పడుతూంది. డాడీ... ఓ పాతిక వేలు..." రెండో వాడి నసుగుడు.

"నాన్నా... పెళ్ళైంతర్వాత మిమ్మల్ని ఆయనేమీ అడగలేదు. కనీసం ఇప్పుడో స్కూటరైనా...?" పెద్దమ్మాయి అప్లికేషన్.

"డాడీ... ఓ ప్లాట్ కొనుక్కుని ఇల్లు కట్టుకోవాలనుకుంటున్నాం... మీ సహాయం..." చిన్నమ్మాయి డిమాండ్.

అందరి కోరికలనూ ఆలకించాడు రామనాథం. చివరగా ఒకే ఒక సమాధానం చెప్పాడు.

అదే. అదే రామనాథం తన జీవితంలో చేసిన మొట్టమొదటి పొరపాటు. అందుకు పెనాల్టీని చాలా దారుణంగా చెల్లించాల్సొచ్చింది.

తెల్లవారేసరికల్లా రామనాథం పిచ్చివాడయ్యాడు. లాటరీ డబ్బును నలుగురు వారసులూ పంచుకున్నారు.

రామనాథం గతం గుర్తొచ్చి... జాలిగా నిట్టూర్చాడు త్రివిక్రమరావు.

'కొందరి వ్యసనపరుల జీవితాలలాగే అంతమవుతాయి.'

"రాజమండ్రి సంబంధం గురించి ఏమాలోచించారు?" కాఫీ అందించి ఎదురుగా కూర్చుంటూ అడిగింది భాగ్యం.

వినిపించనట్లే నటిస్తూ పేపర్లో తలదూర్చాడు త్రివిక్రమరావు.

"మిమ్మల్నే" రెట్టించింది భాగ్యం.

"ఏ...మి...టి?..."

"అదే... రాజమండ్రి సంబంధం గురించి ఏమాలోచించారూ అని?"

"ఆలోచించటానికేముంది... ఓ నమస్కారం పెట్టేద్దామనుకుంటున్నాను..."

"మంచి సంబంధమండీ... అమ్మాయి సుఖపడుతుంది. మరోసారి ఆలోచించండి"

"ఏమాలోచించను- వాళ్ళు రెండు లక్షల్దాకా అడుగుతున్నారు. పైఖర్చులకు మరో పాతికవేలన్నా కావాలి. ఎక్కడ్నుంచి తేను?" విసుగ్గా అన్నాడతను.

"అలాగని గుండెలపై కుంపట్లా ఎదిగిన అమ్మాయిని ఎన్నిరోజులని ఇంట్లో పెట్టుకుంటాము. ఏదో ఒక సంబంధం చూసి ముడెయ్యాలిగాని" అనునయంగా అంది భాగ్యం.

"నేనూ అదే అనుకుంటున్నాను... కానీ మార్గమే కనపడ్డంలేదు... అడుక్కుతినేవాడు కూడా లక్ష కావాలంటున్నాడు. ఆడపిల్ల తండ్రంటే మరీ అంత చులకనైపోయింది..."

"ఇన్ని బాధలనుభవించే బదులు మా అన్నయగారి..."

"భాగ్యం" ఆమె మాటలు పూర్తికాకముందే గర్జించాడు త్రివిక్రమరావు... చేదు మాత్రను మింగినట్లు అయ్యిందతని మొహం.

"నీకెన్నిసార్లు చెప్పాను, నా బొందిలో ప్రాణముండగా వాడి గడపతొక్కనని వాడి ఊసు మరో మారెత్తావంటే ముందు నిన్ను ముక్కలు ముక్కలుగా నరుకుతాను" ఆవేశంతో అర్చాడు త్రివిక్రమరావు.

'పౌరుషాలకేం కొండంతుంది. చాతగానివా

డికి ఆకలెక్కువని, మనసులోనే గొణుక్కుంది

"ఏమిటే నీలో నువ్వే గొణుక్కుంటు న్నావ్...?" కాఫీ కప్ కింద పెడుతూ ఉరిమాడ తను.

"ఏమీలేదు... పరిస్థితులు మారినప్పు డైనా... కాస్త పౌరుషాన్ని విడువకుంటే ఎలా?..." మెల్లగా అంది.

"ఏమైందిప్పుడు మన పరిస్థితులకే మైందని తిండి కరువైందా... గుడ్డ కరు వైందా?..." నింపాదిగా అడిగాడు...

"మనశ్శాంతి కరువైంది. ఒపక్క ఆడపిల్ల ఎదిగి ఆరేడేళ్ళయింటే కంటికి కునుకెలా పడ్తుందండీ... మీకన్నా చిన్న ఉద్యోగస్తులు... తక్కువజీతం సంపాదిస్తున్న వాళ్ళూ ఇద్దరు ముగ్గురు కూతుళ్ళని కూడా వేలకు వేలు కట్నా లిచ్చి సాగనంపుతుంటే... మీరేమో ఒక్కగానొ క్క అమ్మాయికి పెళ్ళి చెయ్యలేక సతమతమ వుతున్నారు. ఎందుకొచ్చిన ఖర్మండీ ఇదీ..." ఆవేదనగా అందామె... ఎదిగిన కూతురికి పెళ్ళిచేయలేకపోయాననే బాధ... దుఃఖం స్ప ష్టంగా కనిపిస్తున్నాయా తల్లి హృదయంలో.

"ఇప్పుడు నన్నేంచేయమంటావ్?" విసుగ్గా అన్నాడతను... ఉదయాన్నే సుప్రభాతంలా ఈ సంభాషణ మొదలవటం కంపరంగా ఉంద తనికి.

"పరిస్థితులనెరిగి మెలగమంటున్నాను... ఇప్పటికైనా బాధ్యతలనెరిగి ఆ దుర్వ్యసనా లకు దూరం కమ్మంటున్నాను... మీ జీతంలో సగంపైనే తగలేస్తున్నారు వాటికి. ఆ డబ్బుల్ని నిల్వ చేసుకొనున్నా ఈనాడు మనకీఅవస్థ వచ్చుండేది కాదు గదా..."

"ఒసేవ్" ఆమె మాటలు పూర్తికాకముందే కోపంతో అరిచాడతను... "ఎంత ధైర్యమే నీకు... నాకు బాధ్యతల గూర్చి క్లాస్ తీసు కుంటున్నావా... ముగ్గురు కొడుకుల్ని చది వించి ఉద్యోగాలిప్పించానే... నాకు తెలీదా బాధ్యత. అవునే జీతంలో నగంపైనే కాదు, పూర్తిగా ఖర్చుపెట్టుకుంటాను... నా జీతం నా ఇష్టం. నేను కష్టపడి సంపాదిస్తున్నాను... అదేం నీ బాబుగాడి ముల్లెకాదు. ఇంకోసారి నా జీతం గురించి నా అలవాట్ల గూర్చి మాట్లాడా వంటే పళ్ళురాలగొడ్తాను" విసురుగా అని ఛివాలున కుర్చీలోంచి లేచి బయటకు వెళ్ళా డతను.

నిస్సహాయంగా చూస్తుండిపోయిందామె. చిన్నపిల్లాడికైతే దండించి చెప్పగలదు... తెలి సినవాడికీ... తెలీనివాడికీ చెప్పగలదు... కాని తెలిసీతెలియని మూర్ఖుడికి... అందునా భర్తకు ఎలా చెప్పగలదు.

మూగగా రోదిస్తోందామె. దూరంగా నున్న కన్నబిడ్డలూ తననాలకించరు... దగ్గరున్న భర్తా తన మాట వినిపించుకోడు... మరోవైపు ఎదిగిన కూతురు బాధగా నిట్టూర్చింది.

* * *

"వదినా... ఓ గిన్నెడు కాఫీపొడుంటే అప్పి స్తావూ?" పెద్దలు ఆఫీసులకూ పిల్లలు స్కూళ్ళ కూ వెళ్ళిం తర్వాత తీరిగ్గా వచ్చింది కామాక్ష మ్మ...

"దానికేం వదినా... రా...లోపలకు రా" కూర గాయలు తరుగుతూ ఆహ్వానించింది భాగ్యం.

'కామాక్షమ్మ పరిచయముంటే చాలు రేడి యోలెందుకు దండగ' అనేది ఆ కాలనీ నానుడి.

"ఇష్‌ష్... అప్పుడే ఎండలు మండిపోతు న్నాయి వదినా... ఏం కాలమో పాడే..." పైట చెంగుతో విసురుకుంటూ భాగ్యానికెదురుగా కూలబడింది కామాక్షమ్మ... కూరగాయలు తరు క్కుంటూనే ఆలోచనలో పడింది భాగ్యం... ఊరకరారు మహాత్ములన్నట్లు కామాక్షి రాక వెనుక ఏదో ఉద్దేశముంటుంది. కాఫీపొడి కే వలం సాకు మాత్రమే... నాలుగు కబుర్లు చెప్పి దెప్పిపోవటం ఇరుగుపొరుగు కబుర్లు చెప్పి జగడాలు కల్పించటం ఆమెకున్న స్పెషల్ క్వాలిఫికేషన్స్...

"అన్నట్టు... ఈ విషయం విన్నావా వదినా?" సంభాషణకి నాందీగా పురాణానికి ఉపోద్ఘాతంగా అంది కామాక్షి.

"ఏ విషయం... ఇప్పుడేగా నువ్వొచ్చింది.. అప్పుడే ఎలా తెలుస్తుంది?"

"గుమస్తాగారమ్మాయి సరస్వతికి పెళ్ళి కుదిరిందట"

"అవునా...?"





"అవును వదినా - అబ్బాయి నీకు తెలుసుగా ఈదారంటే వెళుతుంటాడు... ఎర్రగా, పొడుగ్గా ఉంటాడు. అదేదో బ్యాంక్‌లో పనిచేస్తూంటాడట... కానీ కట్నంలేకుండా చేసుకుంటున్నాడట..." గబగబా చెప్పింది.

"అలాగా!" అంది భాగ్యం ఏమాత్రం ఆసక్తిలేనట్లు... దేశంలో అందరి కూతుళ్లకూ పెళ్ళిళ్ళవుతున్నాయి ఒక్క తన కూతురికి తప్ప.

"నీకీ విషయం తెలుసా వదినా... ఆ అబ్బాయికీ, సరస్వతికీ ముందునుంచే సంబంధాలున్నాయట. రెండుమూడు అబార్షన్‌లు కూడా చేయించారట... వాళ్ళకీ మాకూ పనిమనిషి ఒకరేగా. అది చెప్పింది" లోగొంతుకతో అంది కామాక్షి.

"సంసారం అన్నాక ఎన్నో గుట్టుమట్లుంటాయి. అవన్నీ మనకెందుకులే వదినా"

ఆ ప్రస్తావనని కట్ చేయాలని అంది భాగ్యం. లేకుంటే అదే విషయాన్ని గూర్చి ఈ వారమంతా చర్చింగల సమర్థురాలామె.

"నిజమే వదినా... కాపురమన్నాక లోటుపాట్లుండకపోతాయా. మనమ్మాయికి ఈ ఏడు చేస్తారా వదినా?" కాజువల్‌గా అడిగింది.

"చెయ్యాలనుకుంటున్నాం" నీర్సంగా చెప్పింది భాగ్యం.

"అన్నట్టు మనమ్మాయికెన్నేళ్ళు వదినా?"

"మొన్న జనవరికి ఇరవై నిండాయి"

"అమ్మో..." ఆశ్చర్యం నటిస్తూ గుండెలపై చేయేసుకుంది కామాక్షమ్మ.

"అంటే ఇరవైఒకటి వచ్చిందన్నమాట. ఏ పదహారో పదిహేడో అనుకుంటున్నా. నీకు నిద్రెలా పడుతోందొదినా. ఎదిగిన కూతుర్ని అలక్ష్యం చేస్తే ఇంకేమైనా ఉందా. ఆ సరస్వతి చూడు ఏమైందో... అబార్షన్ కాడికొచ్చింది వ్యవహారం. తొందరపడు వదినా."

"ఎవరో అలా ఉన్నారని అందరూ అలానే ఉంటారా. అమ్మాయి చదువుకుంటోందిగా- ఇప్పుడే పెళ్ళి వద్దంటోంది"

"ఏ పుట్టలో ఏ పాముంటుందో ఎవరు చెప్పగలరొదినా. దొరికేదాకా అందరూ దొరలే. మనకాలంలో ఇలాంటినివి ఎరుగమమ్మా... పెద్దమనిషైన సంవత్సరమే ఆ అక్షింతలు పడేవి. ఏం చదువులోపాడో- ఈ మాయదారి చదువులొచ్చి ఆడపిల్లల్ని నాశనం చేస్తున్నాయి. నేను చూడు- మా అమ్మాయికి పదిహేడేళ్ళకే పెళ్ళి చేసేసి బరువుదించుకున్నాను. చేతులు కాలింతర్వాత ఆకులు పట్టుకుని ఏం ప్రయోజనం లేదొదినా... ముందే జాగ్రత్తపడు. నా ఎరికలో రెండు మూడు సంబంధాలున్నాయి చూడమంటావా?" తన సుదీర్ఘ ప్రసంగానికి బ్రేకేస్తూ .ఆగింది కామాక్షమ్మ.

నిజమే... కామాక్షమ్మ తన కూతురికి చిన్నవయస్సులోనే పెళ్ళిచేసేసి భారం దించుకుంది. ఆ పిల్ల హైస్కూలు స్థాయినుంచే సకలకళా ప్రవీణురాలవటం గమనించి కామాక్షి జాగ్రత్త పడిందనేది ఆ కాలనీవాసులందరూ ఎరిగిన బహిరంగ రహస్యమే.

ఏం చెప్పాలో అర్థంగాక మౌనం వహించింది భాగ్యం.

'నిజమే- భర్త చెప్పినట్లు ఆడపిల్లకు పెళ్ళి చేయలేని తల్లిదండ్రులంటే అందరికీ లోకువే'

ఆమె మౌనాన్ని అంగీకారంగా భావించి విజృంభించింది కామాక్షి.

"మా ఇంటికి అప్పుడప్పుడు వస్తూంటాడు చూడొదినా- ఎర్రగా పొడుగ్గా ఉండే కుర్రాడు.. మాకు దూరబంధువవుతాడులే. ఇక్కడే మునిసిపాలిటీలో పనిచేస్తున్నాడు. పనితను ఇష్టపడుతున్నాడు. కట్నం కూడా తక్కువే... మాట్లాడమంటావేమిటి?" కాస్త ముందుకు వంగి ఆమె మొహంలోకి చూస్తూ అడిగింది.

నివ్వెరపోయింది భాగ్యం. ఆ యువకునికీ కామక్షమ్మకూ అక్రమ సంబంధం ఉందని అందరికి తెలును. తెలునని ఆమెకు కూడా తెలును.

తెలిసే ఇలా అడుగుతోందంటే..

అసహ్యంగా చూసింది భాగ్యం.

ఆమె మొహంలో మారుతున్న భావాలను గమనించి తడబడుతూ లేచింది కామక్షమ్మ.

"నీ యిష్టమొదినా.. ఆలోచించుకుని చెప్పు. తర్వాత వస్తాను" అంటూ కాఫీపొడి

విషయాన్ని కూడా మరిచి గబగబా వెళ్ళిపోయింది.

కూరగాయలు తరగటం కూడా మరచిపోయి ఆమె వేపే చూస్తూండి పోయింది భాగ్యం.

ఏమైనా సరే- అమ్మాయి పెళ్లి ఈ ముహూర్తాల్లోనే చేసెయ్యాలి- మనసులో అనుకుంటూ వంటపనిలో లీనమైంది.

* * *

లంచ్‌కి లేస్తుంటే త్రివిక్రమరావును కలుసుకున్నాడు కొలీగ్ సదానందం.

దూరపు బంధుత్వం కూడా ఉంది వాళ్లిద్దరికీ.

"ఏమోయ్... కులాసానా?" చిరునవ్వుతో పలకరించాడు సదానందం.

"ఇప్పటివరకూ అంతా కులాసాయే. ఇప్పుడు మీరు వచ్చారుగా- ఇక ఆలోచించాలి" నవ్వుతూ చెప్పాడు త్రివిక్రమరావు.

"వయసు పెరుగుతున్నా హాస్యానికేం కొదవలేదు. పద... అలా వెళ్ళి సిగరెట్ తాగుతూ మాట్లాడుకొందాం"

ఏదో విషయంలేందే అతనలా రాడని



తెల్సిన త్రివిక్రమరావు కుర్చీలోంచి లేచి అతన్ననుసరించాడు. ఆఫీస్ బయటున్న చెట్ల కింద నిల్చున్నారిద్దరూ. ఆఫీస్ స్టాఫంతా కాంటీన్లోకి వెళుతున్నారు. ఇల్లుదగ్గరే కావటంతో త్రివిక్రమరావు మాత్రం లంచ్‌కి ఇంటికెళ్తూంటాడు.

"అమ్మాయికి సంబంధాలు చూస్తున్నావా?" సిగరెట్ వెలిగించి అడిగాడు సదానందం.

"చూస్తున్నాన్రా... ఏదీ కలసిరావడంలేదు" ఆలోచిస్తూ చెప్పాడు త్రివిక్రమరావు. అతనికీ సాధ్యమైనంత త్వరగా వనిత పెళ్ళిచేసెయ్యాలనుంది. ఏదీ కలసిరావట్లేదు. రెండు మూడు సంబంధాలు చూస్తే కట్నపు రేట్లు చుక్కల్నంటుతున్నాయి. తన దగ్గరా పైసా కూడా లేదు. తాతలనాటి ఇల్లు మాత్రం ఉంది. ముగ్గురు కొడుకుల్ని చదివించి పెళ్ళిళ్ళు చేసేసరికి సరిపోయింది తన పని. వనిత పెళ్ళికి కొడుకుల్నడగాల్సిందే.

"నా దృష్టిలో ఓ సంబంధముంది... ట్రై చేయమంటావా?"

"ఏ ఊరు?"

"ఈ ఊరే. మనాఫీసులోనే 'ఇ' సెక్షన్లో పన్చేస్తున్నాడు చూడు భరద్వాజని, అతని కొడుకు. పేరు భాస్కర్. ఎం.ఏ. చదివాడు. ఇక్కడే స్టేట్‌బాంక్‌లో వర్క్ చేస్తున్నాడు. లక్షణమైన కుర్రాడు. నాకు బాగా తెలుసు"

"ఎవరూ లాటరీ భరద్వాజ కొడుకా?"

పోయిన సంవత్సరం తుఫాన్ బాధితుల సహాయార్థం విరాళాలను పోగుచేసే నిమిత్తం ఓ లేడీస్ క్లబ్ లాటరీ పద్ధతిని ఏర్పాటు చేసింది. ఆ లేడీస్ క్లబ్ ప్రెసిడెంట్ ఈ ఆఫీస్ మానేజర్‌గారి భార్య గనుక టికెట్ల నమ్మిపెట్టే బాధ్యత ఈ మేనేజర్‌పైనే పడింది. నాలుగు టికెట్‌బుక్‌లను తెచ్చాడు మేనేజర్. ఒక్కో టికెట్ ఖరీదు పదిరూపాయలు.

మేనేజర్ ప్రాపకానికై పాకులాడే కొందరు కాకారాయుళ్ళు క్షణాలమీద కొన్నారు టికెట్లను. త్రివిక్రమరావు కూడా మూడింటిని కొన్నాడు. అయినా ఇంకా కొన్ని మిగిలాయి. మేనేజర్ బలవంతంగా ఆ కొన్నింటిని గూడా కొందరికి అంటగట్టాడు. వారిలో భరద్వాజ ఒకడు. అతనికి మొదట్నుంచీ ఇలాంటి వ్యవహారాలంటే బొత్తిగా గిట్టదు. పదిరూపాయలు దండగ అని తప్పించుకు తిరిగాడు. నాలుగైదు రోజులపాటు మేనేజర్ బలవంతపెట్టేసరికి తప్పలేదు. డ్రాముందు రోజువరకు కూడా పదిరూపాయలు వృథా అయ్యాయని మథనపడుతూనే ఉన్నాడు. డ్రా తీశారు. అతని అదృష్టవశాత్తూ ఏకైక బహుమతైన 'టి.వి.ఎస్-50' అతనికే వచ్చింది. ఆనందంతో ఉక్కిరిబిక్కిరయ్యాడతను. అప్పట్నుంచీ 'లాటరీ భరద్వాజ'ని స్థిరపడిపోయిందతని నామం.

"అవును" చెప్పాడు సదానందం.

"ఆ సంబంధం మనకు కుదురుతుందంటావా?" సందేహంగా పలికాడు త్రివిక్రమరావు.

"ప్రారంభంలోనే అశుభం పలక్కు. ఏదియేమైనా మన ప్రయత్నం మనం చేయక తప్పదు. ఆ తర్వాత అన్నింటికీ ఆ పైవాడే ఉన్నాడు. నీకిష్టమైతే చెప్పు. ఎల్లుండి మంచిరోజు. వాళ్ని పెళ్ళిచూపులకాహ్వానించుదాం... ఏమంటావ్?"

"సరే కానీ."

త్రివిక్రమరావు ఇంటివైపు, సదానందం క్యాంటీన్‌వైపు కదిలారు.



ఆ రోజు ఉదయాన్నుంచే హడావుడి ప్రారంభించింది భాగ్యం. ఎంతవారికైనా పెళ్ళిచూపుల తతంగం అనేసరికి కంగారు తప్పదేమో. ఆరోజు ఆఫీసులకూ స్కూళ్ళకూ సెలవు కావటంతో త్రివిక్రమరావూ వనితా కూడా ఇంటిదగ్గరే ఉన్నారు. సాయంత్రం మూడు




గంటలకు అతిథులొస్తున్నట్లు కబురుచేశాడు సదానందం. ఆ వార్త విన్నంతనే ముడుచుకుపోయిన వనితను గమనించే తీరిక చిక్కలేదా ఇద్దరిలో ఒక్కరిక్కూడా.

ఇల్లంతా కడిగి నీటుగా ముగ్గులేసింది భాగ్యం. బెడ్ కర్టెన్స్ మార్చింది. హాల్లో కుర్చీలను, టేబుల్‌ను శుభ్రంగా తుడిచి నీట్‌గా సర్దింది. బజారుకెళ్ళి రెండురకాల స్వీట్స్ పట్టుకొచ్చాడు త్రివిక్రమరావు.

వనితకు స్నానం చేయించి ముస్తాబు చేయించింది భాగ్యం. ఆమె వద్దంటున్నా వినకుండా పెట్లోంచి పట్టుచీర తీసి కట్టించింది. ఆ క్షణంలో కూడా ధుమధుమలాడ్తూనే ఉంది వనిత. అదంతా సిగ్గుగా భావించుకుంది భాగ్యం.

రాబోయే అతిథులకోసం చూస్తున్నారంతా. సదానందం కూడా వాళ్ళతోటే వస్తానని చెప్పాడు.

అతిథులకన్నా ముందే పిలవని పేరంటంలా వచ్చింది కామాక్షమ్మ.

మొహం చిట్లించుకుంటూనే "రా వదినా" అంటూ ఆహ్వానించింది భాగ్యం.

"అమ్మాయి లక్ష్మీదేవిలా ఉందనుకో. కళ్ళకద్దుకుని చేసుకుంటారు ఎవరైనా కాణీకట్నం లేకుండా" ఆపాదమస్తకం వనితని చూసిచెప్పింది కామాక్షమ్మ.

'ముందు నీ దిష్టే తగిలేటట్లుంది నా తల్లికి. నీ కళ్ళు పేలిపోను. ఇప్పుడు నిన్నెవరు పిలిచారే రమ్మని' మనసులోనే అనుకుని 'మరే' అంటూ నవ్వలేక నవ్వింది భాగ్యం.

మూడుగంటలైంది. లోపలకు బయటకూ అసహనంగా పచార్లు చేస్తున్నాడు త్రివిక్రమరావు. ముగ్గురు కొడుకులకు నిర్విఘ్నంగా పెళ్ళిళ్ళు చేసిన వ్యక్తతను. అయినా ఆడపిల్ల పెళ్ళనేసరికి కంగారే.

పదినిముషాల తర్వాత ఇంటిముందు టాక్సీ ఆగిన చప్పుడు వినిపించింది. ఊపిరి తిరగని సందడి మొదలైంది ఇంట్లో. టాక్సీ దిగుతున్న అతిథులను సాదరంగా ఆహ్వానించాడు త్రివిక్రమరావు.

భరద్వాజ... పెళ్ళికొడుకు... సోదరి... ఓ మారుపు బంధువు అంతే సదానందమే పరిచయాలు చేశాడు వార్కి.

అందరికీ మంచినీళ్ళు ఇచ్చింది భాగ్యం.

కబుర్లలో పడ్డారంతా. ఆఫీస్ రాజకీయాల నుంచి దేశరాజకీయాలదాకా చోటుచేసుకున్నాయి వారి కబుర్లలో. సాధ్యమైనంతవరకు ముందుజాగ్రత్తచర్యగా ప్రతి విషయంలోనూ భరద్వాజతో ఏకీభవిస్తూనే ఉన్నాడు త్రివిక్రమరావు.

"బావగారూ... త్వరగా అమ్మాయిని పిలిస్తే ఓ పనైపోతుంది. అర్జంటుగా వెళ్ళాలి" అప్పుడే వరుస కలిపేస్తూ గుర్తుచేశాడు భరద్వాజ.

"అలాగే" అని లోపలికెళ్ళి వచ్చాడు త్రివిక్రమరావు.

రెండునిముషాల తర్వాత స్వీట్‌ప్లేట్లను ట్రేలో పెట్టుకుని వచ్చింది వనిత. ఆమె తొలిచూపులోనే భాస్కర్‌కు నచ్చినట్లు అతని ఫీలింగ్స్ చెప్పాయి త్రివిక్రమరావుకు. తృప్తిగా నిట్టూర్చాడు. ఓ అంకం ముగిసింది.

"అబ్బాయి హుందాగా, మనమ్మాయికి ఈడూజోడుగా ఉన్నాడొదినా" లోపల భాగ్యంతో చెప్పింది కామాక్షమ్మ. ఆమెక్కూడా అలానే అనిపించి తలూపింది భాగ్యం.

కాఫీలు తెచ్చిచ్చింది వనిత. భరద్వాజతో సహా అందరికీ ఆమె నచ్చిందని అర్థమైంది సదానందానికి.

"సదానందం... అమ్మాయి లక్ష్మీదేవిలా ఉందయ్యా, మాకందరికీ నచ్చింది. ఆ తర్వాత విషయాలు కూడా మాట్లాడుకుంటే..." అర్థోక్తిలో ఆగాడు భరద్వాజ కొడుకు ఇష్టాయిష్టాలు తెలుసుకున్న తర్వాత.

"ఉభయులకూ శ్రేయస్కరంగా ఉంటుందంటారు" పూర్తిచేశాడు సదానందం.

"అలాగే" అన్నాడు త్రివిక్రమరావు.

ఖాళీకప్పులను తీసుకెళ్ళింది వనిత. కనీసం ఆమె భాస్కర్‌వైపు కన్నెత్తికూడా చూళ్ళేదు. దాన్నంతా సిగ్గుగానే భావించుకున్నారంతా. ఆమె అభిప్రాయం తెలుసుకోవాలనే ఆలోచనకూడా రాలేదెవరికీ.

"డాడీ... నేను వెళ్తున్నాను. మీరు మాట్లా

డండి'' అని త్రివిక్రమరావు వైపు తిరిగి ''అర్జంట్‌గా ఓ ఫ్రెండ్‌ను కలుసుకోవాలి. నే వెళ్తున్నానండి'' చెప్పి వెళ్ళిపోయాడు భాస్కర్. అతను కనిపించినంతమేరా కిటికీలోంచి చూస్తుండిపోయింది భాగ్యం. అతను మనస్ఫూర్తిగా నచ్చాడామెకు. వనితకు తగిన జోడీ అనుకుంది.

''సదానందం... మనమనుకున్న విషయం చెప్పావా?'' తాపీగా అడిగాడు భరద్వాజ.

''చె..ప్ప..లే..దు..'' ఏదో గొంతుకడ్డంపడ్డట్లు ఫీలయ్యాడు సదానందం. అదే టర్నింగ్ పాయింట్. ఏ ఆడపిల్ల పెళ్ళికైనా మూడుదశలుంటాయి. మొదటిదశ పెళ్ళిచూపుల తతంగం. రెండోదశ కట్నకానుకల చర్చలు. ఇదే ముఖ్యమైన దశ. ఇది నిర్విఘ్నంగా జరిగింతర్వాతే మూడోదశ వెలుగులోకొస్తుంది. మొదటిదశలో కాన్సిలయే పెళ్ళిళ్ళు అయిదు శాతమైతే రెండోదశలో ఆగిపోయేవి తొంభై శాతం. ప్రస్తుతం వనిత పెళ్ళి ఈ దశలోకొచ్చింది. ఆఖరిదశ పెళ్ళి కార్యక్రమం.

''చెప్పండి... ఓ పనైపోతుంది'' తొందరచేశాడు భరద్వాజ.

''త్రివిక్రమరావూ...'' అంటూ గొంతు సవరించుకున్నాడు సదానందం. ఇక్కడే సందేహం కలిగింది త్రివిక్రమరావుకు. సదానందం తడబాటులోని ఉద్దేశం అర్థమై అవనట్లుందతనికి.

బయటికెళ్దామన్నట్లు సైగచేశాడు త్రివిక్రమరావు. అతని ఉద్దేశం గమనించి కుర్చీలోంచి లేచాడు సదానందం. ''బావగారూ... ఒక్క నిముషం'' చెప్పి త్రివిక్రమరావు, సదానందం బయటకు నడిచారు.

అసలు విషయం అక్కడ బయటపెట్టాడు సదానందం.

నివ్వెరపోయాడు త్రివిక్రమరావు. భూమి గిర్రున తిరుగుతున్నట్లనిపించింది.

''లక్ష రూపాయల కట్నం, పదితులాల బంగారం, లాంఛనాల కింద అబ్బాయికో స్కూటర్''

పాలిపోయింది త్రివిక్రమరావు మొహం ఆ మొత్తాల్ని విని.

''ఒరేయ్... ఇది వాళ్ళడిగిన మొత్తంరా, సంబంధం మనకు నచ్చితే, కావాలనుకుంటే బేరసారాలు సాగించవచ్చు''

''ఏమని సాగిస్తావురా, మహాఅయితే ఓ పదివేలు తగ్గుతారేమో. మన అదృష్టం బావుంటే మరో పదివేలు... అంతేగా. ఇంతడబ్బు నాదగ్గరెక్కడుంది. అయినా ఈ విషయం నాకు ముందే ఎందుకు చెప్పలేదు'' జీరవోయిన గొంతుతో బాధగా అన్నాడు త్రివిక్రమరావు.

''లోపలికెళ్దాం పద, వారి సమక్షంలోనే మాట్లాడదాం'' అనీజీగా కదుల్తూ అన్నాడు సదానందం.

''ఒరేయ్... నా మాటగా చెప్పు- యాభైవేల వరకైతే ఇవ్వగలను. నాలుగైదు తులాల బంగారం వరకు తూగగలను. స్కూటర్ గీటర్లాంటివి నా శక్తికి మించిన పనులని చెప్పరా'' అంటూ కదిలాడు త్రివిక్రమరావు. భరద్వాజ ఇంతమొత్తంలో ఉంటాడని ఊహించుంటే అసలు పెళ్ళిచూపులకే ఆహ్వానించేవాడుకాదు.

బయట్నుంచి వినిపిస్తున్న సంభాషణకు కంగారుతో భాగ్యం గుండెలపై చేయేసుకుంటే, వనిత మాత్రం హృదయభారం తగ్గిపోయినట్లు హాయిగా నిట్టూర్చింది. 'ఈ సంబంధం తప్పిపోవాలి' అని ఆమె కోరిన కోర్కెను భగవంతుడాలకించాడు.

''బావగారూ... మీరు నా పరిస్థితి కూడా ఆలోచించాలి. యాభైవేలంటేనే నా శక్తికి మించిన మొత్తం. లక్ష రూపాయలంటే నేనెక్కణ్ణుంచి తేవాలి'' ప్రాధేయపడ్తున్నట్లుగా అంటున్న త్రివిక్రమరావు వైపు అసహ్యంగా చూసింది వనిత.

''సదానందం... నీ మాట కాదన్లేక అవతల రెండులక్షలిస్తామన్నా మూడులక్ష లిస్తామన్నా తిరస్కరించి ఈ సంబంధానికొచ్చాం. ఇదేమన్నా కూరగాయల బేరమటయ్యా. అంతిస్తాను ఇంతిస్తాను అంటానికి'' ఆవేశంగా అంటూ కుర్చీలోంచి లేచి- ''త్రివిక్రమరావుగారూ... లక్షరూపాయలకు పైసాతగ్గినా నేనంగీకరించను. ఆలోచించుకుని రేపు సాయంత్రంలోగా ఏవిషయం కబురుచేయండి- లేదంటే గుడ్

బై'' అని నిష్క్రమించారాయన.

''సదానందం... ఏమిట్రా ఇది?'' అయోమయంగా అంటూ కుర్చీలో కూలబడ్డాడు త్రివిక్రమరావు.

''అందుకేరా ఇల్లుకట్టిచూడు, పెళ్ళిచేసి చూడన్నారు'' నీర్సంగా చెప్పాడు సదానందం.

ఎటూపాలుపోక శూన్యంలోకి చూస్తూండిపోయాడు త్రివిక్రమరావు. అయిదు నిముషాల తర్వాత వెళ్ళిపోయాడు సదానందం.

అలా బజార్లోకి బయలుదేరాడు త్రివిక్రమరావు.

★ ★ ★

ఆ రాత్రి భోజనాలప్పుడు భాగ్యం తీసుకొచ్చిందా ప్రస్తావన

''ఏమాలోచించారండీ?'' అంటూ.

''నాకూ అర్థంకావట్లేదు'' తన నిస్సహాయతను తెలిచేశాడు త్రివిక్రమరావు. గబగబా అన్నం తిని వెళ్ళిపోయింది వనిత అక్కడుండటం ఇష్టంలేనట్లు.

''అబ్బాయి అమ్మాయికి తగినట్లున్నాడండీ... సరైనజోడు''

''నాకూ అలానే అన్పించిందే. ఏంచేద్దాం ఖర్మ. వాళ్ళ లెక్కప్రకారం లక్షన్నరదాకా అవుతుంది. మనదగ్గరేమో చిల్లిగవ్వలేకపోయే'' అన్నాన్ని వేళ్ళతో కెలుకుతూ అన్నాడతను.

''అబ్బాయిల్నడిగితే?''

''వాళ్ళు మాత్రం అంత మొత్తమెలా ఇస్తారే. ఏదో యాభైవేలయితే తలా వదిహేను సర్దుతారేమో?''

ఆలోచనల్లో మునిగిపోయారు ఇద్దరూ.

''ఇల్లమ్మితే'' హఠాత్తుగా అంది భాగ్యం.

ఓ నిముషం నింపాదిగా ఆమెవైపు చూశాడు త్రివిక్రమరావు. ఎలాగైనా కూతురి పెళ్ళిచేసెయ్యాలనే కోర్కె కనిపిస్తూందామె కళ్ళల్లో.

ఇంటివైపు చూశాడు. తండ్రి వారసత్వంగా మిగిల్చిన ఏకైక ఆస్థి. ప్రస్తుత ధర ప్రకారం కనీసం ఏభైవేలన్నా చేస్తుంది. ఇంటినమ్మి వనిత పెళ్ళి చేస్తాడు. ఆ తర్వాత... రిటైరయింతర్వాత తామెక్కడుండాలి. కన్నకొడుకులు పోషిస్తారన్న నమ్మకమేముంది. రామనాథం గుర్తుకొచ్చాడతనికి. నో... వీల్లేదు. గూడంటూ ఒకటుంటే పెన్షన్‌తో గడిపేయచ్చు.

''వద్దు భాగ్యం... కూతురి పెళ్ళికి ఉన్న ఇల్లమ్మితే ఆ తర్వాత మనమెక్కడుండాలి?''

''ఎక్కడో అక్కడ గడవచ్చు. ముందీ కార్యం గట్టెక్కనివ్వండి''

''పిచ్చిదానా... ఆరాటపడితే పనులవుతాయా. అది మనకు అందని సంబంధమే. మనకు తగిన సంబంధం మనం చూసుకోవాలిగాని, అందనిదానికి అర్రులు చాచటం అవివేకమవుతుందే. ఆ సంబంధం విషయం మరచిపో'' చేతులు కడుక్కుంటూ తేల్చిచెప్పేసి వెళ్ళిపోయాడు త్రివిక్రమరావు.

దీర్ఘంగా నిట్టూర్చింది భాగ్యం.

''అందనిదానికి అర్రులు చాచటం అవివేకమే. అన్నీ తెలిసీ లాటరీ, మట్కాలంటూ దురాశపడ్డం దేనికో' అనాలని అనుకుని కూడా సాహసించలేకపోయింది.

★ ★ ★

నడిరాత్రి హఠాత్తుగా మెలుకువ వచ్చింది భాగ్యానికి. భర్త మంచంవైపు చూసింది. మామూలే - ఖాళీగా ఉందది. ఆ పక్కనే ఆదమరచి నిద్రిస్తూంది వనిత. చదువుతూ అలాగే నిద్రలోకి జారినట్లుంది గుండెలపై పుస్తకం అలాగే ఉంది. లేచి పుస్తకం తీసి పక్కన పెట్టి నేలపై జీరాడుతున్న పైటను సర్దింది.

ఆ తర్వాత నిద్రపట్టలేదామెకు. ఆలోచిస్తూ కూర్చుండిపోయింది. అర్థరాత్రి మట్కాకు వెళ్ళిన భర్త గురించి ఆలోచిస్తూ కూర్చుందామె. ఇలాంటి నిద్రలేని రాత్రులెన్నో ఆమె ముప్పైరెండు సంవత్సరాల వైవాహిక జీవితంలో.

తమ పెళ్ళైం తర్వాతనుంచి కనీసం రెండు లక్షలపైనే వ్యసనాలకు ఖర్చుపెట్టుంటాడు భర్త. ఈ ముప్పై రెండేళ్ళనుంచీ ప్రతినెలా సగం జీతంపైనే మట్కా గృహాలకు, లాటరీ టికెట్లకు ధారపోసుంటాడు. ఆ డబ్బంతా కూడబెట్టుకొనున్నా ఈనాడు వనిత పెళ్ళి ఓ సమస్య అయ్యేది కాదు. ఇంత జరుగుతున్నా తెలుసుకోలేని భర్తకెలా చెప్పాలో అర్థంకాలేదామెకు. ఎక్కడో రెండొందల మైళ్ళ దూరంలో గ్రామంలోనున్న పరంధామయ్య గుర్తొచ్చాడా

మెకు. త్రివిక్రమరావు చిన్నాన్న ఆయన. తమకు మిగిలున్న ఏకైక బంధువు- వయసులో తమకన్నా పెద్దవాడు. ఆ మరునటిరోజునే అతనికి లెటర్ రాయాలనుకుంటూ కళ్ళు మూసుకుంది భాగ్యం. ఎప్పటికో నిద్రలోకి జారుకుంది.

* * *

ఉమెన్స్ కాలేజి ముందు స్కూటరాపాడు చిరంజీవి. కాలేజికి లాంగ్‌బెల్ కొట్టడంతో అమ్మాయిలంతా బయటకొస్తున్నారు. రంగు రంగుల సీతాకోకచిలుకలు, రకరకాల పూవుల్ని ఓ చోట ఏరి కుప్పలా పోసినట్లుంది కాలేజీ ఆవరణ.

వనితవైపు చూసి చేయి ఊపాడు చిరంజీవి. అతన్ని గమనించి సమీపించింది వనిత.

"ఏమిటి కబురు చేశావట?" స్టార్ట్‌చేస్తూ అడిగాడు చిరంజీవి.

"కబురుచేస్తే కాని కలువకూడదా?" వెనక్కూర్చుంటూ నిష్ఠూరంగా అంది వనిత.

"అలా అనికాదు- మీనాన్న మనల్నిలా చూశాడంటే నిన్ను కాలేజీయే మాన్పిస్తాడని నా భయం. గట్టిగా పట్టుకో పడతావ్" నవ్వుతూ హెచ్చరించాడతను.

"పడితే పట్టుకోటానికి నువ్వున్నావుగా. నువ్విలా మానాన్నపేరు తలుచుకుని భయపడుతూనే ఉండు, ఈ లోపు నన్నెవడో ఒకడు ఎగరేసుకెళ్తాడు" కోపంగా అంది వనిత.

"మళ్ళీ ఎవడొచ్చాడు?"

"ఎవడో ఒకడు. కట్నం దగ్గర ఇరుపక్షాలకూ సమన్వయం కుదరక కాన్సిలైంది. ఎప్పుడూ ఇలానే ఉంటుందని నమ్మకమేమిటి. ఏదో ఓ సంబంధం కుదరకపోదు. అప్పుడు ప్రత్యక్షంగా నేను, పరోక్షంగా నువ్వు నరకాన్ని అనుభవించక తప్పదు"

ఓ క్షణం మౌనంగా ఉండిపోయాడు చిరంజీవి.

"బావా"

"ఊఁ"

"ఏమిటాలోచిస్తున్నావ్?"

"మన విషయమే. ఆలోచనలకి ఫుల్‌స్టాప్ పెట్టి ఆచరణకు నడుంకట్టాల్సిన సమయం ఆసన్నమైంది. వనితా... మనమిప్పుడు పార్క్ కెళ్ళటం లేదు. మా ఇంటికెళ్తున్నాం. మా నాన్నతో చర్చించి ఫైనల్ డెసిషన్ తీసుకుందాం"

"బావా... మామయ్య..."

"డోంట్‌వర్రీ- ఆయనిప్పుడుకూడా మనపక్షమే. మీ నాన్నలాంటి మూర్ఖుడు కాదాయన" దృఢంగా అన్నాడు చిరంజీవి.

మౌనంగా ఆలోచిస్తూ కూర్చుంది వనిత.

"ఓయ్... ఎవరొస్తున్నారో చూడు. త్వరగా" స్కూటర్ దిగుతున్న వనితను గమనించి లోపలున్న వర్ధనికి వినిపించేట్లు కేకేశాడు వెంకట్రామయ్య.

వస్తున్నానంటూ చేస్తున్న పనినాపి చేతులను పైటచెంగుతో తుడుచుకుంటూ వచ్చింది వర్ధని.

ఆసరికి స్కూటర్‌కి స్టాండ్‌వేసి లోపలికొచ్చాడు చిరంజీవి. బిడియంగా బయటే ఉండిపోయింది వనిత.

"రామ్మా... అక్కడే నిల్చున్నావేం-" ఆప్యాయంగా పిలిచాడు వెంకట్రామయ్య.

"ఆగాగు- శుభలక్ష్మివి - తొలిసారిగా మాయింట అడుగుపెడ్తున్నావ్- కుడికాలు ముందుపెట్టి రామ్మా" హడావుడి చేసింది వర్ధని.

ఆ ఆప్యాయతకు చలించిపోయింది వనిత. మండుటెండలోంచి మల్లెపందిరి నీడలోకొచ్చినట్లు ఫీలవుతూ లోపలికడుగుపెట్టింది.

"ఏమ్మా... అమ్మా నాన్న బావున్నారా?" వెంకట్రామయ్య ప్రశ్నకు సమాధానంగా తన తండ్రి ప్రవర్తన గుర్తొచ్చి ఆమె కళ్ళల్లో నీళ్ళు మెదిలాయి. తలొంచుకుని తలూపింది వనిత.

"మాట్లాడుతూ ఉండండి కాఫీ కలుపుకొస్తాను" వంటింట్లోకి వెళ్ళింది వర్ధని.

"నాన్నా... మామయ్య వనితకు సంబంధాలు చూస్తున్నారట" ఉపోద్ఘాతంగా చెప్పాడు చిరంజీవి.

"ఇప్పుడు చూడటమేమిట్రా. రెండు సంవ




త్సరాల్నుంచీ చూస్తూనే ఉన్నాడు. నిన్నకూడా ఓ సంబంధం వచ్చింది. కట్నం దగ్గర పేచీవచ్చి తప్పిపోయింది. ఏదయినా కుదురుతుందేమో చెడగొట్టాలని చూశాను. దయామయుడైన ఆ భగవంతుడు మనకంత శ్రమివ్వలేదు''

వెంకట్రామయ్యగారి సమాధానం విని ఈసారి నివ్వెరపోవటం చిరంజీవి, వనితల వంతైంది.

''వాడొట్టి మూర్ఖుడయ్యాడు కానీ లేకుంటే ఈ బంగారుబొమ్మ ఎప్పుడో ఈ ఇంటి కోడలై ఉండేది'' ఆప్యాయంగా వనిత తలనిమురుతూ బాధగా అన్నాడు వెంకట్రామయ్య.

దాదాపు పన్నెండేళ్ళ క్రితం జరిగిన సంఘటన మనసులో మెదిలి బరువుగా నిట్టూర్చాడు వెంకట్రామయ్య.

''ఆరోజు...''

అదే వెంకట్రామయ్య, త్రివిక్రమరావుల బాంధవ్యం నిలువుగా చీలిపోయిన రోజు...

దుర్వ్యసనాలకు బానిసై త్రివిక్రమరావు ఇంటినీ, ఇల్లాలినీ విస్మరించిన రోజు...

ఆరోజు ఆదివారం. ఉదయాన్నే చెల్లెలింటికొచ్చాడు వెంకట్రామయ్య. త్రివిక్రమరావు లేడు.

భోజనం టైం దాటిపోయింది. త్రిక్రమరావు రాలేదు. దీపాల వేళైంది. అతని జాడే లేదు.

భాగ్యాన్ని గుచ్చి గుచ్చి ప్రశ్నించాడు వెంకట్రామయ్య.

అప్పుడు మనసు విప్పింది భాగ్యం. వరద గోదారైందామె. మనసులోని ఆవేదనను కన్నీళ్ళ రూపంలో వెళ్ళగక్కింది.

చలించిపోయాడు వెంకట్రామయ్య చెల్లెలి కన్నీటి గాథని ఆలకించి.

ఆదేక్షణంలో ప్రవేశించాడు త్రివిక్రమరావు. గిల్టీగా ఫీలవుతూ బావమరిదిని చూడనట్లే నటిస్తూ లోపలికెళ్ళ ప్రయత్నించాడతను.

''బావా'' మార్దవంగా పిలిచాడు వెంకట్రామయ్య.

అతనివైపు తిరిగి ఆక్షణమే అతని వైపు చూసినట్లు నటిస్తూ- ''నువ్వా... ఎప్పుడొచ్చావు...?'' పొడిగా ప్రశ్నించాడు త్రివిక్రమరావు.

''తెల్లవారుఝామునొచ్చాను''

మౌనంగానే తివిక్రమరావు స్నానానికి నీళ్ళు పెట్టింది భాగ్యం.

భోజనాల దగ్గర వెంకట్రామయ్య ముందుగా ప్రారంభించాడు. ''ఉదయాన్నుంచీ ఎక్కడకెళ్ళావు బావా?''

''.....''

''బావా... మనం సామాన్యులం. కూర్చుని తిన్నా తరగనంత ఆస్తున్న కోటీశ్వరులం కాదు- ఏ పూటకాపూట అడుక్కుతినే బికారులమూ కాదు. మధ్య తరగతి కుటుంబీకులం. పైకెక్కలేని కిందికి దిగజారలేని నిస్సార జీవితాలు మనవి. ఇటుక మీద ఇటుక పేర్చినట్లు... పైసా.. పైసా కూడబెడితేనే భవిష్యత్‌లో ఏర్పడబోయే సమస్యలనెదుర్కోవటం కష్టం. అలాంటిది జీతమంతా లాటరీలకూ, బ్రాకెట్టుకూ ధారపోస్తుంటే మన జీవితం ఎలా గడవాలి. పిల్లల బ్రతుకులేమవ్వాలి?'' సున్నితంగా హెచ్చరించాడు వెంకట్రామయ్య.

అన్నం సహించనట్లు ప్లేట్లో వేళ్ళతో కెలుకుతున్నాడు తివిక్రమరావు. వంటగది ద్వారానికి నిలబడి చూస్తోంది భాగ్యం.

''దురాశ దుఃఖానికి చేటు బావా- కష్టపడి సంపాదించింది నిలుస్తుంది. కాని... అనాయాసంగా లాభించింది ఎక్కువ కాలముండదు. ఆలోచించు బావా. భాగ్యాన్ని చూడు. ఎంత బాధపడుతోందో. ఓ పక్క పిల్లలెదుగుతున్నారు. తల్లిదండ్రులు, పెద్దలు వారికి మార్గదర్శులు. ఆదర్శం కావాలేగాని వాళ్ళచే చెప్పించుకునేలా అవగూడదు. ఆలోచించి నీమార్గాన్ని మార్చుకో బావా''

''పుట్టింటికి నా మీద ఫిర్యాదులు పంపించావా?'' అని భాగ్యంవైపు తీవ్రంగా చూస్తూ అడిగాడు తివిక్రమరావు.

ఉలిక్కిపడ్డాడు వెంకట్రామయ్య అతని ప్రశ్న విని. తన హితోక్తి ఫలితం వక్రమార్గాన పడిందని ఊహించడానికి అరక్షణం కూడా పట్టలేదు.

''బావా- ఆమెనేమనకు. వేరే పనిమీద వచ్చిన నాకు ఓ స్నేహితుని ద్వారా నీ

విషయం తెలిసింది''

"అయితే ఇప్పుడేమంటావ్?" కటువుగా అన్నాడు త్రివిక్రమరావు.

"ఆలోచించమంటున్నాను. దుర్వ్యసనాలకు లోనై అప్పుల పాలవుతున్న నీ జీవితాన్ని సరిదిద్దుకోమంటున్నాను. పిల్లల భవిష్యత్‌ను తీర్చిదిద్దమంటున్నాను''

"చూడు బామ్మర్ది నా జీవితం, నా పిల్లల భవిష్యత్ నేను తీర్చిదిద్దుకోగలను. ఎవరి సలహాలూ నా కఖ్ఖర్లేదు. చుట్టుపు చూపుగా వచ్చావు. తినివెళ్ళిపో. దట్సాల్. ఎవరి హద్దులో వాళ్ళుండటం ఉభయులకూ శ్రేయస్కరం'' చేతులు కడుక్కుంటూ కటువుగా అన్నాడు త్రివిక్రమరావు.

నివ్వెరపోయాడు వెంకట్రామయ్య. ఒక్కసారిగా నీలమేఘాలు ఆవహించాయతన్ని. అవమానంతో కందిపోయాడతను.

"బావా మూర్ఖంగా..." అంటూ ఇంకా ఏదో చెప్పబోయిన అతన్ని మధ్యలోనే ఖండిస్తూ- "మిస్టర్ వెంకట్రామయ్య, నీ ఉచిత సలహాలను ఇంతటితో విరమించుకోకుంటే గెటవుట్ అనాల్సుంటుంది'' అన్నాడు త్రివిక్రమరావు.

ఉబుకుతున్న కన్నీళ్ళను పైటచెంగుచాటున దాచుకుంది భాగ్యం.

అవమాన భారంతో ఎరుపెక్కింది వెంకట్రామయ్య మొహం. "చెల్లెమ్మా తెల్సినవాడికీ, తెలీనివాడికి చెప్పొచ్చు. కానీ తెలిసీ తెలియని మూర్ఖులకు చెప్పటం ఆ బ్రహ్మక్కూడా సాధ్యంకాదు. ఈయనగారిచేత ఇంతలా అవమానింపబడింతర్వాత ఇక్కడుండాల్సిన అవసరం నాకు లేదు. ఎప్పుడైనా అన్నదమ్ములు, పుట్టిల్లు గుర్తొస్తే మౌనంగా రోదించు. అంతేకాని మమ్మల్ని చూడాలని, కలుసుకోవాలని ప్రయత్నించి నిన్ను అవమానపరచుకోకు. మమ్మల్ని అవమానించకు'' అని గిరుక్కున వెనక్కి తిరిగాడు వెంకట్రామయ్య.

"అన్నయ్యా'' బాధగా ఆక్రోశిస్తూ ముందుక్కదలబోయింది భాగ్యం.

"అడుగు ముందుకేస్తే నువ్వు కూడా వాడితోటే వెళ్ళాల్సిఉంటుంది'' అజ్ఞలా వినిపించిన భర్తస్వరం వినిపించి వెనకడుగువేసింది భాగ్యం.

ఆరోజు జరిగిన సంఘటన గుర్తొచ్చి బాధగా 'వనిత'ను చూశాడు వెంకట్రామయ్య.

"నాన్నా గతాన్ని తల్చుకుంటూ బాధపడ్డం, వర్తమానాన్ని నిర్ణయించుకోలేక భవిష్యత్‌ను అంధకారంలోకి నెట్టడం వివేకుల లక్షణం కాదు'' హెచ్చరించాడు చిరంజీవి.

"ఒరేయ్... గతాన్ని నెమరువేసుకుంటూ కూర్చునేవాడినే అయితే నిన్ను వనితతో కలువనిచ్చేవాడ్నే కాదు. నాకు పంతాలూ, పట్టింపులూ ముఖ్యంకాదు. నా వాళ్ళ సుఖసంతోషాలు ముఖ్యం''

మేరు పర్వతంలాంటి ఆయన వ్యక్తిత్వం ముందు తన తండ్రి వ్యక్తిత్వాన్ని పోల్చుకుని సిగ్గుపడింది వనిత.

"నాన్నా! ప్రస్తుతం కర్తవ్యమాలోచించండి''

"ఇప్పుడు కాదురా, పన్నెండేళ్ళ నుంచీ ఆలోచిస్తున్నాను. నీ మరదలితో పెళ్ళిని నువ్వాలోచిస్తున్నావు. నా బావ జీవితపంథాని మార్చి ఈ చరమదశలోనైనా నా చెల్లిలికి మనశ్శాంతి కలిగించాలని నేనాలోచిస్తున్నాను''

అతని విశాల హృదయానికి మనసులోనే నివాళులర్పించింది వనిత.

కాఫీలతో వచ్చింది వర్ధని. నిశ్శబ్దంగా కాఫీ కప్‌లందుకున్నారు ముగ్గురూ.

"వనితా విడిపోయిన ఈ రెండు కుటుంబాలను ఏకం చేయడానికేకాక దారితప్పిన మీ తండ్రిని సరైనదారిలో నడిపించేందుకు నువ్వు సూత్రధారివి కావాలి'' హఠాత్తుగా అన్నాడు వెంకట్రామయ్య.

"నే... నా?'' ఆశ్చర్యంగా అంది వనిత.

"అవును... నువ్వే. అందుకు నువ్వే సమర్థురాలివి. ఓ నాటకమాడాలి నువ్వు''

"నా...ట...క...మా?'' విస్తుపోయింది వనిత.

"అవును... నాటకమే. అందులో ప్రధాన పాత్రలు నువ్వూ, చిరంజీవి. నేను సహాయకుడ్ని. ఈ దెబ్బతో మీ పెళ్ళి జరగటమేకాక నా చెల్లిలి జీవితంలో ముసురుకున్న కారుమబ్బులు కూడా పటాపంచలు కావాలి'' దృఢనిశ్చయంతో చెప్పాడు వెంకట్రామయ్య.



అందరూ ఆసక్తిగా చూస్తున్నారతని వైపు.

"నేనేం చెయ్యాలి?" మనుస్సులోనే సిద్ధపడుతూ ధైర్యంగా అడిగింది వనిత.

"వనితా, మనం ఓ మార్పుకోసం దుర్వ్యసనాలకు బానిసై బావిలో కప్పలా అదే జీవితమని భ్రమిస్తున్న ఓ వ్యక్తిని సరైనమార్గంలోకి మళ్ళించేందుకు ఆడుతున్న నాటకమిది. సదాశయం, పట్టుదలలే దీనికి ప్రాణాలు. ఆచరణలో ఎన్ని అడ్డంకులు ఎదురైనా, బరువు బాధ్యతలు మోయాల్సివచ్చినా మధ్యలో నిష్క్రమించనని నాకు మాటివ్వు" ఆమె వైపే సూటిగా చూస్తూ చేయిచాపాడు వెంకట్రామయ్య.

అతని గంభీర స్వరం విని ముచ్చెమటలు పట్టాయామెకి. తన తండ్రి దృష్టిలో తనితన్ని కలుసుకోవటమే దారుణ నేరం. చిరంజీవిని పెళ్ళి చేసుకోవాలనుకోటం మరో నేరం. ఇంకా అతనికి విరుద్ధంగా నాటకమాడాలనుకోవటం అతను తన జీవితంలో తనని క్షమించనంత నేరం.

రోజూ కన్నీళ్ళతో బతికే తల్లి గుర్తొచ్చింది వనితకు. ఏనాడూ హృదయపూర్వకంగా నవ్విన పాపాన పోలేదామె. అప్పులాళ్ళు ఇంటిపై దండెత్తుతుంటే సర్దిచెప్పలేక సతమతమయ్యేది చాన్నాళ్ళు. బతకలేక, చావలేక కృశిస్తున్న ఆమె కోసమైనా తానీసాహసం చేయకతప్పదనుకుంటూ వెంకట్రామయ్య చేతిలో చేయి వేసింది వనిత.

"గుడ్... నీలో ఆమాత్రం సాహసముంటే చాలు.. వినండి..." అని ఓసారి ముగ్గురివైపు తేరిపార చూసి పథకం చెప్పసాగాడు వెంకట్రామయ్య.

★ ★ ★

మధ్యాహ్నం... కలిసి భోంచేస్తున్నారు త్రివిక్రమరావు..భాగ్యం..వనితలు...

మనసులో చెలరేగుతున్న కల్లోలాన్ని అణుచుకుంటూ నిముషానికరవైసార్లు తండ్రి వంక ఓరగా చూస్తోంది వనిత. అదేమీ గమనించని త్రివిక్రమరావు నింపాదిగా భోంచేస్తున్నాడు.

ఇంతలో కడుపులో తిప్పినట్లనిపించి-





"వాక్..." మంటూ కుర్చీలోంచి లేచి మూతి బిగపట్టుకుని బాత్‌రూంకి పరుగెత్తింది వనిత...

కంగారుగా చూసింది భాగ్యం. వెంటనే లేచి ఆమెననుసరించింది. ఓసారి వాళ్ళిద్దరి వైపు చూసి తలొంచుకున్నాడు త్రివిక్రమరావు.

బాత్‌రూంలో వాంతి చేసుకుని నోరు శుభ్రం చేసుకుంది వనిత.

"ఏమిటే...ఏమైంది?" ఆదుర్దాగా అడిగింది భాగ్యం ఆమెను సమీపించి.

"అ...మ్మా...అదీ...అదీ..." అంటూ నసిగింది వనిత.

"ఏమిటానసుగుడు...అర్థమయ్యేట్లు చెప్పవే...?" కంగారుగాఅంది.

"అమ్మా...అదీ...అదీ" అంటూ తలొంచుకుంది భయంగా వనిత.

గుండె జల్లుమంది భాగ్యానికి. గుమస్తాగారమ్మాయి సరస్వతి గుర్తొచ్చి కంపించిపోయింది. ఆమె స్త్రీ హృదయంలో ఏదో అనుమానం ప్రవేశించింది.

ఛివాలున వనితను సమీపించి తలపైకెత్తింది భాగ్యం.

"నిజమా...?" అది ప్రశ్న కాదు మాటల తూటా.

అవునన్నట్లు తలూపింది వనిత...

ఫెడీల్మని వనిత చెంపపై కొట్టింది భాగ్యం.

"ఎంత ధైర్యమే నీకు...ఎంత బరితెగించావే..." ఆవేశంతో ఊగుతూ శివంగిలా గర్జించింది భాగ్యం.

"ఏమైందే...ఏమిటా అరుపులు?" టవల్‌తో చేతులు తుడుచుకుంటూ ఆమెని సమీపిస్తూ అర్థంగాక అడిగాడు త్రివిక్రమరావు.

"చూడండి...ఇది...ఇదెంత పనిచేసిందో..." ఆవేశంతో రొప్పుతూంది భాగ్యం.

"ఏమిటమ్మా... కాస్త అర్థమయ్యేట్లు చెప్పండి..." తలొంచుకుని నేల చూపులు చూస్తున్న వనితనడిగాడు త్రివిక్రమరావు"

"అదెలా చెబుతుందండీ చేసిన నిర్వాకం చాలక-మనం తలొంచుకునే పనిచేసిందండీ...తలవొంపులు తెచ్చే పనిచేసింది..." గుండెలు బాదుకుంటూ ఏడుస్తూ

చెప్పింది భాగ్యం.

"ఛ...నోర్మూయ్...అది నా కూతురే...ఎప్పుడూ తప్పు చేయదు...అది నిప్పులాంటిదే...నిప్పు..." నమ్మకంగా పలికాడు త్రివిక్రమరావు.

"ఆ...నిప్పే... ఇప్పుడా నిప్పుకే చెదలు పట్టింది... మీరే అడగండి... తెలుస్తుంది..." వెటకారంగా అంది భాగ్యం.

"ఏమిటమ్మా...ఏమిటీ గొడవ...?"

"నా...న్నా...అదీ...అ...దీ...?!"

"అబ్బ... ఏంసిగ్గుపడుతున్నావే... నంగనాచిలా...వెధవ పనిచేసే ముందుండఖర్లే సిగ్గు...అదేం చెప్తుంది, నే చెబ్తున్నా వినండి...అదెక్కడో కాలుజారింది...ఇప్పుడు ఫలితాన్ని మోస్తూంది"

బాంబులా పేలిందామాట. అతనికర్థం కావటానికి అయిదారు క్షణాలపైనే పట్టింది. కాలిగోరు నుంచి తన్నుకొచ్చింది ఆవేశం. నిలువెల్లా కంపించిపోయాడు ఉద్రేకంతో.

"ఏమ్మా... నిజమా...?"

"ని..జ..మే.."

అంతే ఆగ్రహోదగ్రుడయ్యాడు.

త్రివిక్రమరావు కొట్టిన దెబ్బకు విసురుగా వెళ్ళి బాత్‌రూం గోడపై పడింది వనిత.

"అ..మ్మా..." నుదురు గోడకు తగలటంతో బాధగా అరిచింది. విలవిల్లాడిపోయిందొక్షణం భాగ్యం తల్లి హృదయం.

"పాపిష్టిదానా... ఎంతపని చేశావే... ఈ ఇంట్లో తప్పుబుట్టావు గదే. ఎంతకు బరితెగించావే..." విసురుగా వెళ్ళి వనిత జుత్తు పట్టుకుని వీపుపై దబదబ బాదాడు త్రివిక్రమరావు.

ఇక సహించలేకపోయింది భాగ్యం... భర్త కోపం తెలుసామెకు. దానవుడవుతాడు కోపంలో..

"ఏమండీ..దాన్ని చం...వ..కండి" ఏడుస్తూ అడ్డుబోయింది భాగ్యం.

"నువ్వు తప్పుకో... ఇది చేసిన పనికి దీన్ని ముక్కలు ముక్కలుగా నరకాలి... తప్పుకో..." అంటూ చేతులకడ్డం వచ్చిన భాగ్యాన్ని పక్కకు నెట్టాడు.

"చెప్పవే...ఎవడు వాడు...?" దెబ్బల బాధకు వాలిపోతున్న వనితను జుట్టు పట్టుకుని పైకి లేపాడు. అదేక్షణంలో ఆ ఇంట్లోకి అడుగుపెట్టిన కామాక్షి జరుగుతున్న తతంగాన్ని గమనించి గిరుక్కున వెనక్కు తిరిగింది. ఓ నెలకు సరిపడ మ్యాటర్ దొరికందామెకు. అది చాలామెకు.

మౌనంగా రోదిస్తూ తలొంచుకుంది వనిత.

"చెప్పవే...ఎవడువాడు...?" గర్జించాడు త్రివిక్రమరావు.

"చెప్పమ్మా...ఎవరతను...లేకపోతే చంపేస్తాడు.." ఏడుస్తూనేఅయినా అనునయంగా అంది భాగ్యం.

మౌనమే సమాధానం... వనిత హృదయం సముద్రమైంది. ఏమని చెప్పగలదు. వెంకట్రామయ్య నీడంటేనే గిట్టని త్రివిక్రమరావుకి... తనీస్థితికి కారణం చిరంజీవని ఎలా చెప్పగలదు?

"చెప్పవే...ఎవడు వాడు..లేకుంటే చంపేస్తాను.." మూలనపడున్న పెద్ద కర్రను చేతిలోకి తీసుకున్నాడు త్రివిక్రమరావు.

కంపించిపోయింది భాగ్యం. అతని వాలకం చూస్తే నిజంగా అన్నంత పని చేసేలా ఉన్నాడతను.

"ఒరేయ్ విక్రం ఏమిట్రా అది. పిల్లదాన్ని చంపేస్తావేంటి?" అదే సమయంలో పల్లెటూరి నుంచి బస్‌దిగి లోపలికొచ్చిన పరంధామయ్య చేతిసంచిని విసిరేసి త్రివిక్రమరావుకు అడ్డొచ్చాడు.

"బా...బా...య్ నువ్వా ఎప్పుడొచ్చావ్?"

"ఇప్పుడే వస్తున్నానా ఏమిటి నువ్వు చేస్తున్న నిర్వాకం?" అతని చేతిలోని కర్రను దూరంగా విసిరేస్తూ కసిరాడు పరంధామయ్య.

"బాబాయ్.. ఎంత అల్లారుముద్దుగా పెంచాను దీన్ని. ఇప్పుడేం చేసిందో తెలుసా?" ఆవేశంతో ఊగిపోతూ అన్నాడు త్రివిక్రమరావు.

"చిన్నపిల్ల తెలిసో తెలీకో ఏదో చేసుంటుంది అంతమాత్రానికే ఇలా దండిస్తారటరా. వనితా- నువ్వు లోపలికెళ్ళమ్మా" వనితను లోపలికి పంపించి మందలించాడు

పరంధామయ్య.

"బాబాయ్ అదేం చేసిందో తెలీక నువ్విలా తాపీగా మాట్లాడుతున్నావు. అది ఎవడితోనో తిరిగి కడుపు తెచ్చుకుంది" ఆవేశంలో వనిత తన కూతురన్న విచక్షణను కూడా మరిచి దుర్భాషలాడుతున్నాడు త్రివిక్రమరావు.

నివ్వెరపోయాడు పరంధామయ్య. అంతలోనే సంభాళించుకున్నాడు.

తప్పుచేయటం తప్పుకాదురా? ఆ తప్పును సరిదిద్దుకోలేకపోవటం తప్పు. జరిగిందేదో జరిగింది. ఇప్పుడేం చేయాలో ఆలోచించాలిగాని ఆవేశాల్తో కత్తుల్తో పనులు కావు. నువ్వు కాస్త రెస్ట్ తీసుకో. అమ్మాయిని నేను కనుక్కుంటాను" త్రివిక్రమరావుకు నచ్చచెప్పి గదిలో కుమిలిపోతున్న వనితను సమీపించాడు పరంధామయ్య.

"వనితా జరగిందాన్నెలాగూ చెరపలేవు. దీనికంతకూ కారణమైన అతనెవరో చెప్పు. ఏంజరగాలో ఆలోచిద్దాం" ఆమె తల నిముర్తూ అనునయంగా పలికాడు పరంధామయ్య.

".......''

"ఈ బాధ. ఆలోచన తప్పు చేయక ముందుండాలి. ఇప్పుడు చేయగలిగిందేమీ లేదు. దీనికి కారణమైన అతన్తో నీ పెళ్ళి జరిపించటం తప్ప... చెప్పు ఎవరతను?"

".......''

నిశ్శబ్దంగా చూస్తున్నారు త్రివిక్రమరావు, భాగ్యంలు. చూపుల్తోనే నిప్పులవర్షం కురిపిస్తున్నాడు త్రివిక్రమరావు. ఈ పరిస్థితినెలా ఎదుర్కోవాలో అర్థంగాక సతమతమవుతూంది భాగ్యం. పెళ్ళైంతర్వాత వినిపిస్తే అది శుభవార్త. పెళ్ళికాలేదు కాబట్టి అది అపనింద.

"వనితా చదువుకున్నదానివి, విచక్షణా జ్ఞానమున్న దానివి. మంకుపట్టు పడితే చివరకు నష్టపోయేది కూడా నీవే"

వంచిన తలపైకెత్తింది వనిత. కళ్ళనీళ్ళు తుడుచుకుంది.

"చెప్పమ్మా ఎవరతను?" ఆమె కళ్ళల్లోకి చూస్తూ అనునయంగా అడిగాడు పరంధామయ్య.

"బావ... చిరంజీవి బావ".

బాంబులా పేలిందా పేరు.

"నరుకుతా, చంపేస్తా, ప్రేమించటానికంతకంటే ఎవడూ కనిపించలేదా నీకు" ఆవేశంతో ముందుకు దూకిన త్రివిక్రమరావును ఆపటం పరంధామయ్య, భాగ్యంలకు శక్తికిమించిన పనైంది.

చిరంజీవి పేరు విని మరింత మండిపోయాడు త్రివిక్రమరావు. రెచ్చిపోయాడు. అతన్ని సవరదీసి ఆఫీసుకు పంపించేసరికి తల ప్రాణం తోకకొచ్చింది పరంధామయ్యకు.

కుత కుతా ఉడికిపోతున్నాడు త్రివిక్రమరావు. వనిత పరిస్థితికి కారణం చిరంజీవి కావటం. అందునా తనకయిష్టుడైన వెంకట్రామయ్య పుత్రుడవటం కంపరంగా ఉందతనికి. వేరెవరైనా అయ్యుంటే అంత ఆవేశపడేవాడు కాదేమో. దారి పొడుగునా అవే ఆలోచనలు. ఫైళ్ళలో వికటాట్టహాసం చేస్తున్న వెంకట్రామయ్యే కనిపించాడతనికి.

సాయంత్రం పలకరించిన సదానందంతో తన ఆవేదనని చెప్పుకుని హృదయభారం దించుకున్నాడు.

"కాగల కార్యం గంధర్వులే తీర్చారన్నట్లు వెదకబోయిన తీగె కాలికే చుట్టుకుంది. ఎలాగూ మేనల్లుడే అంటున్నావు కాబట్టి ముడిపెట్టెయ్. నీకూ ఓ సమస్య తీరుతుంది" తేలిగ్గా అనేశాడు సదానందం.

"ఛత్" త్రివిక్రమరావు అరికాలిమంట నెత్తికెక్కింది. "నోర్ముయ్ వెధవ సలహాలూ నువ్వూను. వెంకట్రామయ్యగాడు వాడో లఫూట్ వెధవ. వాడి కొడుక్కి బంగారుబొమ్మలాంటి నా కూతుర్నిస్తానా?" సదానందాన్ని కసురుకున్నాడు.

మొహం నల్లగా మాడ్చుకున్నాడు సదానందం. అతని సంగతి పూర్తిగా తెల్సినవాడు కావటంతో సర్దుకున్నాడు.

"ఇప్పుడేం చేయాలనుకుంటున్నావ్?"

"అబార్షన్ చేయించి సాధ్యమైనంత త్వరగా వనిత పెళ్ళి చేసెయ్యాలనుకుంటున్నాను" చాలా తేలిగ్గా చెప్పాడు త్రివిక్రమరావు.

అదిరిపడ్డాడు సదానందం.

"ఒరేయ్... అదంత లేలికనుకున్నావా. అమ్మాయి ఒప్పుకుంటుందా ఒకవేళ ఒప్పుకుని ఇంకొకడ్ని పెళ్ళిచేసుకుందే అనుకో. ఆ తర్వాత ఆమె భర్తకు ఈ విషయం తెలిస్తే అమ్మాయి బ్రతుకేమవుతుందో ఆలోచించు" భవిష్యత్‌ను ముందుపరిచాడు సదానందం.

ఆలోచనల్తో వేడెక్కిన బుర్రను చల్లబరుచుకోటానికి 'బార్'లోకి దూరాడు త్రివిక్రమరావు. గ్లాసుమీద గ్లాసు ఖాళీచేసినా తన సమస్యకు పరిష్కారం దొరకలేదతనికి.

రాత్రి పదకొండు దాటింతర్వాత తూలుకుంటూ ఇంట్లోకి అడుగుపెట్టిన త్రివిక్రమరావు పరంధామయ్య, భాగ్యం, వనితలు మేల్కొనే ఉండటం గమనించి నిభాయించుకున్నాడు.

"ఒరేయ్ విక్రం ఏమిట్రా ఇది. ఏమిటీ అవతారం?" తొలిసారిగా అతన్నా పరిస్థితిలో చూస్తున్న పరంధామయ్య హృదయపులోతుల్లోంచి వచ్చిందా ప్రశ్న.

"ఆవేదన బాబాయ్... గుండెల్లో రగులుతున్న ఆవేదన"

"ఇప్పుడేమైందనిరా హృదయాన్నిలా దహించుకుంటున్నావ్?"

"ఇంకా ఏంకావాలి.. ఇది చేసిన పనికి నేనింకా బ్రతికుండటమే ఆశ్చర్యంగా ఉంది.."

"ఏమ్మాటల్రా అవి... అమ్మాయి చేసిన నేరమేమిటి బావనేగా ప్రేమించింది. ఎవరో అనామకుడ్ని ప్రేమిస్తే మనం బాధపడాలిగాని సొంత బావను ప్రేమిస్తే తప్పేముంది. కాకుంటే కాస్త తొందరపడింది. పెద్దలం మనం సరిదిద్దితే సరిపోతుంది" నచ్చచెప్పాడు పరంధామయ్య.

మీనమేషాలు లెక్కిస్తూండిపోయాడు త్రివిక్రమరావు. వెంకట్రామయ్య గుర్తొచ్చాడు. ఆనాటి ఘర్షణా గుర్తొచ్చింది. ఆఫ్టాల్ వెంకట్రామయ్య... వాడితో తను వియ్యమందటమా?

"ఒరేయ్... ఇది పంతాలకు పట్టింపులకూ సమయంకాదు. మనమ్మాయి జీవితాన్ని భవిష్యత్‌ను దృష్టిలో ఉంచుకుని ఆలోచించాల్సిన సమయం. నా మాట విని రేపు ఉదయమే వెంకట్రామయ్యను కలుసుకుని పరిస్థితి వివరించు" అతని మనసులోని సంఘర్షణనర్థంచేసుకుని చెప్పాడు పరంధామయ్య.

"నేనా... ఈ బొందిలో ప్రాణముండగా వెంకట్రామయ్య మొహం చూడను" మత్తులోకూడా బింకంగానే పలికాడు త్రివిక్రమరావు.

"తప్పదు... మనం ఆడపిల్లగలవాళ్ళం. ఆడపిల్ల తండ్రి కలెక్టరైనా, మగపిల్లవాడి తండ్రి బంట్రోతైనా అతనికి లోకువే. మనమే ముందుగా వెళ్ళి సంప్రదించటం ఆనవాయితీ, మర్యాద"

"నువ్వేన్నైనా చెప్పు బాబాయ్. వాడి గడప తొక్కను. అవసరమైతే వాణ్ణే రమ్మను" నిర్లక్ష్యంగా అన్నాడు.

"ఒరేయ్... ఇప్పుడవసరం వాడిదిగాదురా మనది" త్రివిక్రమరావుకు నచ్చచెప్పి అతని చేత అవుననిపించేసరికి ఏనాడో చచ్చిపోయిన పితృదేవతలు బతికొచ్చినంతపనైంది పరంధామయ్యకు. కోళ్ళు కూసే వేళైంది.

భారంగా నిట్టూరుస్తూ నిద్రలోకి జారింది భాగ్యం.

వెంకట్రామయ్య పథకంలోని తొలి అంకం నిర్విఘ్నంగా ముగిసినందుకు తృప్తిగా నిట్టూరుస్తూ కళ్ళు మూసుకుంది వనిత.

కళ్ళు మూసుకున్న త్రివిక్రమరావుకు వెంకట్రామయ్య కనిపించి ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు. ఇక ఆ రాత్రి నిద్రపట్టలేదతనికి.



ఆ రోజు ఆఫీసుకు సెలవుపెట్టాడు త్రివిక్రమరావు. వనిత మాత్రం కాలేజికెళ్ళి అక్కడ్నుంచి వెంకట్రామయ్యకు ఫోన్‌చేసి తల్లిదండ్రుల ప్రయాణాన్ని వివరించింది.

"ఎక్కడికోదినా బయలుదేరుతున్నారు?" దాదాపు పదమూడేళ్ళ తర్వాత అన్నగారింటికి బయలుదేరుతున్న భాగ్యాన్ని సమీపించి అడిగింది కామాక్షి.

మొహం మాడ్చుకుంది భాగ్యం. శుభమా అంటూ తాము బయలుదేరుతుంటే ఆమె ఎదుర్రావటం అపశకునంలా తోచింది.

"అరె... అన్నయ్యగారు కూడా ఉన్నారే. ఏమిటో విశేషం. చాన్నాళ్ళ తర్వాత జంటగా బయలుదేర్తున్నారు" తెలీనట్లు నటిస్తూ కాజువల్గా అడిగింది కామాక్షి.

"అలా బజారుకెళ్తున్నాం" చెప్పింది భాగ్యం.

"అమ్మ నంగనాచి. ఏం చెప్తున్నావమ్మా. నిజం నాకు తెలీదనుకుంటుంది కాబోలు, మీ అమ్మాయి కూడా సరస్వతిలాగే అబార్షన్దాకా తెచ్చుకుందట. బజారుకెళ్తుందట బజారుకి" మనసులోనే మెటికలు విరుచుకుంది.

వరంధామయ్యానింట్లోనే పెట్టి రిక్షాలో కూర్చున్నారు త్రివిక్రమరావు, భాగ్యంలు. దారి పొడుగునా ఆలోచిస్తూనే ఉన్నాడు త్రివిక్రమరావు. మనసులో గిల్టీగా ఫీలవుతున్నాడు. భాగ్యం మొహం చూడ్డానికే సిగ్గుపడుతున్నాడు.

దార్లో పెద్ద గుంపు కనిపించి రిక్షానాపించాడు త్రివిక్రమరావు.

రోడ్పై గోలగోలగానున్నారు జనం. ఓ కారు కూడా ఆగుంది. గుంపు చాలా ఎక్కువగా ఉండటంతో మధ్యలో ఏముండేది అర్థంకాలేదు.

"ఏం జరిగింది?" ఓ వ్యక్తిని పిలిచి అడిగాడు.

"యాక్సిడెంట్- ఎవడో పిచ్చాడు కారుకింద పడి చచ్చాడు"

ఎందుకో రామనాథం గుర్తొచ్చాడు త్రివిక్రమరావుకు. రిక్షాదిగి వెళ్ళి చూశాడు. నిజమే అతని అనుమానం యదార్థమైంది. అతను రామనాథమే. రక్తపు మడుగులో ఉంది శవం. బీభత్సంగా భయానకంగా ఉంది.

రకరకాల కామెంట్స్ చేస్తున్నారు జనం.

హృదయంలో ఎక్కడో కలుక్కుమంది త్రివిక్రమరావుకు.

"పూర్ఫెలో" బాధగా నిట్టూరుస్తూ రిక్షాలో కూర్చుని "పోనివ్" చెప్పాడు త్రివిక్రమరావు.

"ఎవరండీ" అతని వాలకం చూసి అడిగింది భాగ్యం.

"రామనాథం"

"ఎలా ఉండేవాడు ఎలా అయ్యాడు. అందుకే అంటారు మనుషుల్ని కనగలంకాని వాళ్ళ రాతల్ని కనగలమా అని" బరువుగా అంది భాగ్యం.

చాన్నాళ్ళ తర్వాత తనింటిముందు రిక్షా దిగుతూన్న చెల్లెలు, బావని చూసి చటుక్కున పేపర్లో తలదూర్చాడు వెంకట్రామయ్య. పేపర్ని తలకిందులుగా పట్టుకున్నది కూడా గమనించకుండా దొంగచూపులు చూస్తున్నాడు.

రిక్షా దిగి బాడుగిచ్చి పంపించాడు త్రివిక్రమరావు. బలవంతానే అడుగుముందుకేశాడు. నిశ్శబ్దంగా అతన్ననుసరించింది భాగ్యం.

ముందు హాల్లోనే కూర్చుని ఉన్నాడు వెంకట్రామయ్య. మరో రెండు కుర్చీలు మాత్రం ఖాళీగా ఉన్నాయి. వాళ్ళని గమనించనట్లే నటిస్తున్నాడతను.

నిశ్శబ్దంగా వచ్చి కుర్చీలో కూర్చున్నారిద్దరూ.

భర్త మొహంలో కనిపిస్తున్న అనీజీని పసిగట్టి- "బావున్నావా అన్నయ్యా?" అంటూ తనే ముందు పలకరించింది భాగ్యం.

పేపర్ను పక్కకుతీసి అప్పుడే వార్ని చూసినట్లు ఆశ్చర్యపోతూ "అరే... మీరా- ఎప్పుడొచ్చారు?" విపరీతాశ్చర్యానికి లోనైట్లు ఫీలింగ్ పెడ్తూ అడిగాడు వెంకట్రామయ్య.

"ఇప్పుడే" ముక్తసరిగా చెప్పాడు త్రివిక్రమరావు.

"వర్ధనీ... త్వరగా రా... ఎవరొచ్చారో చూడు" లోపలికి వినిపించేట్లు అరిచాడు వెంకట్రామయ్య.

"అరే... అన్నయ్యగారా... భాగ్యం ఎప్పుడొచ్చారు?" హడావుడిగా వచ్చి సంతోషంగా పరామర్శించింది వర్ధని.

పరామర్శలయ్యాయి. కాఫీ, టిఫిన్‌లు కూడా అయ్యాయి. లోపలి గదుల్లోంచి ఆసక్తిగా వింటున్నారు - చిరంజీవి, వనితలు.

తోటకూర విశేషాలు, గోంగూర కబుర్లూ అయింతర్వాత తమ రాకలోని ఉద్దేశాన్ని బయటపెట్టింది భాగ్యం.

ఆ విషయం వింటూనే అప్రసన్నంగా మారి పోయాడు వెంకట్రామయ్య.

"మావాడు అంతపని చేశాడా?" అపనమ్మకంగా అడిగాడు.

"అవును" చెప్పాడు త్రివిక్రమరావు.

"నేను నమ్మలేకున్నాను"

"నమ్మకం కోసం మీవాడ్నే పిలిచి అడుగు"

"అబ్బెబ్బె... మీరు అబద్ధం చెబుతున్నారని కాదు బావగారూ"తడబడ్డాడు వెంకట్రామయ్య.

"అన్నయ్యా... జరిగిందేదో జరిగిపోయింది. ఇక జరుగవలసింది ఆలోచించండి. కడుపు చించుకుంటే కాళ్ళమీద పడ్తుందని- ఇప్పుడే మనుకున్నా.. మనం చేయాల్సింది వాళ్ళిద్దరి పెళ్ళి" అంది భాగ్యం.

"నిన్ననే మావాడికో సంబంధం వచ్చింది. రెండు లక్షలపైనే ఇస్తామన్నారు. వాళ్ళ సంప్రదాయం నచ్చక తిరస్కరించాను" హఠాత్తుగా చెప్పాడు వెంకట్రామయ్య.

గతుక్కుమన్నాడు త్రివిక్రమరావు. గొంతుకేదో అడ్డంపడ్డట్లు ఉక్కిరిబిక్కిరైంది భాగ్యం.

"అ...న్న య్యా.."

"మొన్న వైజాగ్ నుంచి ఓ సంబంధం వచ్చింది. లక్షాధికారులు. ఒక్కర్తే అమ్మాయి. రంగు తక్కువని కాదన్నాను"

"అన్నయ్యా" గట్టిగా పిల్చింది భాగ్యం.

"ఆ.. ఏమిటీ?"

"మేమొచ్చింది వనితను మీ ఇంటి కోడలిగా చేసుకొమ్మని అడగటానికి... నీ పురాణం వింటానిక్కాదు" ఉక్రోషంగా అంది.

"ఆ.. చెప్పు"

"చెప్పేదేముంది. చిరంజీవి మా అమ్మాయి వనితను ప్రేమించాడు, వాళ్ళిద్దరికీ పెళ్ళిచేయమని అడుగుతున్నాను"

"సరే... అయిన సంబంధం. నాకేం అయిష్టమేం కాదు. కట్నకానుకలు కూడా చెప్పు. ఎంతిస్తావో. ముహూర్తాలు పెట్టుకుందాం"

"కట్న..కా..ను..క..లా..?" విస్తుపోయారు త్రివిక్రమరావు, భాగ్యంలు.

"ఏం... అంతగా ఆశ్చర్యపోతున్నారు?"

"ఒరేయ్ అన్నయ్యా... ఆఖరికి చెల్లెల్ని కూడా కట్నమడుగుతున్నావురా? ఇదేనట్రా నీ సంస్కారం?" దెప్పి పొడిచింది భాగ్యం.

"చెల్లెలయితే కట్నం తీసుకోకుండా చేసుకోవాలని రూలెక్కడుందేమిటి? అయినా డబ్బెవరికి చేదు"

"అంతేనా?"

"అంతే...అంతే... ముమ్మాటికీ అంతే. చెల్లెలివి, పైగా నీ కూతురు గర్భవతి కూడా అయింది కాబట్టి ఓ యాభైవేలతో అడ్జస్ట్ చేసుకుంటాను. పది తులాల బంగారం పెట్టి ఓ స్కూటర్ లాంఛనంగా ఇవ్వు చాలు సర్దుకుంటాను" తేల్చి చెప్పాడు వెంకట్రామయ్య.

"యాభై వేలా?" ఆశ్చర్యంతో నోరు తెరిచాడు త్రివిక్రమరావు.

"అంతేకాదు... పది తులాల బంగారం, ఓ స్కూటర్" సరిచేశాడు వెంకట్రామయ్య.

బేలగా చూసింది భాగ్యం.

"అన్నయ్యా... నీకిది న్యాయం కాదురా. ఇంటికొచ్చిన చెల్లెల్ని కష్టపెట్టడం ధర్మంకాదురా- ఆలోచించరా" దీనంగా వేడుకుంది భాగ్యం.

"భాగ్యం నాదెప్పుడూ ఒకటే మాట. నేనడిగినంత ఇవ్వగలిగితే చెప్పండి ముహూర్తాలు పెట్టుకుందాం. లేదంటే..."

అతని ఉద్దేశం అర్థమైంది భాగ్యానికి.

పౌరుషంగా చూశాడు త్రివిక్రమరావు.

"భాగ్యం... వాణ్ణెందుకే ప్రాధేయపడతావ్. వాడొట్టి డబ్బు మనిషే. మన అసహాయతను ఆసరాగా చేసుకుని పీడిస్తున్నాడే" అని వెంకట్రామయ్య వైపు తిరిగి... "గౌరవనీయులైన వెంకట్రామయ్యగారూ అలాగేనండీ మీరడిగే కట్నం ఇవ్వటానికి నేనంగీకరిస్తున్నాను. పది తులాల బంగారం పెట్టి యాభైవేలిస్తాను.

లాంఛనంగా స్కూటర్ కూడా కొనిస్తాను... నరా!?'' వ్యంగ్యంగా చెప్పాడు త్రివిక్రమరావు.

నివ్వెరపోయింది భాగ్యం.

"ఎక్కణ్ణుంచి తెస్తారండీ అంత డబ్బు. మీకేమన్నా మతిపోయిందా?'' కంగారుగా అంది భాగ్యం.

"తల తాకట్టుపెట్టి తెస్తా. అంతేగాని వీణ్ణి ప్రాధేయపడతాననుకున్నావా? నువ్వన్నట్లు ఇంకా మతిపోలేదు. మనుమల ప్రవర్తన, ఆశ చూస్తుంటే పోయిన మతి తిరిగొస్తోందే'' అన్నాడు త్రివిక్రమరావు.

అప్పుడే ఓ పురోహితుణ్ణి పిలిపించి ముహూర్తాలు పెట్టుకున్నారు.

పదిహేను రోజుల తర్వాత ఇరవై అయిదవ తేదీ రాత్రి ఎనిమిదిన్నరకు ముహూర్తం నిశ్చయించుకున్నారు.

"వెళ్ళొస్తాం'' హుందాగా అంటూ కుర్చీ లోంచి లేచాడు త్రివిక్రమరావు.

"బావగారూ... ఒక్కమాట'' తనూ కుర్చీ లోంచి లేస్తూ అన్నాడు వెంకట్రామయ్య.

"ఏమిటి?''

"సూత్రధారణకు ముందే కట్నకానుకలు పూర్తిగా ముట్టజెప్పాలి''

పురుగును చూసినట్లు అతనివైపు చూసి "అలాగే'' అంటూ కదిలాడు త్రివిక్రమరావు. అతన్ననుసరించింది భాగ్యం. వాళ్ళ రిక్షా కను మరుగైంతర్వాత లోపలినుంచి బయటకొచ్చారు చిరంజీవి, వనితలు.

"ఏమ్మా... ఎలా ఉంది నా యాక్షన్?''

"సూపర్ మామయ్యా... ఇదే స్క్రీన్‌పై అయ్యుంటే ఈ సంవత్సరపు ఉత్తమనటుడి అవార్డ్ మీకే వచ్చుండేది'' చెప్పింది వనిత.

★ ★ ★

రిక్షా దిగి లోపలికొస్తున్న త్రివిక్రమరావు, భాగ్యంలను సమీపించి అడిగాడు పరంధామయ్య- "ఏం చేసుకొస్తున్నారు... కాయా... పండా?'' అంటూ.

"పండే...'' నీర్సంగా అంది భాగ్యం.

"అదేంటమ్మాయ్ నీర్సంగా ఉంది గొంతు... అసలేం జరిగింది?'' ఆరాగా అడిగాడు పరంధామయ్య.

జరిగిందంతా చెప్పింది భాగ్యం.

"ఎక్కడ్నుంచి తెస్తారు మామయ్యా... యాభైవేల కట్నం. పదితులాల బంగారం... స్కూటర్...?'' బాధ... కోపం మిళితమైన స్వరంతో చెప్పింది భాగ్యం.

"యాభైవేలు... పదితులాల బంగారం... స్కూటర్... దాదాపు లక్షరూపాయల పైనే'' అంటూ మనసులో లెఖ్ఖలేసుకుని... "ఒరే విక్రం ఎక్కడ్నుంచి తెస్తావురా అంత డబ్బు...?'' ఆందోళనగా అడిగాడు పరంధామయ్య.

"మన అసహాయతను ఆసరాగా చేసుకుని వాడంత బెట్టు చేస్తుంటే నేనేనా బాబాయ్ అంత చాతగానివాణ్ణి- అప్టాల్ లక్షరూపాయలు తేలేనా... ఉన్న ఒక్కగానొక్క అమ్మాయి పెళ్లి చేయలేనా..?'' మనసులో తన స్నేహితుడు సుదర్శన్ మెదుల్తూండగా పౌరుషంగా అన్నాడు త్రివిక్రమరావు.

"ఒరేయ్... పంతాలకు పట్టింపులకూ ఇది కాదురా సమయం... పరిస్థితినెరిగి ప్రవర్తించాలి'' మందలిస్తున్న ధోరణిలో చెప్పాడు పరంధామయ్య.

"బాబాయ్... నేనేం అసమర్థుడ్నికాను. చూస్తూ ఉండండి. వనిత పెళ్లి ఎంత ఘనంగా చేస్తానో...'' అంటూ బయటికెళ్లాడు.

"ప్చ్...'' భారంగా నిట్టూర్చింది భాగ్యం.

"ఎంత చెప్పినా ఈయన మారరు మామయ్యా... పంతాలకు పోతారేగాని పరిస్థితులెరుగరు.. ఎక్కడ్నుంచి తెస్తారంత డబ్బు...?'' ఆవేదనగా అంది భాగ్యం.

"నేనేళ్ళొస్తానమ్మాయ్... ఇరవై అయిదవ తేదీ అంటే ఎంతోదూరం లేదుగా మీ అత్తయ్యను కూడా తీసుకురావాలిగా...'' భాగ్యంతో చెప్పి వెళ్ళిపోయాడు పరంధామయ్య.

పదేళ్ళనుంచీ స్నేహితుడైన సుదర్శన్ ఇంటికి బయలుదేరాడు త్రివిక్రమరావు.

సుదర్శన్... లక్షలు మూలుగుతున్న వ్యక్తి... ఇద్దరు కొడుకులకూ పెళ్ళిళ్ళు చేసి... హాయిగా కాలక్షేపం చేస్తున్న వ్యక్తి... దాదాపు పదేళ్ల క్రితం మట్కాగృహం దగ్గర పరిచయమయ్యాడతను

త్రివిక్రమరావుకు.

నంబర్లు రాసుకునే దగ్గర మొదలైన వారి స్నేహం దినదిన ప్రవర్ధమానమై... మొగ్గ తొడిగి పుష్పించి... బార్‌ల వరకూ దారితీసింది. ఒకరినొకరు అప్పులిచ్చుకుని ఆదుకునేంత వరకూ వచ్చింది వారి స్నేహం.

ఒకరోజు...

మట్కాలో జేబు ఖాళీ అవటం వలన అంత లక్షాధికారి దగ్గర కూడా మందుకు డబ్బు కొరవైంది. అతని ఇబ్బందిని అర్థంచేసుకున్న త్రివిక్రమరావు అతనడక్కుండానే తనే సహాయం చేశాడు...

మరోసారి జేబు ఖాళీయై బిడియపడుతున్న త్రివిక్రమరావును బార్‌కి తీసుకెళ్లి మందు పోయించి "త్రివిక్రమరావ్... ఇన్నాళ్ళ పరిచయం తర్వాత కూడా నన్ను సరిగా అర్థం చేసుకోలేదయ్యా నువ్వు. స్నేహానికి ప్రాణమిచ్చే మనిషినయ్యా నేను... నీకేం కావాలో చెప్పు.. నీకెప్పుడే అవసరం వచ్చినా... వందలు... వేలు... లక్షలు... అవసరమైతే నిరభ్యంతరంగా అడిగి తీసుకెళ్ళు. నాదగ్గర సందేహిస్తావేమయ్యా..." అంటూ మందలించాడు సుదర్శన్.

ఆనాటినుంచీ మరింత గాఢమైంది వారి స్నేహం. అడపాదడపా సుదర్శన్ జేబు ఖాళీ అవటం.. అతను త్రివిక్రమరావు దగ్గరే బదులు తీసుకోవటం జరుగుతూ వస్తూ ఉంది.

సుదర్శన్ ఇంటిముందు నిల్చున్నాడు త్రివిక్రమరావు. తన అడ్రస్ చెప్పి సుదర్శన్ ఎప్పుడూ ఆహ్వానించటం తప్ప... ఏనాడూ అతని ఇంటికెళ్ళని త్రివిక్రమరావు అతని ఇల్లు చూసి ఆశ్చర్యంతో నోరు తెరిచాడు.

చాలా విశాలమైన బంగ్లా... చుట్టూ ప్రహరీ గోడ... బంగ్లాకు ప్రహరీగోడకు మధ్యలో రకరకాల పూలమొక్కలు. ప్రహరీగేటు తెరుచుకుని లోపలికడుగు పెట్టాడు త్రివిక్రమరావు. గేటు దగ్గర్నుంచి బంగ్లా వరకూ నున్నటి మట్టిరోడ్... ఇరువైపులా చిరుగాలికి తలలూపుతూ ఆహ్వానిస్తూన్న అందమైన పూలమొక్కలు- వైభవోపేతమైన ఆ ఇంటి సౌందర్యానికి ముగ్ధుడవుతూనే లోపలికి నడిచాడు త్రివిక్రమరావు.

హాల్లో నిలబడ్డాడు... ఎవరూ కనిపించలేదు. ఓ క్షణం ఆ హాలును పరికించాడు. ఖరీదైన సోఫాలు... గోడలకు ఆయిల్ పెయింట్స్.. అలమరాల్లో బొమ్మలు, మూలల్లో ఫ్లవర్ వాజ్‌లు... అందమైన కార్పెట్.. ఆ బంగ్లా ఖరీదును అంచనా వేయాలని ప్రయత్నించాడు.

"ఎవరు కావాలండీ..?" పనిమనిషి కాబోలు లోపల్నుంచొచ్చి అడిగాడతను.

"సుదర్శన్‌గారున్నారా?" అతనికి తెలీకుండానే వినయం చోటుచేసుకుంది స్వరంలో... ఆక్షణం వరకూ పిలుచుకున్న అరేయ్.. ఒరేయ్‌లను బంగ్లాలోకి అడుగుపెట్టిన క్షణంలోనే మరచిపోయాడు.

"అయ్యగారా.. లోపలున్నారు... కూర్చోండి... పిలుస్తాను." మర్యాదగా చెప్పి లోపలికెళ్లాడతను.

అక్కడే ఉన్నటి కుర్చీలో కూర్చున్నాడు త్రివిక్రమరావు.

రెండేరెండు క్షణాల్లో జారిపోతున్న లుంగీని సర్దుకుంటూ ఆదరాబాదరాగా పరుగెత్తుకొచ్చాడు సుదర్శన్.

"అరే... త్రివిక్రమ... నువ్వా. ఎన్నాళ్లకెన్నాళ్ళకు... ఇప్పటికి దయ కల్గిందన్నమాట దొరగారికి... అక్కడే కూర్చుండిపోయావేం లోపలికి రా.." అంటూ త్రివిక్రమరావును ఉక్కిరిబిక్కిరి చేస్తూ తన గదిలోకి తీసుకెళ్లాడు సుదర్శన్.

ఆ ఆప్యాయతకు కదిలిపోయాడు త్రివిక్రమరావు.. తనొచ్చిన పని సగం పూర్తయినట్లే ఫీలయ్యాడు.

"చెప్పు... ఏంతీస్కుంటావ్... బ్రాందీ... విస్కీ... రమ్.. జిన్.. బీర్..." అంటూ గడగడా లిస్ట్ చదివాడు సుదర్శన్.

"ఇప్పుడేం వద్దు" మొహమాట పడ్డాడు త్రివిక్రమరావు.

"అలా కాదు.. ఏదో ఒకటి తీసుకోవాల్సిందే" అంటూ షెల్ఫ్ తెరిచాడు సుదర్శన్.

విస్మయంగా చూశాడు త్రివిక్రమరావు షెల్ఫ్ వైపు. పైనుంచి క్రిందివరకూ రకరకాల లిక్కర్ బాటిల్స్ నీట్‌గా పేర్చబడున్నాయి. షెల్ఫ్‌లోంచి విస్కీ బాటిల్ రెండు గ్లాసులు

తీసి త్రివిక్రమరావు ముందున్న టేబుల్‌పై పెట్టాడు. "ఇన్ని ఉన్నవాడు తనతో అణాకానీ బార్లకు ఎందుకు వస్తున్నట్లు?" తన మనసు లోని మాటనెలా బయటపెట్టాలా అని ఆలోచి స్తూ గ్లాసు ఖాళీ చేశాడు త్రివిక్రమరావు. సిగ రెట్ వెలిగించి అతనికో సిగరెట్ ఆఫర్ చేశా డు సుదర్శన్.

"వాట్ ఫ్రెండ్... ఇప్పుడు చెప్పు... ఏంటి విశేషాలు... ఊరకరారు మహాత్ములన్నట్లు... నీ రాకలోని ఉద్దేశమేమిటి?" గ్లాసు ఖాళీ చేసి టేబుల్‌పై పెట్టూ అడిగాడు సుదర్శన్.

మొదట వనిత పరిస్థితి వివరించాడు. ఆ తర్వాత కట్నం గురించీ చెప్పాడు.."అంత డబ్బెలా పోగుచేయాలో అర్థం కాలేదు సుద ర్శన్. ఆ సమయంలో నువ్వే గుర్తొచ్చి పెళ్ళి ఖాయం చేశాను. ఈ గండాన్నుంచి నన్ను నువ్వే గట్టెక్కించాలి" ఆశగా చూస్తూ తన హృదయభారాన్ని దించుకున్నాడు త్రివిక్రమ రావు.

రంగు మారిపోయింది సుదర్శన్ మొహం. మొదట నల్లగానూ... ఆ తర్వాత తెల్లగానూ అయింది.

"యూ మీన్... నీకిప్పుడు లక్షరూపాయలు కావాలి- యామై కరెక్ట్?"

"యస్... నీ మీదే ఆశలన్నీ పెట్టుకున్నా ను"

"ఓ.కే... నీ ఆశలు వమ్ముకాకుండా లక్షరూ పాయలిస్తాను" అని ఓ క్షణమాగాడు సుద ర్శన్.

ఆ మాటకే మతాబులా వెలిగిపోయింది త్రివిక్రమరావు మొహం. "సరే... మళ్లీ ఎలా తీరుస్తావ్... ఎప్పుడు తీరుస్తావ్?"

సుదర్శన్ అడిగిన ఆ తర్వాతి ప్రశ్నకు ఫ్యూజు పోయిన బల్బులా మాడిపోయింది త్రివిక్రమరావు మొహం..

"...."

"ఆన్సర్ మీ ఫ్రెండ్.." రెట్టించాడు సుద ర్శన్.

ఆ విషయం గురించి అప్పటివరకూ ఆలో చించని త్రివిక్రమరావు ఆక్షణంలో ఆలోచనలో పడ్డాడు..

"సుదర్శన్... వచ్చే డిసెంబర్‌తో నాలైఫ్ ఇన్సూరెన్స్ పాలసీ పూర్తవుతుంది. ఇంకా పి.యఫ్. లోన్ తీసుకుంటాను. ఎలాగోలా నీ అప్పును వడ్డీతోసహా తీర్చేస్తాను.. ప్లీజ్ ఈ కష్టాన్ని ఆదుకో-" ప్రాధేయపడ్డాడు.

"గ్యారంటీ ఏమిటి మిస్టర్ త్రివిక్రమరావు. యల్లెసీ కాష్ చేతికిరాగానే మట్కాలకు... జూదాలకు తగలెట్టక నా అప్పుతీరుస్తావని గారంటీ ఏమిటి. అసలు నీకెందుకివ్వాలి అప్పు... నీ దగ్గరేముందని నిన్ను నమ్మి నేను లక్షరూపాయలు అప్పివ్వాలి..." తాపీగా అడి గాడు సుదర్శన్.

అదిరిపడ్డాడు త్రివిక్రమరావు ఆ ప్రశ్న పరంపరని విని. అతను సుదర్శనేనా అని పించిందతనికో క్షణం..

"సు..ద..ర్శ..న్.. నీకెప్పుడే అవసరం వచ్చినా... వందలు.. వేలు లక్షలు... అవసర మైతే నిరభ్యంతరంగా తీసుకెళ్ళమన్న ను వ్వేనా ఇప్పుడిలా అం..టు..న్నా..ది..?"

నవ్వాడు సుదర్శన్..

"పిచ్చి త్రివిక్రమరావ్.. జూదగాళ్ళ మాట లకు అర్థాలు వేరని తెలీదా.. అప్పుడేదో మందుమత్తులో ఏదో వాగేశాననుకో... సంపా దించిన జీతమంతా.. లాటరీలకు.. మట్కాకు తగలెట్టేసి అప్పులపాలైన నీకు నేనెంత అప్పెలా ఇస్తాననుకున్నావ్..?"

సుదర్శన్ మాటలు సూటిగా తాకాయి త్రివి క్రమరావు హృదయాన్ని

"సు..ద..ర్శ..న్..?"

"అవును... మనం స్నేహితులమే.. ఎంతవ రకు .. మట్కా దగ్గర కలిసి విడిపోయేంతవర కే.. కలిసిన ఆ నాలుగైదు క్షణాల్లో మందు మత్తులో ఏవేవో వాగ్దానాలు కోసేస్తుంటాము... వాటన్నింటినీ పట్టుకూర్చుంటే ఎలా...?" సూ టిగా ప్రశ్నించాడతను.

తలగిర్రున తిరిగిపోయింది త్రివిక్రమరావు కి.

"సంపాదించిన జీతమంతా లాటరీలకు.. మట్కాకు తగలెట్టేసి.. అప్పులపాలైన నీకు నేనంత అప్పెలా ఇస్తాననుకున్నావ్' పరిహ




సిస్తున్నట్లున్నాయతని మాటలు..

మౌనంగా కుర్చీలోంచి లేచాడు త్రివిక్రమరావు.

"ఫూల్.. వ్యసనపరులకెవరూ అప్పివ్వరని తెలీదు కాబోలు" వ్యంగ్యంగా సుదర్శన్ అంటున్న మాటల్ని వింటూ నిశ్శబ్దంగా కదిలాడు త్రివిక్రమరావు.

మొట్టమొదటిసారిగా బావమరిది వెంకట్రామయ్య గతంలో చెప్పిన మాటలను మననం చేసుకున్నాడతను..

"బావా.. మనం సామాన్యులం.. కూర్చుని తిన్నా తరగనంత ఆస్తున్న కోటీశ్వరులంకాదు.. ఏపూటకాపూట అడుక్కుతినే బికారులమూ కాదు.. మధ్యతరగతి కుటుంబీకులం.."

"నిజమే సుదర్శన్ లక్షాధికారి. అతను మట్కా.. రేసుల్లాంటి ఆటలాడినా.. ఎన్నివేలు పోగొట్టినా అతను వ్యసనపరుడు కాదు.. తను సామాన్యుడు కావున వ్యసనపరుడయ్యాడు.. కారణం.. తన దగ్గర లక్షల్లేవు.."

మొదటిసారిగా ఆలోచనల్లోపడ్డాడు.. అంతర్మధనం ప్రారంభమైనందతనిలో. ఆలోచన.. పురోగమనానికి తొలిమెట్టు..

కర్తవ్యం పాలుపోలేదతనికి.

ఏంచేయాలి.. ఎలా సంపాదించాలి అంత డబ్బు.

సుదర్శన్‌పై నమ్మకముంచి వెంకట్రామయ్యతో సవాల్ చేశాడు. ఇప్పుడా సుదర్శన్ మొండిచేయి చూపించాడు. ఇప్పుడేం చేయాలి?

మార్వాడి చందన్‌లాల్ మెదిలాడతని మనసులో.. అప్పుడప్పుడూ తనకు అవసరమైనప్పుడు అప్పిస్తుంటాడతను.. వడ్డీ కాస్త ఎక్కువే..

అతన్ని కలిశాడు త్రివిక్రమరావు.. యల్లైసీ బాండ్ తాకట్టు పెట్టుకుని అప్పివ్వమని అడిగాడు.

నవ్వాడు చందన్‌లాల్.

"క్యాసాబ్.. జోక్ చేస్తుండార్.. ఇలాంటి బాండ్‌లు లక్షపుట్టించచ్చు ఆఫీసులో... ఇవి మా దగ్గరుండగనే మీరు డూప్లికేట్లతో డబ్బు తీసుకోరని నమ్మకమేంటి.. దుర్వ్యసనాలకులోనై భార్యాబిడ్డలకు కట్టుకథలు చెప్పేవారు.. చివరకు మాకు మాత్రం మొండిచెయ్యి చూపించరనేముంది. మా బాకీ వసూలు చేసుకోటానికి మీ దగ్గరేముందని.. ఆస్తా.. హెడా.. ఐ.పి. పెడితే మా గతేంకావాలి... మాట నమ్మకమా అంటే.. వ్యసనపరులకు నీతి నియమాలేంటి..?" త్రివిక్రమరావు మెదడుకు పట్టిన బూజు దులిపాడు చందన్‌లాల్..

ఆ మాటలు విని.. విలవిల్లాడాడు త్రివిక్రమరావు. కాళ్ళీడ్చుకుంటూ ఇంటిదారి పట్టాడు.. నిరాశానిస్పృహలు అతన్ని వెన్నంటాయి.

★ ★ ★

తమ ఆఫీసులోనే పనిచేసే సోమశేఖరంతో తన పరిస్థితిని చెప్పుకుని.. అప్పు అడిగాడు త్రివిక్రమరావు. అది తీర్చేమార్గాన్ని కూడా తెలిచేశాడు..

సానుభూతిగా చూశాడు సోమశేఖరం.

అతనికి పిల్లల్లేరు.. ఆస్తిపాస్తులు పుష్కలంగానే ఉన్నాయి.. దయార్ద్రహృదయుడని ఆఫీసులో పేరుంది.

సాయంత్రం ఇంటికొచ్చి నోట్ రాసిచ్చి డబ్బు పట్టుకెళ్ళమని చెప్పాడు సోమశేఖరం..

ఉబ్బితబ్బిబ్బవుతూ అతని చేతులు పట్టుకుని కృతజ్ఞతలు తెలిచేశాడు. త్రివిక్రమరావు. నిరాశ పూర్తిగా తప్పుకుందతనిలోంచి.. నూతనోత్సాహంతో ఆ సాయంత్రం సోమశేఖరం ఇంట్లోకి అడుగుపెట్టాడు..

కాఫీలయ్యాక...

నోటు రాయటం పూర్తిచేసీచేయగానే అప్పుడొచ్చాడు త్రివిక్రమరావింటికి బ్రహ్మానందం. నాలుగిళ్ళవతలే అతనిల్లు..

"అరే.. త్రివిక్రమరావు గారా.. మీరిక్కడున్నారేంటి?" ఆశ్చర్యంగా అడిగాడు బ్రహ్మానందం... అతను సోమశేఖరం బావమరిదే..

అనీజీగా కదిలాడు త్రివిక్రమరావు.

అసలు విషయం చెప్పాడు సోమశేఖరం..

"బావగారూ-" అంటూ ఇంతెత్తున లేచాడు బ్రహ్మానందం..

"బావగారూ.. మీకేమైనా పిచ్చిపట్టిందా.. ఇతనికెలా అప్పిస్తున్నారు. మీరు.. ఆ డబ్బు

తిరిగొస్తుందనుకున్నారా.. ఇతనికి లేని వ్యసన మంటూ లేదు.. మట్కా, తాగుడు ఇతని పంచప్రాణాలు. మీరిచ్చే ఈ డబ్బు ఏ మట్కా గృహానికో.. బార్‌కో వెళ్తుంది.. ఆ తర్వాత మీరు చిప్పచేత పట్టుకోవాల్సిందే..'' అంటూ ఆ నోటు తీసి పరపరా చింపేశాడు బ్రహ్మానందం..

తెల్లబోయి చూస్తుండిపోయాడు త్రివిక్రమ రావు.. సోమశేఖరం చేత చెప్పించుకోనవసరం లేకుండానే బయటపడ్డాడు..

అతని మనసులో సంఘర్షణ..

తనపట్ల తనకే జాలి.. అసహ్యం..

ఇంతకాలానికి ఓ మనిషిలా ఆలోచిస్తున్నా డతను.

ఎందుకు తనకీ స్థితి?

కనీసం అప్పు పుట్టించుకునే సామర్థ్యం తనకు లేదా.

తను ప్రభుత్వోద్యోగి. సొంత ఇల్లుంది. అయినా తనకు అప్పిచ్చే నాథుడే లేడు. ఏమిటి తను చేసిన నేరం?

కేవలం మట్కా, లాటరీలు, తాగుడుకు బానిసకావటమేగదా?

చరచరా ఇంట్లోకి ప్రవేశించి లాటరీ టిక్కె ట్లను పరపరా చింపేస్తున్న త్రివిక్రమరావు



వైపు విస్మయంగా చూస్తూండిపోయారు భాగ్యం, వనితలు. అతని ప్రవర్తనలో ఏదోమార్పు, చూపుల్లో ఏదో మార్పు గోచరించింది వాళ్ళకి.

కసిగా చింపేస్తున్నాడు త్రివిక్రమరావు.

ఆవేశంగా, ఆవేదనగా చింపేస్తున్నాడు.

అతని పాదాల దగ్గర టిక్కెట్ల ముక్కలు పెద్దకుప్పలా అయ్యాయి. అగ్గిపుల్ల గీసి ఆ కుప్పపై వేశాడు. భగ్గున అంటుకుంది.

ఆ మంటల వెలుగులో అతని మొహం చిత్రంగా మెరుస్తూంది. తనలోని దురాశను, దుర్వ్యసనాలను తగులబెడుతూన్న జ్ఞానిలా ఉన్నాడు.

భాగ్యం, వనితలు విస్మయంగా చూస్తూండగానే నిశ్శబ్దంగా కదిలాడు. తన ఇంటిని తాకట్టు పెట్టుకుని ఆరువేలు అప్పిచ్చిన మార్వాడీ కంగన్‌లాల్‌ను కలిశాడు. ఆ ఇంటి మీదే మరో యాభైవేలడిగాడు.

"సారీ త్రివిక్రమరావ్‌జీ. మీరా ఇంటిని అమ్మే పనైతే చెప్పండి. ఏదో ఓరేటు సెటిల్ చేసుకుందాం. ఇక ఆ ఇంటిపై అప్పిచ్చే ప్రసక్తే లేదు" ఖచ్చితంగా చెప్పాడు కంగన్‌లాల్.

"తనకా ఇంటిని అమ్మే ఉద్దేశం లేదని" చెప్పి కదిలాడు త్రివిక్రమరావు.

అన్నిమార్గాలూ మూసుకపోయిన చీకటిగోళంలో చిక్కుకున్నట్లనిపించింది త్రివిక్రమరావుకు. రెండురోజులు నిష్ప్రయోజనంగానే గడిచిపోయాయి.

★ ★ ★

కళ్ళు మూసుకుని, మోచేయిని కళ్ళపై నుంచుకుని పడక్కుర్చీలో కూర్చొన్నాడు త్రివిక్రమరావు. దీర్ఘంగా యోచిస్తున్నాడు.

"భోజనానికి రండి" పిల్చింది భాగ్యం.

"నాకాకలిగా లేదు భాగ్యం- నువు తినేసెయ్"

అతనివైపు పరిశీలనగా చూసింది భాగ్యం. నిరాశగా, నిస్సత్తువగా కనిపించాడు.

"ఏమిటండీ, ఉదయంనుంచీ అదోలా ఉన్నారు- ఒంట్లో బావులేదా?" అతని పక్కనే కింద కూర్చుని నుదుటిపై చేయేస్తూ అడిగింది భాగ్యం.

"అదేంలేదు... బాగానే ఉన్నానే!" నవ్వాడు త్రివిక్రమరావు. ఆ నవ్వు నిర్జీవంగా కనిపించింది భాగ్యానికి.

"లేవండి, భోజనంచేద్దురు"

"నాకాకలిగాలేదు నువ్వు కానివ్"

"మీరిలాఉంటే నాకెలా సయిస్తుందండీ" బాధగా అంది భాగ్యం.

కుర్చీలోంచి లేచాడు త్రివిక్రమరావు.

"పద"

★ ★ ★

అర్ధరాత్రి హఠాత్తుగా మెలుకువ వచ్చి చూసింది భాగ్యం. ఎదురుగా మంచంపై కూర్చుని కనిపించాడు త్రివిక్రమరావు.

అబ్బురంగా చూసిందతనివైపు.

ఆ సమయంలో అతను ఇంట్లో ఉండటం ఒక విశేషమైతే, అలా ఒంటరిగా మధనపడుతూండటం, అతన్నాస్థితిలో చూడటం జీవితంలో అదే మొదటిసారి భాగ్యానికి.

నిశ్శబ్దంగా అతన్ని సమీపించి పక్కన కూర్చుంది భాగ్యం.

"ఏ...మం...డీ?"

"నన్ను క్షమించు భాగ్యం- జీవితంలో పూర్తిగా ఓడిపోయాను" బరువుగా అన్నాడు త్రివిక్రమరావు.

"ఏ...మం...డీ?"

"అవును భాగ్యం... మీరందరూ ఎంతగా వారించినా ముళ్ళదారిలో మూర్ఖంగా నడిచాను. అందుకు ఫలితాన్ని అనుభవిస్తున్నాను భాగ్యం. ఈనాడు కనీసం అప్పు పుట్టించుకోలేని స్థితిలో ఉన్నాను. నన్నో వ్యసనపరుడని, జూదగాడనీ నలుగురూ వ్యంగ్యంగా నవ్వుతూంటే చాతకానివాడిలా తలొంచుకున్నాను. మట్కాకు, లాటరీలకు, తాగుడుకు నేను ఖర్చుపెట్టిందాంట్లో సగం వెనకేసుకున్నా ఈనాడు వనిత పెళ్ళి మనకో సమస్య అయ్యుండేది కాదు" అంటూ ఆమె చేతుల్లో మొహాన్ని కప్పుకుని భోరున విలపించాడు.

కదిలిపోయింది భాగ్యం, భర్తనలాంటి స్థి




తిలో చూసిఎవరు మాత్రం సహించగలరు?

"చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకుని ఏం ప్రయోజనం- బాధపడకండి" అతని తలను హృదయానికత్తుకుంటూ ఓదార్చింది భాగ్యం.

"బాధపడకుండా ఎలా ఉండగలను భాగ్యం. స్నేహితులనుకున్నవాళ్ళే వ్యసనపరుడినని వెక్కిరిస్తుంటే ఎలా సహించాలి?"

మౌనంగా చూస్తూండిపోయింది భాగ్యం.

"వనిత పెళ్ళి ఓ సమస్యైపోయింది భాగ్యం. ఆదుకుంటారనుకున్నోళ్ళు వెక్కిరించి తప్పుకున్నారు. ఎటూపాలుపోవటం లేదు" మనసులోని బాధను భార్యతో చెప్పుకున్నాడు.

"ఎందుకండీ మీరింత బాధపడతారు. నా బంగారం అమ్మితే వనితకు బంగారం, స్కూటరొస్తుంది. ఇక కట్నమంటారా, మనకు రత్నాల్లాంటి ముగ్గురు పిల్లలున్నారండీ, తలా కాస్త పంచుకోకపోరు. వనిత మీకు కూతురే కాదు. వాళ్ళకి చెల్లెలు కూడా. వాళ్ళకీ బాధ్యతుంది. మీ బాధ్యతను వాళ్ళకు పంచి నిశ్చింతగా ఉండండి" అనునయంగా చెప్పింది భాగ్యం.

నిశ్చింతగా నిట్టూర్చాడు త్రివిక్రమరావు.

"నిజమే భాగ్యం... ఆ సంగతే మరచాను. రేపే అబ్బాయిల దగ్గరకెళ్తాను" అని నిద్రకు పక్రమించాడు.

అప్పటివరకూ వారి సంభాషణను ఆలకిస్తూన్న వనిత తృప్తిగా నిట్టూర్చింది తండ్రిలో వచ్చిన మార్పుకు.

ఆ మర్నాడే వెంకట్రామయ్య చెవినేసిందీ వార్తను.

"వనితా ఈ కాస్త మార్పే చాలదమ్మా. ఇది కేవలం కదలిక మాత్రమే. వేడిమీదున్నపుడే ఇనుమును వంచాలి. ఇప్పుడే మీ నాన్నను పరిపూర్ణంగా మార్చి మనిషిని చేయాలి" దృఢంగా చెప్పాడు వెంకట్రామయ్య.

తలపంకించింది వనిత.

★ ★ ★

సిటీకి వాయవ్యదిశలో దాదాపు ఇరవైమూడు కిలోమీటర్ల దూరంలో ఉందాపల్లెటూరు. ఆ ఊరికి ఉత్తరం వైపు పొలిమేరల్లో దట్టంగా దడికట్టున్నాయి ఏడు చింతచెట్లు.

ఆ చెట్ల మధ్యలో...

సూర్యకాంతి కూడా చొరబడనటువంటి ఆ ప్రదేశంలో...

సంబరంతో కేరింతలు కొడ్తూ వినోదిస్తున్నారు సుమారు డెబ్బైమంది. పదేళ్ళ పిల్లల దగ్గర్నుంచి ఎనభై యేళ్ళ వృద్ధుల వరకూ అన్ని వయసుల వాళ్ళున్నారక్కడ. కొంత మంది వారుణవాహిని బలంతో గంతులేస్తున్నారు.

ఓ వృత్తాకారపు గీత చుట్టూ నిలబడున్నారంతా. ఆ వృత్తం మధ్యలో ప్రాణాలకు తెగించి పోరాడుతున్నాయి రెండు కోడిపుంజులు. గాయాల్తో, రక్తంతో ఎర్రగా మద్దిపూలలా ఉన్నాయి వాటి శరీరాలు.

కేవలం మానవులకు వినోదాన్ని కలిగించేందుకే తమ జీవితాల్ని బలిపెట్టేందుకు సిద్ధమయ్యాయా అమాయక ప్రాణులు. మనిషిలోని పైశాచిక ప్రవృత్తికి పరాకాష్ఠ ఈ పందాలు. పదులదగ్గర్నుంచి వేలవరకూ జోరుగా సాగుతూందక్కడ పందెం. అక్కడి వ్యక్తుల అదృష్టదురదృష్టాలు ఆ కోడిపుంజుల మీదే ఆధారపడున్నాయి.

ఒకప్పటి వినోదాత్మకాలైన కోడిపందాలు నేడు జూదంగా మారిపోయాయి. గెలిచినవాళ్ళ మొహాలు మతాబుల్లా వెలిగిపోతుంటే ఓడినవాళ్ళ మొహాలు భర్త చనిపోయిన భార్యల మొహాల్లా మాడిపోతున్నాయి.

బిగ్గరగా ఈలవేసి తన ఆనందాన్ని ప్రకటించాడు సత్యం. అతను వేయి రూపాయలు పందెం కాసిన కోడిపుంజు గెలిచింది. కేవలం ఒకే ఒక్క నిముషంలో వేయి రూపాయలను గెలుచుకున్నాడతను.

తనకు వేయి రూపాయల లాభాన్ని కలిగించిన పుంజువైపు సగర్వంగా చూశాడు సత్యం. స్వంతదారుని చేతిలో విలాసంగా ఒదిగిఉందది. దాని శరీరం నిండా గాయాలే. ఈ క్షణమో, మరుక్షణమో అన్నట్లుంది దాని పరిస్థితి. దానికి సమీపంలో వృత్తంలో శవమైపడుంది అప్పటివరకూ ప్రాణాలకు సైతం తెగించి పోరాడిన ప్రత్యర్థి పుంజు.

దీనంగా చూస్తుంది గెలిచిన పుంజు ఓడిన దానివైపు.

భాషరాని దాని కళ్ళల్లో స్పష్టంగా కనిపిస్తోందో భావం.

'నా తప్పు లేదు నేస్తం. మన బతుకులింతే. పరుల కోసం పుడ్తాం, పరుల కోసం బతుకుతాం, ఆ పరుల కోసమే మరణిస్తాం' వీడ్కోలు పలికింది. సరిగ్గా ఓ నిముషం తర్వాత తన నేస్తానికి తోడుగా ప్రయాణమైందది కూడా. బాధగా నాలుగైదుసార్లు మూలిగి తల వాల్చేసింది.

అప్పటివరకూ ఎంతో అపురూపంగా చూసుకుంటూ బ్రహ్మరథం పట్టిన ఓనర్, అది చనిపోయిందని నిర్ధారణ కాగానే సమీపంలోనున్న పొదలోకి విసిరేశాడు. అది రాత్రి అతని భోజనంలోకి విందుగా మారుతుంది.

మరో పందెం కాయటానికి సిద్ధమయ్యాడు సత్యం.

"సత్యం... ఈ రోజు నక్కను తొక్కినట్లున్నావురా. నువ్వేవైపు కాస్తే నేనూ అటే కాస్తాను" అన్నాడు రాజు. అప్పటికతను రెండు వేలకు పైగా పోగొట్టుకున్నాడు.

సగర్వంగా తలెగరేశాడు సత్యం.

మరో పందెం మొదలైంది.

మానవుల అదృష్టాన్ని అంచనా వేసేందుకు మరో రెండు పుంజులు వృత్తంలోకి దిగి మృత్యుపోరాటాన్ని ప్రారంభించాయి.

తమ ప్రాణాలను కాపాడుకునేందుకో, మరి ఓనర్‌కు లాభం కలిగించేందుకో ఆ పోరాటం?!

పిల్లికి చెలగాటం, ఎలుకకి ప్రాణసంకటమంటే ఇదే కాబోలు.

ఉత్సాహంతో గంతులేస్తూ, పెదబొబ్బలు పెడ్తూ తమ తమ పుంజులకు ఉత్సాహాన్నిస్తున్నారు పందెగాళ్ళు.

దైవ ప్రార్థనలు కూడా జోరయ్యాయి.

"రఘురామా, భద్రాద్రివాసా నా కోడినే గెలిపించు తండ్రీ"

"ఏడుకొండలవాడా, వెంకటేశా... ఈ పందెం గెలిస్తే నీ కొండకు నడిచివస్తా" అయిదు వేలకు పందెంగా కాసిన ఒకడి విన్నపం.

"విఘ్నేశ్వరా, వినాయకా... నా కోడి గెలిస్తే నీకు నాలుగు కొబ్బరికాయలు కొడ్తా" ఓ భక్తుడి లంచం.

ఈ పందాల్లో దేవుళ్ళకు కూడా కష్టాలొచ్చినాయి. వాళ్ళ వాళ్ళ భక్తుల మొర తీర్చాలంటే వాళ్ళు ఆ కోళ్ళ రెక్కల్లోనో, కాళ్ళల్లోనో, ముక్కుల్లోనో దూరాలి కాబోలు.

భగవాన్... ఎన్ని కష్టాలయ్యా నీకు?!

పందెం ఆఖరి ఘట్టంలోకి ప్రవేశిస్తున్న తరుణం...

ఇంతలో బర్ర్ మనే శబ్దంతో దూసుకొచ్చిందో పోలీస్ జీప్. అరుపులతో, కేకల్తో ఆఖరి నిముషం వరకూ పోలీసులను కనిపెట్టలేకపోయారు. తోపు వెలువల ఆగింది జీప్. పరుగెత్తుకుంటూ వచ్చారు పోలీసులు.

"పోలీసులు... పోలీసులు" ఒక్కసారిగా కేకలతో మారుమోగిందా ప్రదేశం. కేకల్తోపాటు రణగొణధ్వని, తొక్కిసలాట...

లాఠీలతో దాడిచేశారు పోలీసులు. వాళ్లకి తెలుసు. ఆ ప్రదేశంలో మూడు రోజులపాటు కోడిపందాలు జరుగుతుంటాయని. కానీ వాటి నరికట్టడానికి ప్రయత్నించరు. ఖర్చులకు, విలాసాలకు డబ్బు అవసరమైనప్పుడు మాత్రం తెలుగు సినిమాల్లోని క్లైమాక్స్‌లోలా... పిలువని పేరంటాళ్ళలా దాడి చేస్తుంటారు.

పోలీసుల చేతుల్లో చిక్కితే ఏం జరుగుతుందో అక్కడున్నవాళ్ళందరికీ తెలుసు. ఒళ్ళు హూనమవుతుంది. జేబు ఖాళీ అవుతుంది. అంతే... అంతకు మించేం జరగదు.

ఓ పొదమీంచి జంప్‌చేసి పరుగందుకున్నాడు సత్యం. ఇలాంటి సన్నివేశాలు ఎదురైనప్పుడు ఏం చేయాలో అతనికి అలవాటే. క్షణాల్లో అక్కడి గుంపు చెల్లాచెదురైంది. క్విక్‌గా అలర్ట్ కాలేని కొందరు మందమతులు మాత్రం బాబాయ్‌లచేతుల్లో చిక్కారు. తృణమో ఫణమో ముట్టచెప్పి బిక్కమొహాల్తో బయటపడ్డారు.

రాకెట్‌లా దూసుకుపోతున్నాడు సత్యం. లాఠీలను ఝులిపిస్తూ అతని వెంట పడ్డారు




ఇద్దరు పోలీసులు. పరుగెత్తుతూనే ఆలోచిస్తు న్నాడు సత్యం. ఎప్పుడో పదిహేను సంవత్స రాల క్రితమే చనిపోయిన బామ్మకు సీరి యస్‌గా ఉందని జాలిగొలిపేలా విన్నవించు కుని మేనేజర్ దగ్గర పర్మిషన్ తీసుకుని కోడి పందాలకొచ్చాడతను. గంట కాదుగదా నిముషం కూడా పర్మిషనివ్వని కర్కోటకుడు అతని మేనేజర్.

'ఇప్పుడు పోలీసులకు పట్టుబడితే ఆ విషయం బాస్‌కు తెలిస్తే....' ఆ తర్వాత ఏం జరుగుతుందో ఊహించేందుకు మనస్కరించ లేదతనికి.

చేతిలోనున్న లాఠీ కర్రను గిరగిరా తిప్పి బలంగా ముందుకిసిరాడో పోలీస్ పరుగెత్తు తూనే. రివ్వున దూసుకొచ్చి సత్యం పిక్కకు బలంగా తగిలిందది. తూలి ముందుకు పడ్డా డు సత్యం.

మరుక్షణం అతన్ని చుట్టుముట్టారు పోలీ సులు.

"ఏరా బాడ్కోవ్... మానుంచే పారిపోవాలని చూస్తావ్?" వికృతంగా గర్జిస్తూ సత్యం కాలర్ పట్టుకుని పైకి లేపాడో పోలీస్.

గజగజా వణికిపోయాడు సత్యం. ఆ కంఠ స్వరం విని.

సత్యం మనస్థయిర్యాన్ని కళ్ళతోనే అంచనా వేసుకున్నారు పోలీసులు. గిట్టుబాటయ్యే కేసే నని నిశ్చయించుకున్నారు.

తనను వదిలిపెట్టమని చేతులు జోడించి ప్రాధేయపడ్డాడు సత్యం.

నిజాయితీ తమ ఊపిరని, ప్రపంచంలో తామిద్దరే చట్టాన్ని నిజాయితీగా కాపాడుతున్న నీతిపరులమని గర్జించారా పోలీసులు ఇద్ద రూ.

చిగురుటాకులా వణికిపోయాడు సత్యం. ఎండుటాకులా వాలి వాళ్ళ కాళ్ళమీద పడ్డాడు. వాళ్ళ చూపులెక్కడ తారట్లాడుతున్నాయో గ్ర హించాడు. ఓ అయిదొందలు సమర్పించు కుని నమస్కారం పెట్టింతర్వాత అతడిని వదిలిపెట్టారు పోలీసులు. వదిలిపెట్టిందే చాలనుకుని పరుగందుకున్నాడు సత్యం.

ఆరోజు అదృష్టదేవత కరుణించింది పోలీ సులను. ఎస్సై వాటాపోను తలా రెండొందలొ చ్చాయి.



మాంచి పరువంలోనున్న కోడిపుంజుతో ఇంట్లోకి అడుగుపెట్టాడు సత్యం. ఎరుపు... నలుపు... తెలుపు రంగుల ఈకల్తో బలంగా మిసమిసలా డుతోందది. ఆశ్చర్యంతో దానివైపు చూస్తూ నిలబడ్డారు ముప్పైఏళ్ళ పంకజం... ఏడేళ్ళ నానిగాడు.

"కొక్... కొక్కొరకో... క్కో..." ఉత్సాహంగా అరిచిందది వార్నిచూసి.

"ఏమిటండీ... ఏమిటిది?" అడిగింది పంకజం.

"పుంజు... కోడిపుంజు... నెమలి... డేగ అంశ లు కలిసిన అద్భుతమైన పుంజు. దీని రే టెంతో తెలుసా..., రెండొందలాయాభై" గర్వంగా దాని ఈకలు నిమురుతూ చెప్పాడు సత్యం.

"కోసుకుంటే ఒక్కరోజుక్కూడా సరిపోయే ట్లు లేదు. ఇది రెండొందలాయాభయ్యా?" అర్థంగాక అడిగింది పంకజం.

"ఇది కోసుకోవటానిక్కాదే పిచ్చిమొద్దూ... పందెపు పుంజు-" అంటూ హాలు మధ్యలో దాన్ని విడిచాడు.

నేలనానుతూనే రివ్వున ఎగురుతూ వెళ్ళి ఎదురుగా నున్న టేబుల్‌పై వాలిందది. నరదా పడి దాని దగ్గరకు పరుగెత్తాడు నానిగాడు. వాణ్ణి చూసి బెదిరి కిందకు జంప్ చేసిందది. ఆ హడావుడిలో అడ్డొచ్చిన ఫ్లవర్‌వాజ్‌ను కిందకు తోసేసింది. నేలపై పడి నూటపదహా

రు ముక్కలైంది- ఎగ్జిబిషన్‌లో పంకజం ఎంతో మోజుపడి కొన్నా గాజు ఫ్లవర్‌వాజ్...

"రేయ్... ఇడియట్" అంటూ వాడినో కసురు కసిరి కోడిపుంజును పట్టుకుని ఓ స్తంభానికి కట్టేశాడు సత్యం.

"కోక్... క్కొక... కొక్కొరొక్కో... క్కో..." అంటూ వికృతంగా అరవటం మొదలుపెట్టిందది.

"ఏమిటండీ... ఈ తలనొప్పి?" అసహనంగా చూసింది పంకజం గాజుపెంకులనేరుతూ.

ఆ మాటలు వినిపించనట్లు నటిస్తూ జేబులోంచి ఏవో పాకెట్లు తీసి... దానికి తినిపించాడు.

"అమ్మో... నాన్నను ఎర్రగడ్డలోనో, విశాఖపట్నంలోనో చేర్పించాల్సి వస్తుందేమోనే?" వింతగా చూశాడు నానిగాడు. పిచ్చి పిచ్చిగా ప్రవర్తించే వాళ్ళను అటువంటి హాస్పిటల్స్‌లో చేర్పించటాన్ని ఇటీవలే ఓ తెలుగు సినిమాలో చూశాడు వాడు.

పదిహేను నిముషాల్లో ఆ స్తంభానికి గజంన్నర వ్యాసార్థపు చుట్టుకొలత గల వృత్తాకారపు ప్రదేశాన్ని ఛండాలం చేసేసిందా పుంజు. అసహ్యంగా చూసింది పంకజం దానివైపు.

"ఏమిటండీ పిచ్చి?" కోపంగా అందామె.

"ఇది పిచ్చికాదోయ్... సరదా... సంతోషం"

"ఇది సరదానా... కోళ్ళను, కుక్కలనూ పెంచటం సంతోషమా... గట్టిగా అనకండి... ఎవరైనా వింటే నవ్వుతారు" ఎగతాళిగా అంది పంకజం.

"మా కులదైవం ఎవరో తెలుసా?" సీరియస్‌గా అడిగాడు సత్యం.

"తెలుసు"

"ఎవరు?"

"చెన్నకేశవస్వామి"

"ఆయన ప్రియభక్తుడెవరో చెప్పు?"

"బ్రహ్మనాయుడు"

"ఇప్పుడు... ఇప్పుడు నువ్వు కూడా నా పాయింట్లోకొచ్చావే శ్రీమతీ... మా కులదైవానికత్యంత ఇష్టుడైన భక్తునికత్యంత వినోదప్రాయమైన గేమే ఇది... మరి నాక్కూడా ఇష్టం కావాలిగా... నన్ను తప్పు పడతావేమే పక్షీ... నిరక్షర కుక్షీ...?"

ఆ కోడి పందాల వలననే ఆయన వనవాసాల పాలయ్యాడనే విషయం అప్పట్లో గుర్తు రాలేదు సత్యానికి.

'నూటికి నూరు మార్కులు తెచ్చుకున్న విద్యార్థిని ఆదర్శంగా తీసుకొమ్మని సలహా ఇస్తే... 'జీరో మార్కులు తెచ్చుకున్న విద్యార్థిని ఆదర్శంగా తీసుకున్న విద్యార్థివైపు చూసే మాస్టారిలా... సత్యంవైపు చూస్తూ బాధగా నిట్టూర్చింది పంకజం.

ఎంతో కష్టపడి తొంభైతొమ్మిది శాతం మంచిని... తప్పనిసరై ఒక్కశాతం మాత్రం చెడును చిత్రీకరించిన సినిమాలో... కేవలం ఆ చెడును మాత్రమే ఇష్టపడే నగటు ప్రేక్షకుడికి ప్రతినిధిలాంటివాడు సత్యం. సమానత్వం... ధర్మం... న్యాయంలాంటి బ్రహ్మనాయుడి ఆదర్శాలు అతనికిష్టం కాలేదు. పొరపాటునో... గ్రహపాటునో అతనాడిన కోడిపందమే అతనికాదర్శమైంది.

పుంజుకు తినిపించటం పూర్తిచేసి మంచి నీళ్ళు త్రాపించి లేచి నిల్చున్నాడు సత్యం...

అప్పుడు వినిపించిందా కలకలం.

సత్యం ఇంటికి రెండిళ్ళవతలనుంచి వినిపిస్తున్నాయి పెద్దగా అరుపులూ... కేకలూ...

ఆదరాబాదరాగా బయటకు పరుగెత్తారు సత్యం, పంకజంలు.

రెండిళ్ళవతలున్న రజాక్ ఇంట్లో కనిపించిందో పెద్ద గుంపు. నేలపై అచేతనంగా పడుకొనుంది సలీమా. ఆమె కళ్ళల్లోంచి ధారాపాతంగా స్రవిస్తున్నాయి కన్నీళ్ళు. ఓ మూల తలొంచుకుని దుఃఖిస్తున్నాడు రజాక్. సలీమా చుట్టూ గుమిగూడున్నారు ఆ ప్రాంతపు స్త్రీలు, పురుషులు... పిల్లలూ. సలీమా ముందు కూర్చుని భోరుభోరున ఏడుస్తున్నారు ఇద్దరు పిల్లలు.

ఏవో గుసగుసలు వినిపిస్తున్నాయి. అప్పుడే ఆడాళ్ళలో కలిసిపోయింది పంకజం. పరిస్థితి అర్థంగాక కొంచెం ముందుకు జరిగాడు సత్యం. షాక్ తగిలినట్లనిపించిందతనికి. సలీమా తలపైనున్న సీలింగ్ ఫాన్‌కు వేలాడు




తూ కనిపించింది ఉరితాడు... విషయం అర్థ మవుతున్నట్లనిపించిందతనికి.

"ఏం జరిగిందండీ?" పక్కనున్న యువతి నడిగింది పంకజం.

"సలీమా ఉరేసుకోవాలని ప్రయత్నించింది. పిల్లలు గోలగోలగా అరుస్తూంటే సమయానికి రామేశ్వరం మాస్టారొచ్చి తప్పించారు"

అవాక్కైంది పంకజం... నిశ్శబ్దంగా ముందుకు జరిగింది.

అప్పటికి కళ్ళు తెరిచింది సలీమా.

"సలీమా... ఏమైందమ్మా... ఎందుకు చేశావీ ఘోరం?" సలీమా తలను ఒళ్ళో పెట్టుకుని అనునయంగా అడిగింది పంకజం.

వరద గోదారే అయింది సలీమా వెక్కి వెక్కి ఏడవసాగింది. అంతా నిశ్శబ్దం. వెక్కుతున్న ఆమెవైపు జాలిగా చూస్తున్నారంతా. అది మరింత బాధ కలిగిస్తూంది సలీమాకు.

అందరివైపు చూసి కనుసైగ చేసింది పంకజం. ఒకరొకరుగా నాలుగైదు నిముషాల్లో నిష్క్రమించారంతా. పంకజం... సత్యం... రజాక్... పిల్లలు మాత్రం మిగిలారు.

అయిదు నిమిషాల తర్వాత కళ్ళు తుడుచుకుంటూ లేచి కూర్చుంది సలీమా.

"సలీమా... ఏం జరిగిందమ్మా... ఎందుకింత అఘాయిత్యానికి తలపడ్డావ్?" బాధగా చూస్తూ అడిగింది పంకజం.

"ఏం చెయ్యమంటావక్కా. వీళ్ళ బాధ చూసి జీవితం మీదే విరక్తి పుట్టింది..." నిట్టూర్చింది సలీమా... ఏడుస్తూన్న పిల్లలవైపు చూస్తూ.

"బాధ...?"

"అవునక్కా... వీళ్ళు కడుపునిండా అన్నం తిని మూడు రోజులపైనే అయిందని నీకెలా చెప్పనక్కా?" ఏడుస్తూ మొహాన్ని చేతుల్లో దాచుకుంది సలీమా.

నివ్వెర పోయింది పంకజం ఆ మాటలు విని.

నేతి వ్యాపారం చేసి రజాక్ లక్షలు సంపాదించాడని జనవాక్యం. అందులో వాస్తవం కూడా లేకపోలేదు.

దృష్టి మరల్చి ఆ ఇంటిని పరిశీలనగా చూసింది పంకజం.

చెప్పుకోదగ్గ విలువున్న సామానేది కనిపించటం లేదాఇంట్లో. ఉలిక్కిపడింది పంకజం... పదీ... పదిహేను రోజుల క్రితం... ఆ ఇంట్లో కనిపించిన విలువైన సామాను ప్రస్తుతం లేదు.

"నిజమేనక్కా... వ్యాపారంలో వేలూ... లక్షలు సంపాదించాడాయన... ప్చ్... ఏం లాభం... రేసులు... తాగుడు... పేకాట... మట్కా... ఒకటేమిటి... ప్రపంచంలో ఎన్ని రకాల అలవాట్లున్నాయో అన్నీ ఉన్నాయాయనికి. సంపాదనంతా వాటిల్లోనే తగలెట్టేశాడు. వ్యాపారం మానేశాడు. ప్రస్తుతం పూట గడవటమే కష్టంగా ఉంది. పిల్లల ఆకలి బాధ చూస్తుంటే జీవితం మీదే విరక్తి పుడుతుందక్కా..." బాధగా చెప్పింది సలీమా.

"మేడిపండు చూడ మేలిమైయుండు... పొట్టవిచ్చి చూడ పురుగులుండు..." ఎప్పుడో చిన్నప్పుడు చదివిన పద్యం మనసులో మెదిలింది పంకజానికి.

ఏదో అర్జంట్ పని గుర్తొచ్చిన వాళ్ళా గబగబా బయటకెళ్ళిపోయాడు సత్యం.

సలీమాను ఓదార్చి... పిల్లల్ని తన వెంట తీసుకెళ్ళింది పంకజం...

★ ★ ★

ఆదివారం

జీతాలొచ్చిన మరునటి రోజు

జేబులో ఫెళఫెళ్ళాడే నోట్లతో... చేతిలో మిన మినలాడే పుంజుతో ఆ రోజు ఉదయాన్నే బయలుదేరాడు సత్యం. కిరాణాకొట్టు బాకీ తలపునకు రాలేదా సమయంలో... పాలబాకీ అసలే గురతు రాలేదు... ఇంకా బట్టలకొట్లో ఇవ్వాల్సిన బాకీ... చేబదుళ్ళు బాకీలు... ఏ బాకీలు తీర్చలేదు. మొత్తం జీతమంతా జేబులోనే ఉంది.

దార్లో చిలకజోస్యుడి ముందు కూర్చున్నాడు అయిదు నిముషాల సేపు..

అతన్ని.. చేతిలోని పుంజును గమనించి.. అతని మనఃస్థితిని, పరిస్థితినీ ఇట్టే గ్ర




హించాడా చిలకజోస్యుడు.

అయిదు నిముషాలపాటు అతని భవిష్యత్ గూర్చి అనర్గళంగా ఉపన్యసించాడు.. రాజ యోగం ముందుందన్నాడు.. పట్టిందల్లా బంగారమేనన్నాడు. అలాంటి యోగం.. కోటికొక్కడికి మాత్రమే ఉంటుందన్నాడు..

ఉబ్బిపోయాడు సత్యం.. ఓ అయిదు రూపాయలు అతనికి సమర్పించి.. ఆ మాటల్నే తలుచుకుంటూ ముందుకు సాగాడు.. ఆ ఉత్సాహంలో ఎదురైన అపశకునాల్ని గమనించలేదతను.. ఓ శవం ఎదురైంది. మరో చోట కట్టెలబండి- పిల్లి ఎదురయ్యాయి..

ఆ సరికే ఆ ప్రదేశమంతా కోడిపందెగాళ్ళతో తిరునాళ్ళలా ఉంది. రెండు పందాలుకూడా అయిపోయుండటం గమనించి.. తనాలశ్యమైనందుకు నొచ్చుకున్నాడు సత్యం.

పలకరింపులూ.. పరామర్శలూ అయింతర్వాత.. పందెంలోకి దిగాడు.. తన కోడిని పందెంలోకి విడిచాడు.. ఓ అయిదు నిముషాలపాటు వీరోచితంగాపోరాడిన సత్యంగారి పుంజు.. ఆరో నిముషంలో కాళ్ళు పైకెత్తింది.. ప్రత్యర్థి పుంజుదాడిని ఎదుర్కోలేక తలవాల్చేసింది.

ఖంగు తిన్నాడు సత్యం.. అపురూపంగా చూశాడు దాన్ని ఈ పక్షంరోజులపాటు.. కొన్న ఖరీదు గాక.. మరో రెండొందలపైనే తిండి ఖర్చుపెట్టాడు.. అయినా ఫలితంలేదు..

ఆరోజు అతన్ని అదృష్టదేవత చిన్నచూపు చూసింది. ప్రథమంలో వందా.., రెండొందల స్వల్ప విజయాలు చవిచూసినా.. వేలల్లో మాత్రం అపజయమే ఎదురైంది. చివరకు జేబు ఖాళీ అయింది.. బస్‌ఖర్చులకు చిల్లర డబ్బులు మాత్రం మిగిలాయి.

అప్పుడు గుర్తొచ్చాయతనికి తను తీర్చవలసిన బాకీలు.. గవర్నమెంట్ ఉద్యోగి తను.. నెలంతా చేసిన బాకీలను జీతమొచ్చింతర్వాత తీర్చటం అలవాటు.. రెండు మూడుసార్లు గతంలో బాకీలను అలక్ష్యం చేసి కొంత అప్పును వెనకేశాడు.. ఇప్పుడు ఈనెల్లో చెల్లించాల్సిన బాకీలన్నీ అలానే ఉన్నాయి...





నెలరోజులు కష్టపడి సంపాదించిన జీతమంతా ఓ గంటలోనే హారతి కర్పూరంలా కరిగిపోయింది.

సురేష్ కలిశాడతన్ని.

"ఏం గూరూ.. ఈరోజెంత ఆదాయం?"

"నిల్.. జేబు ఖాళీ.." గాలిపోయిన టైరులా నీర్సంగాచెప్పాడు సత్యం...

"నాకు మాత్రం సరికి సరి.. లాభంలేదు.. నష్టంలేదు.." సగర్వంగా చెప్పాడు సురేష్.

"అదృష్టవంతుడివి-" నిర్లిప్తతగా నవ్వాడు సత్యం.

ఇద్దరు స్నేహితుల్తో వచ్చాడు సురేష్.. పై పందెంగా ఓ యాభైకాశాడు ముందు.. యాభై లభించింది. ఆ ఉత్సాహంలో ఫ్రెండ్సిద్దరికీ స్వీట్.. కూల్ డ్రింక్స్.. ఇప్పించి ఓ పదిహేను ఖర్చుచేశాడు. రెండో పందెంలో మరో యాభై లభించింది. రెట్టించిన ఉత్సాహంతో ఈసారి మరో ఇరవై ఖర్చుపెట్టాడు స్నేహితులకు.. ముచ్చటగా మూడోసారి కాసిన పందెంలో 'వంద' పోగొట్టుకున్నాడు..

'సరికి సరి'.. అనుకున్నాడు సురేష్.. కానీ అతని జేబులో మాత్రం అసలుకు ఫ్రెండ్స్‌కు ఖర్చుపెట్టిన ముప్పై అయిదు రూపాయలు తక్కువయ్యాయి.. అది నష్టమో.. లాభమో.. ఆ భగవంతునికే తెలియాలి..!'

కాళ్ళీడ్చుకుంటూ సత్యం ఇంటికొచ్చేసరికి అతనికోసం ఎదురుచూస్తున్నారు. ఇంటి ఓనర్ అవధాని.., పాల. సీత..

దారిలో ఎవరో పర్సు కొట్టేశారని.. వచ్చేనెల్లో వాళ్ళబాకీ తీరుస్తానని. కట్టుకథలు చెప్పి.. వార్ని సాగనంపేసరికి తలప్రాణం తోకకొచ్చింది సత్యానికి.

"నిజమేనా?.." తీక్షణంగా చూస్తూ అడిగింది పంకజం.

"ఏ..మి..టి..?"

"మీరు చెప్పిన కాకమ్మకథలు.."

"నిజమేనే.. నీమీదొట్టు.. బస్‌లో వస్తుంటే ఎవడో పర్స్ కొట్టేశాడు.. దొంగ లం.. కొడుకు.. వాడికి నాజేబే కనపడింది కాబోలు.." తెలీని.. లేని జేబుదొంగను కసితీరా తిట్టాడు సత్యం.

"ఆపండి.. నాకు తెలీవనుకున్నారా మీ దొంగనాటకాలు.. కోడి పందాలకెళ్ళి.. జేబు

ఖాళీ చేసుకొచ్చి నాటకాలాడుతున్నారా?.'' విరుచుకపడింది పంకజం.

''అమ్మతోడే.. ప్రమాణంగా చెపుతున్నాను.. ఇవాళ కోడిపందాలకెళ్ళలేదు..'' అమాయకంగా మొహంపెట్టాడు సత్యం.

''ఆపండి మీ వెధవ్వేషాలు.. మధ్యలో మీ అమ్మనెందుకు సాక్ష్యం తెస్తారు.. మీరు పందాలకెళ్ళకుంటే ఇంటల్లుడిలా మీరు మేపుతున్న మీ దరిద్రపు కోడిపుంజేమైంది..?''

గతుక్కుమన్నాడు సత్యం. తేలుకుట్టిన దొంగలా అయిందతని పరిస్థితి బిత్తరచూపులు చూశాడు.

''ఖర్మ.. నా ఖర్మండీ ఇదంతా.. బయట పల్లకీల మోత.. ఇంట్లో ఈగలమోత అని.. నెలజీతం మీద బతికే మనకెందుకండీ ఈ కోడిపందాలు.. జీతమంతా తగలబెట్టారు.. ఈనెలంతా ఎలా గడవాలి?..'' విరుచుకుపడింది పంకజం.

అరికాలిమంట నెత్తికెక్కింది సత్యానికి. అసలే జేబు ఖాళీ అయిన చింతలో ఉన్న అతనికి పెళ్ళాం హితబోధ పౌరుషాన్ని పెంచింది.

''నోర్ముయ్.. నా యిష్టమొచ్చినట్లు చేసుకుంటా.. నా జీతం. నాయిష్టం నీకెందుకే... నోర్మూసుకుని పడుండు..'' కోపంగా అని చరాలున బయటికి నడిచి హాల్లో కూర్చున్నాడు సత్యం. విసుగ్గా ఉందతనికి.. బాధగానూ ఉంది.. ఈనెలంతా ఎలా గడవాలో.. కిరాణకొట్టువాడికి ఏం చెప్పాలో అర్థంకాలేదు.

''అవును.. మీ జీతం. మీ యిష్టం.. మధ్యలో నాకెందుకు.. మీరు తెచ్చిపడేస్తే వండి పెట్టేదాన్నేగా.. సరుకులన్నీ నిండుకున్నాయి.. షాపుకెళ్ళి తీసుకరండి..'' గొణుగుతూ లోపలి గదిలోంచే సంచులను సత్యంముందు పడేట్లు విసిరేసింది పంకజం.. ఆమె కిదేం కొత్తగాదు.. దాదాపు అయిదేళ్ళుగా.. అప్పుడప్పుడు ఇలాంటి సన్నివేశాలు ఆమె జీవితంలో ఎదురవుతూనే ఉన్నాయి..

సత్యానిక్కూడా కోడిపందాలు మినహాయించి మరే చెడుఅలవాట్లూలేవని చెప్పొచ్చు. సరదాగా మొదలైన ఆ అలవాటు ఇప్పుడు జీతంలో ఓ భాగమైంది. అతనికీ తెలుసు. ఆ అలవాటే తనను ఇక్కట్లపాలు చేస్తూందని.. అయినా మరచిపోలేకపోవటమే అతని బలహీనత..

కిరాణాకొట్టుముందు నిల్చున్నాడు సత్యం. అతన్ని చూస్తూనే ఖాతాపుస్తకం తెరిచాడు షావుకారు..

అతనికీ ఏవో కాకమ్మ కథలు చెప్పి.. వచ్చే నెల్లో మొత్తం బాకీని చెల్లిస్తానని నమ్మించి ఇంటికి సరుకులు తీసుకెళ్ళేసరికి.. ఈ ప్రపంచంమీదే విసుక్కలిగింది సత్యానికి.

జీవితంలో ఇంకెప్పుడూ కోడిపందాలకు వెళ్ళగూడదని నిశ్చయించుకున్నాడు సత్యం. గతంలో అలాంటి శపథాలు చాలా చేశానన్న విషయాన్ని విస్మరించాడాక్షణం..

జూదగాళ్ళ మరో లక్షణం.. జేబులో డబ్బులేనప్పుడు జూదాన్ని మానివేయాలని శపథాలు చేయటం.. తిరిగి డబ్బు చేతిలో పడగానే నిశ్చయాలకు నీళ్ళొదలటం..

★ ★ ★

''నాన్నా..'' పిలిచాడు నానిగాడు ఆఫీసుకు రడీ అవుతున్న సత్యాన్ని

''ఏమిట్రా..?!''

''స్కూలు ఫీజు?!''

''ఇప్పుడేం ఫీజు. తర్వాత చూద్దాంలే'' విసుగ్గా కసురుకున్నాడు.

''రేపే ఆఖరిరోజు. లేకుంటే పేరు తీసేస్తారు'' మారాం చేశాడు నాని. ఇంగ్లీషు మీడియం కాన్వెంట్‌లో చదువుతున్నాడు వాడు. నాలుగు నెలలకోసారి మూడువందలు ఫీజు కట్టాలి.

''నా దగ్గరిప్పుడు లేవు.''

''నువ్వేగా జీతాలొచ్చింతర్వాతిస్తానన్నావ్. జీతాలొచ్చాయిగా ఇవ్వు'' అంటూ కాళ్ళకడ్డంపోయాడు.

''ఒరేయ్... నా దగ్గరిప్పుడు లేవని నీగ్గాదు చెప్పేది వెధవ... దూరంగా పో'' కోపంగా అన్నాడు సత్యం. 'వేలెడు లేడు వెధవ... ఆరాలన్నీ వీడికే కావాలి' అనుకుంటూ.

''అందరూ కట్టేశారు. నేనొక్కడ్నే కట్టాలి. రోజూ క్లాసులో నా పేరు చదువుతుంటే షేమ్‌గా

ఉంది'' ఏడుస్తూ చెప్పాడు వాడు.

''నోర్మూసుకో గాడిదా... ఇప్పుడేమైందని ఆ ఏడుపు...'' కోపంగా వాడ్నో రెండు తగిలించి గబగబా వెళ్ళిపోయాడు సత్యం.

లోపల్నుంచి చూస్తూనే ఉంది పంకజం. ఏడుస్తూన్న నానిగాడ్ని చూస్తుంటే ఆమె హృదయం తరుక్కుపోయింది.

'ఏమిటి వాడు చేసిన నేరం?'-

'ఓ వ్యసనపరుడి ఇంట పుట్టడమేనా?'

నెలకు పదిహేనువందలు పైనే సంపాదిస్తున్న ఉద్యోగి వాడి తండ్రి... కానీ ఏం లాభం... ఒక్కగానొక్క కొడుకు ముద్దుముచ్చట్లు తీర్చలేని అసమర్థుడు.వాడేం... మణులడిగాడా... మాన్యాలడిగాడా... కేవలం స్కూలు ఫీజు మాత్రం అడిగాడు... అందరి పిల్లలూ ఖరీదైన యూనిఫాంలతో వెళ్తుంటే తమ కడుపున పుట్టిన పాపానికి నానిగాడికి మాత్రం నాసిరకపు బట్టలు.

సత్యం కొలీగ్ వాసుదేవరావు పిల్లలు గుర్తొచ్చారు.

ముగ్గురు పిల్లలతనికి... పద్ధతిగా ఖర్చుపెడుతుంటాడు కాబట్టి పిల్లలెప్పుడూ చిరునవ్వుల్తో కళకళలాడుతూంటారు... కాన్వెంట్ చదువులు. ఖరీదైన యూనిఫాంలు.

వాసుదేవరావుతో భర్తను పోల్చుకుంది పంకజం.

వాసుదేవరావు కున్నన్ని బాధ్యతలు తమకు లేవు. ఎక్కడో పల్లెటూరులోనున్న తల్లికి ప్రతినెలా వందరూపాయలు పంపుతుంటాడు వాసుదేవరావు. తమకా ఖర్చు లేదు... అతనికి ముగ్గురు పిల్లలు... తమకు ఒక్కడే. అయినా వారింట్లో కలిమి... తమింట్లో లేమి...

దీనికంతటికీ మూలకారణమైన కోడిపందాలను కసితీరా తిట్టుకుంటూ నానిగాడ్ని సముదాయించి కాన్వెంట్‌కి పంపించి భారంగా నిట్టూర్చింది.

★ ★ ★

ఆఫీసులో ఫైళ్ళు తిరగేస్తున్న సత్యం కళ్ళకు ప్రతి పేజీలోనూ నానిగాడే కనిపించాడు...

వారం రోజుల్నుంచీ చెప్తూనే ఉన్నాడు వాడు... జీతాలొచ్చింతర్వాత ఇస్తానని సముదాయిస్తూ వచ్చాడు... ప్చ్... వాడికిచ్చింతర్వాతే పందాల కెళ్ళాల్సింది... ఇప్పుడాలోచించి ఏం ప్రయోజనం... చేతులు కాలిం తర్వాత ఆకులు పట్టుకుని ఏం లాభం.

ఎవర్నైనా బదులడగాలని ఆఫీస్‌లో కలియచూశాడు సత్యం... ఎవరైనా వింటే నవ్వుతారు. జీతాలొచ్చి నిండా మూడ్రోజులు గడవలేదు... అప్పుడే అప్పడుగుతూంటే ఎవరైనా నవ్వుతారు మరి... చివరికే మార్గం తోచక కొలీగ్ కరుణాకరాన్ని అప్పడిగాడు సత్యం.

కాలేజీలో చదివే రోజుల్లో నాటకాల్లో మాంచి అనుభవాన్ని సంపాదించాడు సత్యం. ఆ అనుభవం ఇప్పుడు అప్పు పుట్టించుకొనేందుకు తోడ్పడింది.

పది నిముషాలపాటు 'ప్రశ్నలూ- జవాబులూ' కార్యక్రమం ముగిసిం తర్వాత అనుమానంగా చూస్తూనే మూడొందలు అప్పిచ్చాడు కరుణాకరం.

నీర్సంగా నిట్టూర్చాడు సత్యం. ఓ గండం గడిచింది. నానిగాడి ఫీజు కట్టేస్తే... ఆ తర్వాత ఎలాగోలా ఈనెల గడిపేయచ్చు...

అయితే, గోదావర్లో ఉతికినా- గంగలో ఉతికినా నల్లకుక్క నల్లకుక్కే అన్నట్లు... ఎంత సవరదీసినా కుక్కతోక వంకరేననేది ఆ సాయంత్రం సత్యం విషయంలో మరోమారు ఋజువైంది.

ఆ సాయంత్రం మూడుగంటలకు.

''ఏం గురూ... రావట్లేదా...?'' అంటూ వచ్చాడు కొలీగ్ రాజు. మానేజర్ లీవ్‌లో ఉన్నాడు... అసిస్టెంట్ మానేజర్ దగ్గర పర్మిషన్ సంపాదించడం పెద్ద పనేం కాదు.

''ప్చ్... రావట్లేదు...'' నీర్సంగా అన్నాడు సత్యం.

''ఏం గురువా... చాలా నీర్సంగా కనిపిస్తున్నావ్... ఏంటి సంగతి?''

''ఏం లేదు... రాకూడదనుకుంటున్నానంతే...''

''సరే... నీ యిష్టం...'' అని ముందుక్కదిలాడు రాజు...

అనీజీగా కుర్చీలో కదిలాడు సత్యం...





ఏదోలా ఉందతనికి. ఎందుకో ఆ సమయంలో... చిలకజోస్యుడు చెప్పిన మాటలు గుర్తొచ్చాయి. 'రాజయోగం ముందుంది... పట్టిందల్లా బంగారమే... కోటికొక్కడికి మాత్రమే పట్టే యోగం.'

'ఏమో... తనకు నిజంగానే రాజయోగం పట్టనున్నదేమో?!'

ఎందుకు కాకూడదు-

సుయోధనుడు మాత్రం జూదంలో ముందు ఓడిపోయి ఆ తర్వాత విజయం సాధించలేదా... నాయకురాలు నాగమ్మ... ఆఖరి క్షణంలో విజయాన్ని పొందలేదా- తనదృష్టం ఎలా ఉందో?...

ఊగిసలాడుతూందతని మనసు.

నిన్న అపజయం పొందినంత మాత్రాన ఈ రోజు కూడా అలానే ఉంటుందా? గతంలో ఎన్నిసార్లు ఓడి గెలవలేదు.

కుర్చీలోంచి లేచాడు.

గెలవాలి...

కిరాణాకొట్టతను గుర్తొచ్చాడు... వాడి బాకీ వాడి మొహాన కొట్టాలి... నానిగాడి ఫీజు కట్టాలి. రెంట్... పాలబాకీ చెల్లించాలి.

"రాజూ... ఆగు... వస్తున్నా..." రాజుతో కలిశాడు సత్యం.

ఆ క్షణం వరకూ చేసుకున్న బాసలను... తీసుకున్న నిర్ణయాలను హుస్సేన్‌సాగర్‌లో పాతిపెట్టి కదిలాడు సత్యం... పందెం జరుగుతున్న ప్రదేశాన్ని సమీపించేసరికి నానిగాడ్ని మరిచిపోయి... పందల్ని బయటకు తీశాడు.

నిజంగానే అద్భుతంగా ఉందారోజు సత్యం జాతకం. రెండువేలపైనే సంపాదించాడు... తనను తానే అభినందించుకున్నాడు. విజృంభించాడు. ఆ తర్వాత అతని అదృష్టానికి గ్రహణం పట్టింది. వచ్చిందంతా హారతికర్పూరంలా కరిగిపోయింది. బిక్కమొహం వేసి నిల్చున్నాడు.

అప్పుడు గుర్తొచ్చాడతనికి నానిగాడు.

నీర్సంగా వెనుదిరిగాడు.

★ ★ ★

ఆరోజు ఉదయం నుంచీ చిందులేస్తూనే ఉన్నాడు సత్యం. కాఫీ నీళ్ళల్లా ఉందని పంకజాన్ని కసురుకున్నాడు... "నన్నేం చేయమంటారు పాలల్లోనే నీళ్ళు కలిశాయి... అదేమని అడిగితే 'మీరిచ్చే పైసలకు నీళ్ళపాలు కాక మంచి పాలొస్తాయా' అంటూందది..." అంటూ ఘాటుగానే చెప్పింది పంకజం.

టిఫిన్‌కు బదులు అన్నం పెట్టిన పంకజంపై ఒంటికాలిమీద లేచాడు సత్యం... "నన్నేం చేయమంటారు బియ్యం తప్ప ఇంట్లో ఏమీ లేవు... మీరు తీసుకరాలేదుగా...?"... సమాధానంగా రంకెలేసింది పంకజం.

ధుమధుమలాడ్తూనే డ్రస్ చేసుకున్నాడు సత్యం. ఎందుకో యాంత్రికంగా తయారయ్యాడతను... జేబు ఖాళీగుంటే ఏం తోచదతనికి. అప్పిచ్చేవాడు కూడా ఎవడూ లేడు.

ఇటువంటి సమయంలో అతన్ని కదిలించాడు నానిగాడు.

"నాన్నా... నా ఫీజు..."

"ఛత్... నోర్ముయ్... గాడిద... ఫీజట ఫీజు..." కసురుకున్నాడు సత్యం.

"ఇవాళే ఆఖ్రరోజు... ఫీజు కట్టకుంటే పేరు తీసేస్తారు..." దాదాపు ఏడుస్తూ చెప్పాడు నాని.

"పేరు తీసేస్తే పందులు కాసుకో పో... గాడిదా... అస్తమానం సాధిస్తావ్..." అంటూ కోపంతో దబదబా వాడ్ని బాదాడు సత్యం.

బావురుమంటూ ఏడుపందుకున్నాడు వాడు.

"ఎందుకండీ వాడ్నలా కొడ్తారు. మీ చాతగాని తనానికి వాడ్ని చంపుతారా?" వంటగదిలోంచి చేస్తున్న పనినాపి పరుగెత్తుకుంటూ వచ్చి అడ్డం వచ్చింది పంకజం.

"ఏమిటే... మాటలు హద్దుమీరుతున్నాయ్. నాది చాతగానితనమా... నేను చాతగానివాడ్నా...?" రోషంతో అన్నాడు సత్యం.

"కాక... కన్నకొడుకు ఫీజని అడిగితే పందులు కాసుకొమ్మనే మిమ్మల్నేమనాలి?" నానిగాడ్ని దగ్గరకు తీసుకుంటూ కఠినంగా అంది పంకజం.

"మాటకు మాట చెప్తున్నావ్... ఒళ్ళు బలిసిందా?" కన్నెర్ర చేశాడు.

"ఆ... మీరు తెచ్చిపడేసిన రాశుల్ని అదేవ నిగా తినితిని ఒళ్ళు బలిసింది."

"ఏమిటే కూశావ్?..." అంటూ విసురుగా ముందుకు దూకి... కోపంతో ఆమె జుట్టు పట్టుకుని పైకిలేపాడు సత్యం.

"కొడతారా... కొట్టండి... అంతకన్నా ఏం చేస్తారు... కడుపులు మాడ్చటం... చావగొట్టటం మీకలవాటేగా... కొట్టండి..."

"నేను కడుపులు మాడుస్తున్నానా... చంపుతాను..." అంటూ దబదబా ఆమె వీపుమీద బాది- "ఛీ... ఛీ... ఏం కొంపో... ఒక్క నిముషం కూడా మనశ్శాంతుండదు" అంటూ వెళ్ళిపోయాడు సత్యం.

"ఉబుకుతున్న కన్నీళ్ళను దిగమ్రింగుకుంటూ కూర్చుండిపోయింది పంకజం. ఆమెకిదేం కొత్తకాదు... కన్నీళ్ళు తుడుచుకుంటూ లేచింది. పక్కింటి పిన్నిగారి దగ్గర అప్పు తీస్కుని నానిగాడ్ని కాన్వెంట్‌కి పంపించింది.

★ ★ ★

ఒకటో తారీఖు...

జీతాల రోజు...

ఆఫీస్‌కు బయలుదేరే ముందు మరీమరీ చెప్పింది పంకజం. "సాయంత్రం మాత్రం ఖచ్చితంగా ఇంటికేరండి. పక్కింటి పిన్నిగార్కి మూడొందలివ్వాలి... నానిగాడి యూనిఫాం చిరుగులు పట్టింది... వచ్చేటప్పుడు రెండుజతలు పట్రండి.

ఆ మాటలు వింటూ పంకజం వైపు చూశాడు సత్యం. జీవచ్ఛంలా ఉందామె. చిరుగులు పడుతున్న చీర... వడలిపోయిన మొహం... ద్రవించుకపోయిందతని మనసు... నానిగాడి గురించి చెప్పిందే కాని... తన చిరుగులు పట్టిన చీరల గురించి గుర్తుచేయలేదు... సాయంత్రం పంకజానిక్కూడా రెండు చీరలు తేవాలనుకుంటూ కదిలాడు సత్యం.

ఆఫీస్ చేరేవరకూ... ఆఫీస్‌లోనూ అదే ఆలోచనలోనున్నాడు. జీతం తీసుకునే క్షణం వరకూడా ఇదే ఆలోచన. ఈనెల్లో బాకీలు చెల్లించకుంటే కిరాణాషాపు నుంచి పాల సీత వరకూ ఎవరూ అప్పు పెట్టరనీ తెలుసు.

కానీ...

జీతం చేతికి రాగానే మారిపోయిందతని పంథా.

ఎవరన్నారో గాని... జూదగాడి హృదయం కుక్కతోక వంటిదని. నిజంగానే జీవితాన్ని కాచివడబోసి చెప్పిన జీవిత సత్యమిది.

పిన్నిగారి అప్పు...

నానిగాడి యూనిఫాం...

పంకజం చీరలు...

కిరాణాకొట్టు అప్పు... పాలసీత... హౌస్ రెంట్...

అన్నీ మరచాడతను...

పందెమాడాలి... పోయిందంతా సంపాదించాలి... అప్పులన్నీ తీర్చాలి... పంకజాన్ని సుఖపెట్టాలి...

ఇదే అతని లక్ష్యం...

ఆ ప్రదేశాన్ని సమీపించాడు సత్యం బరువు జేబుతో...

కేవలం అర్ధగంట మాత్రమే...

ఆ తర్వాత బరువును కోల్పోయిందది.



ఇంద్రభవనంలాంటి అధునాతనమైన ఆ బిల్డింగ్ ముందు పొడవాటి పడవలాంటి ఓ కారు ఆగింది. ఫ్రంట్ సీట్లోంచి దిగాడు ఆరడుగుల అందగాడు. ఫుల్‌సూట్, ఇంపోర్టెడ్ గాగుల్స్, ఫారిన్ సిగరెట్, మెళ్లో చైన్, గిరిజాల జుట్టు, హుందాగా, సినిమా హీరోలా ఉన్నాడతను. కారు చుట్టూ తిరిగి ఫ్రంట్ డోర్ తెరిచిపట్టుకుని మృదువుగా "కమాన్ డియర్" అన్నాడతను.





బిక్కు బిక్కుమంటూనే కార్లోంచి దిగిందో టీనేజ్ అప్సరస. ప్రపంచంలోని గులాబీలన్నీ ఓచోట రాశిలా పోసినట్లు చంద్రుని వెన్నెల నంతా ఒకేచోట కేంద్రీకృతం చేసినట్లు సౌంద ర్యానికి మచ్చుతునకలా ఉందామె. అతనిపై నుంచి దృష్టి మరల్చి ఓమారు కళ్లెదురుగా కనిపిస్తూన్న బిల్డింగ్‌ను తేరిపార చూసింది.

విశాలమైన స్థలంలో నిర్మించిన అయి దంతస్థుల బిల్డింగది. దానిచుట్టూ అక్కడ క్కడా అందంగా పెంచబడిన పూలతోటలు. ఓవైపు టెన్నిస్ కోర్టు. మరోవైపు స్విమ్మింగ్ పూల్. ఇంకోవైపు పిల్లల పార్క్‌ల్లో కనిపించే ఆట వస్తువులు. విద్యుద్దీపాల కాంతిలో పట్టపగ ల్లా దేవేంద్ర భవనంలా ఉంది.

"కమాన్ డియర్" అంటూ ఆ యువతి భుజాల చుట్టూ చేతుల్ని వేసి నడిపించుకెళ్లా డతను.

ప్రహరీ గేటు దగ్గర్నుంచి.. బిల్డింగ్ సింహ ద్వారం వరకూ నీట్‌గా కట్ చేయబడి, అందంగా పెంచబడిన దేశ విదేశీ పూల మొక్కలు వారి కాహ్వానం పలుకుతున్నట్లుగా చిరుగాలికి తలలూపుతున్నాయి. వారి కాళ్లు కందిపోకుండా మెత్తగా తన శరీరాన్ని పరుస్తూ కృతజ్ఞత ప్రకటిస్తూంది పచ్చిక.

హాల్లో అడుగు పెడ్తూనే ఎవరో పిలిచినట్లు వారి ముందు ప్రత్యక్షమయ్యారు తెల్లటి యూ నిఫాంలోనున్న నలుగురు సర్వెంట్స్.

"శ్యామ్, బయట కార్లోనున్న సామాను తెచ్చి లోపల పెట్టు. కరీం రాత్రికి డిన్నర్ సిద్ధం చెయ్. సుబ్బయ్యా మేడమీది గది శుభ్రం చెయ్." అంటూ చకచకా ఆర్డర్స్ జారీ చేస్తున్న అతనివైపు పరవశంగా చూసిందామె.

"కమాన్ శశీ" అంటూ లోపలకు దారి తీశాడతను.

ఆ ఇంట్లో అంగుళం అంగుళంలో రిచ్‌నెస్ తాండవిస్తూంది. హాల్లో మెత్తటి ఖరీదైన కా ర్పెట్. గోడలకు ఆయిల్ పెయింట్స్. సోఫాలు అలమరాలు అత్యంత విలువైన ఫర్నిచర్.

"ఇది నా ఆఫీస్ రూం"

విస్తుపోయి చూస్తూండి పోయిందామె. ఆఫీ సు గదే ఓ సామాన్యుడి నివాసానికి మూడింత లుంది. పొడవు వెడల్పులు సమానంగానున్న విశాలమైన ఆగదిలో ఓ వైపు నిలువెత్తు అల మరాలనిండా రకరకాల బుక్స్ అందంగా పే ర్చున్నాయి. వాటి పక్కనే టేబుల్, కుర్చీలు, బెడ్, గాద్రెజ్ బీరువా.

ఒక్కోసారి వర్క్‌తో అలిసినప్పుడు ఇక్కడే విశ్రమిస్తుంటాను. అతని మాటలను ఆల కించినట్లు తలూపింది.

ఇదే మన బెడ్రూం.

లోపలికడుగు పెట్టిన ఆమెను హాయిగా స్పృశించింది చల్లటిగాలి. ఎయిర్ కండిషన్డ్ చేయబడిన గది. డబల్ కాట్ బెడ్ డ్రస్సింగ్ టేబుల్ ఫ్రిజ్, టి.వి. సినిమా సెట్టింగ్‌లా ఉంది.

"ఇది డైనింగ్ రూం"

భూదేవంత టేబుల్ చుట్టూ డజనుపైగా ఛైర్స్. అందంగా ఆకర్షణీయంగా డిజైన్ చేయ బడి మనసునాకట్టుకునేలా ఉన్నాయి. గోడ లకు తెల్లటి పెయింట్ అదో రకమైన వింత వాసనతో కలిసి మత్తునుగొల్పుతూంది.

"ఇది కిచన్. ఆఫ్ కోర్స్. ఈ గదిలోకడుగు పెట్టాల్సిన అవసరం నీకు లేదనుకో. అయినా పరిచయం చేయటం నా బాధ్యత"

అధునాతనమైన ఎలెక్ట్రిక్ పరికరాల్లో నిండున్న ఆ వంట గదిని సంభ్రమంగా చూసింది. కుక్కర్, గాస్ స్టవ్, మిక్సీ, గ్రైండర్ ఫ్రిజ్ వాషింగ్ మెషీన్ ఓ సామాన్యుడి కలల ప్రపంచంలా వైభవానికి చిహ్నాంలా ఉంది"

హఠాత్తుగా గోడ గడియారం "ఠంగ్ ఠంగ్" మంటూ గంటలు కొట్టడంతో ఉలిక్కిపడి చదు వుతున్న నవల్లోంచి తలెత్తి చూసింది కాంతం.

'పదకొండైంది'

గడియారంవైపు స్తబ్ధుగా చూస్తూండిపో యింది అయిదారు క్షణాలపాటు. ఆ క్షణం వరకూ నవల్లో ఆమె చదివిన ఫర్నిచరే ఆమె కళ్లల్లోనూ, మనసులోనూ చోటు చేసుకుని వెంటాడుతోంది.

నవల్లోని డైనింగ్ రూమంత కూడా లేని తమ రాజప్రాసాదం వైపు నిర్లిప్తంగా చూసింది.

'ముందు హాలు, ఓగది, చివర వంటగది.







మురికి పట్టి అక్కడక్కడా సిమెంట్ పెచ్చులూడిన గోడలు. హాల్లో రెండు కుర్చీలు. గదిలో తాతల కాలంనాటి రెండు మంచాలు. ఓ చెక్క బీరువా. భయంకరంగా అరుస్తూ నిద్రకు దూరం చేసే టేబుల్ ఫాను. ఓమూల మైల పెట్టె. దండెంపై ఉతికిన రెండు చీరలు. లంగాలు. ఆగది నానుకుని ఓ మనిషి మాత్రం తిరగటానికి వీలుండే వంటగది. పాత స్టౌ. కట్టెల పొయ్యి. తన పెంకుటింటిని నవల్లోని ఇంద్రభవనంతో పోల్చుకుని దీర్ఘంగా నిట్టూర్చింది కాంతం.



కాంతం భర్త శివం. ఏదో ప్రైవేట్ సంస్థలో వర్క్ చేస్తున్నాడు. ప్రైవేట్ సంస్థ కనుక జీతం కనీసావసరాలకు మాత్రం లోటు లేకుండా సరిపోతుంది. ఇంకా పిల్లలు పుట్టలేదు కనుక చిన్న సంసారమే.

ఉదయం తొమ్మిదికి శివం ఆఫీస్‌కెళ్తాడు. పదింటికల్లా వంట పని పూర్తవుతుంది. ఆ తర్వాత ఏదో ఒక నవల పట్టుకుని హాల్లో కూర్చుంటుంది. పది ఇరవై పేజీలు చదివింతర్వాత ఖచ్చితంగా విసుగు పుడుతుంది. నవలను మూసేసి కళ్లు మూసుకుంటుంది. ఆలోచనలు చుట్టుముడతాయి.



ముందుగా ఇరుగు పొరుగులవాళ్లు ,వాళ్ల ఫర్నీచర్, ఎదురింట్లో కొత్తగా కొన్న కలర్ టి.వినో, వి.సి.పినో లేక ఫ్రిజో మనసులో మెదుల్తుంది. తమకన్నా తక్కువ స్థితున్న వాళ్ల గురించి ఎప్పుడూ ఆలోచించక పోవటం ఆమె ప్రత్యేకత.

పది నిముషాల తర్వాత అది కూడా విసుగనిపిస్తుంది. అక్కడ్నుంచి లేచి లోపల మంచంపై పడుకుని కళ్లు మూసుకుంటుంది. ఒకదానివెంట ఒకటిగా కలలు కనటం ప్రారంభిస్తుంది.

ప్రతి రోజూ ఆమె మొట్టమొదటగా కనే కల.

హాల్లో కూర్చుని నవల చదువుకొంటుంది. వాషింగ్ పౌడర్ అమ్ముకునే కుర్రాడొకడు అరుచుకుంటూ వస్తాడు. పాపం. ఊరంతా అరచి అరచి ఉంటాడేమో అతని గొంతు కూడా బొంగురు పోయుంటుంది. కాంతం ఇంటి ముందు నిల్చుని మంచినీళ్లిమ్మని అర్థిస్తాడు. నవల మూసేసి మంచినీళ్లిస్తుంది కాంతం.

దప్పిక తీర్చుకున్న తర్వాత తమ వాషింగ్ పౌడర్ గూర్చి ఇటీవలే ప్రవేశపెట్టిన ఓ పాకెట్‌కు ఓ లాటరీ టికెట్ ఉచితం పథకం గూర్చి పది నిముషాలు అనర్గళంగా ఉపన్యసించి ఓ పాకెట్ కొనమని అభ్యర్థిస్తూ ముగిస్తాడు.

నిరాసక్తతగా చూస్తుంది కాంతం.

ఈ పాకెట్లమ్మగా వచ్చిన కమిషన్‌తోనే తమ ఇంటిల్లిపాదీ కడుపునింపుకోవాలని దీనంగా వినిపిస్తాడతను. కరిగిపోతుందామె. జాలిగా చూస్తూందోక్షణం. రెండు పాకెట్లు కొంటుంది. ఆమెను పొగడ్తల్తో ముంచెత్తి కృతజ్ఞతలు చెప్పి రెండు వాషింగ్‌పౌడర్ పాకెట్లతోపాటు లాటరీ టిక్కెట్లను చేతిలోపెట్టి వెళ్తాడు. ఆ టిక్కెట్లను చీరమడతలో పెట్టి మరచిపోతుందామె.

నాలుగైదు రోజుల తర్వాత హఠాత్తుగా వాటి విషయం గుర్తొస్తుంది. పక్కింట్లోంచి పేపర్ తెచ్చుకుని నంబర్లు చూస్తుంది. తన దగ్గరున్న రెండు టికెట్లకు ఫస్ట్‌ప్రైజ్ రెండు లక్షలు, సెకండ్‌ప్రైజ్ లక్షవస్తుంది. మొత్తం మూడులక్షలు.

ఆనందంతో ఎగిరి 'గంతేస్తుంది. వెంటనే ఇంటిని లాక్‌చేసి రిక్షాలో భర్త ఆఫీస్‌కెళ్తుంది. ఆనందంతో పొంగిపోతాడు శివం.

ఆఫీస్‌కు సెలవుపెట్టి ఆ లాటరీ ఏజెంట్‌ను కలుసుకుంటారు. క్షణాల్లో కాష్ తీసుకుని అట్నుంచటే 'విజయా ఎలక్ట్రికల్ షోరూం'కెళ్తారు. కలర్ టి.వి, ఫ్రిజ్, గాస్‌స్టవ్, సోఫాలు, వాషింగ్‌మెషిన్, గ్రైండర్, మిక్సి, డబుల్‌కాట్ అన్నీ ఖరీదుచేస్తారు.

"మనకా ఇల్లు సరిపోదు. మంచి సెంటర్లో పెద్దిల్లు తీసుకుందాం" అంటుంది భర్తతో.

"అలాగే" అంటూ తలూపుతాడతను.

అంతటితో ఆ కల ముగుస్తుంది.

మంచంపై ఇటు తిరిగి పడుకుంటుంది కాంతం. కిర్ర్‌మంటూ మూలుగుతుంది పాత మంచం. రెండో కల ప్రారంభమవుతుంది.

బంజారాహిల్స్‌లో ఓ బంగ్లా.

ఆరో అంతస్తులోని ఏడో గదిలో ఖళ్...ఖళ్ మంటూ విపరీతంగా మెలికలు తిరిగిపోతూ దగ్గుతుంటుందో వృద్ధురాలు. దాదాపు అరవై పైనే ఉంటుందామె వయసు. రాలిపోవటానికి సిద్ధంగానున్న పండుటాకులా ఉందామె. బెడ్ చుట్టూ ఆందోళనగా చూస్తున్నారు బంధుమిత్రులంతా.

ఆమె నాడి పట్టుకుచూసి పెదవి విరిచాడు డాక్టర్.

నాడి బలహీనంగా కొట్టుకుంటూంది. ఈ క్షణమో-మరుక్షణమో అన్నట్లుందామె పరిస్థితి. శరీరం అశక్తమవుతూంది. కళ్ళుమూతలు పడుతున్నాయి.

డాక్టరుగారి మొహంచూసి బాధతో ఏడవటం ప్రారంభించారంతా.

బలవంతాన కళ్లెత్తి చూసిందామె. ఏదో చెప్పాలని కాబోలు పెదవులు వణుకుతున్నాయి. అది గమనించి సైగచేశాడు డాక్టర్-క్షణాల్లో నిశ్శబ్దం అలుముకుంది.

దూరంగానున్న ఫామిలీ లాయర్‌కేసి సైగ చేసిందామె. అర్థంచేసుకుని ఆమెను సమీపించాడతను.

"నిన్న డిక్టేట్ చేసిన ఖళ్ ఖళ్ విల్లులో ఖళ్ కాంతం అనే ఆవిడకు ఖ...ణే...ళ్ మూడు లక్షల ఖళ్ రూపాయలు చెందేట్లు ఖళ్ మరో





క్లాజ్ చేర్చి ఖళ్ పట్టుకురా. సంతకం పెడ్తాను... ఖళ్ ఖళ్' అంటూ తెలుగు సినిమాలోని ముసలితల్లిలా రక్తం కక్కుకుంటూ మెలికలు తిరిగిపోయిందామె.

పిన్‌డ్రాప్ సైలెన్సు చోటు చేసుకుందా గదిలో. వారసులు ఉలిక్కిపడ్డారు ఆమె చెప్పిన క్లాజ్ విని.

"ఎవరీ కాంతం?"

"ఆమెకు మూడు లక్షలా?"

అక్కణ్ణుంచి కదిలాడు లాయర్ విల్లు తయారుచేయటానికి.

ఓసారందరి వైపు కలియచూసి మంద హాసం చేస్తూ ఇలా చెప్పుందామె.

"అయిదు సంవత్సరాల క్రితం ఖళ్ ఖళ్ నేను రచనలు ఖణేళ్ మానేంతవరకు నా నవలలను ఖళ్.. అన్నింటినీ.. అభిమానంగా ఖణేళ్.. ఖణేళ్.. చదివిన నా ఒకే ఒక అభిమాని కాంతం. అందుకనే ఖళ్ ఖళ్ నా నవల్లమీద సంపాదించిన ఆస్తిలో ఖళ్ ఆమెకు ఆపాటి చెందటం సబబు. ఖణేళ్ ఖణేళ్" చెప్పటం పూర్తయిన మరుక్షణం విపరీతమైన దగ్గుతెర అడ్డురావటంతోపాటు బలుక్ బలుక్‌మంటూ గొంతులోంచి రక్తం బయటకు పొంగి బెడ్‌చుట్టూ పెద్ద మడుగు అవుతుంది.

ఆమె అభిప్రాయం సబబే అన్నట్లు తలూపుతారు వారసులంతా.

'మరి ఓ రచయిత్రి చెడామడా రాసిపారేసిన నవలలన్నింటిని ధారావాహికంగా చదవటమంటే మాటలా, తమ తల్లి గీకిపారేసిన నవలల్ని తామే చదివి భరించలేకపోయారే'

ఎవరో తెలీని ఆ కాంతానికి మనసులో అభినందనలు తెలిపారంతా.

లాయరు విల్లు తీసుకురావటం, ఆమె సంతకం పెట్టడం, మరణించటం అంతా జరిగిపోతుంది.

ఓ రోజు మధ్యాహ్నం కాంతం ఇంటికొస్తాడు లాయర్.

"కాంతంగారంటే మీరేనా?" అనడుగుతాడు.

అవుననట్లు తలూపుతుంది కాంతం.

"ఇక్కడ సంతకం పెట్టండి. మీరు తన నవలల్ని అభిమానించినందుకు మీ అభిమాన రచయిత్రి భయంకరేశ్వరిగారు తమ ఆస్తిలో మీకు మూడులక్షలు చెందాలని రాశారు" చెప్పాడు లాయర్.

ఉక్కిరిబిక్కిరవుతూ సంతకం పెట్టి మూడు లక్షలు తీసుకుంటుంది కాంతం. వెంటనే ఈ విషయాన్ని భర్తకు తెలీచేస్తుంది. ఇద్దరూ కలిసి ఎగిరి గంతేసి 'విజయా ఎలక్ట్రికల్ షోరూం'కెళ్తారు. కలర్ టి.వి, ఫ్రిజ్, గాస్‌స్టౌ, సోఫాలు, వాషింగ్‌మెషిన్, గ్రైండర్, మిక్సి, డబుల్‌కాట్ అన్నీ ఖరీదుచేసి లారీకెక్కిస్తారు.

బిల్‌చెల్లించి వెనక్కి తిరిగిన కాంతానికి లారీతోపాటు లగేజ్ కూడా అదృశ్యమవుతుంది. ప్రతిరోజూ కాంతం రెండోకల సరిగ్గా ఇక్కడే ముగుస్తుంది. సామాను ఎందుకలా అదృశ్యమవుతుందో ఎంతాలోచించినా ఆమెకర్థంకాదు. ఆ సమయానికి భర్త ఆఫీస్‌నుంచి రావటమో, మరొకటో జరగటంతో కలలకు ఫుల్‌స్టాప్ పెట్టి బెడ్‌పైంచి లేస్తుంది.

ఆ రోజుకూడా సరిగ్గా అదే సమయానికి బిలబిలమంటూ నలుగురాడవాళ్ళు రావటంతో కలాభంగమై మంచం దిగింది కాంతం.

"సాయంత్రం మా మనవరాలిని ఉయ్యాల్లో వేస్తున్నాం. పేరంటానికి మీరు తప్పనిసరిగా రావాలి" బొట్టుపెట్టి ఆహ్వానించింది నాలుగిళ్ళవతలి బ్యాంక్ కాషియర్ భార్య.

ఆ క్షణంనుంచీ కాంతం మనసు మనసులో లేదు.

పేరంటానికి ఎవరెవరొస్తారు?

తనెలాంటి చీర కట్టుకెళ్ళాలి?

కట్టిన చీర కట్టకుండా కట్టుకొచ్చే సుకన్య దగ్గర్నుంచీ ఎప్పుడూ ఆకుపచ్చరంగు చీర కట్టుకొచ్చే గీత వరకూ ఆమె మనుసులో మెదిలారు.

ఆలోచనల్లో పడి భర్తకు పరధ్యానంగానే వడ్డించింది. పేరంటం విషయం వివరించి బజారునుంచి సింపుల్‌రేట్‌లో ఓ గౌన్ తెప్పించింది.

"పేరంటానికి వెళ్ళేప్పుడు నన్నూ పిల

వండి, నేనూ వస్తాను'' అంటూ చెప్పింది పక్కింటి కిరణ్మయి.

సాయంత్రం నాలుగ్గంటలకే స్నానంచేసి బట్టల బీరువా తెరిచింది కాంతం. ఏ చీరకట్టుకోవాలో అర్థంకాలేదామెకు. ఉన్నవి డజను చీరలే. దాదాపు అన్నీ అయిదారుసార్లు కట్టినవే.

ఓ క్షణం ఆలోచిస్తున్నట్లుగా నిల్చుంది. చివరకు మారేజ్‌డేనాడు భర్త ప్రజంట్‌చేసిన మెటల్ షిఫాన్ తీసి కట్టుకుంది. కాస్త పౌడరద్దుకుని పూలు పెట్టుకుని గౌన్ పాకెట్‌తో కిరణ్మయి ఇంటిముందు నిల్చుని పిలిచింది. అయిదు నిముషాల తర్వాత ఆమెకూడా రావటంతో కాషియర్‌గారింటి దారిపట్టారు.

వీళ్ళు వెళ్ళేసరికే కాషియర్‌గారిల్లు పెళ్ళిల్లులా గందరగోళంగా ఉంది. పట్టుచీరల గరగరలు... షిఫాన్ పెరపెరలు... ఎత్తుముడులు... వాలు జడలు... గుర్రపు తోకలు... చేతుల్లేని జాకట్‌లు... లోనెక్ జాకెట్‌లు... సీదాసాదా మొహాలు... బెత్తెడు మందాన పెయింటింగ్‌లు... వయసును కప్పెట్టే తాపత్రయాలు... పోచికోలు కబుర్లు... వ్యంగ్యపు బాణాలు... పలకరింపులు... హాయ్... హలోలు... రాజకీయాలు... నగలు... నక్లెస్‌లు... చంద్రహారాలు... టీవీలు... ఫ్రిజ్‌లు... మిక్సీలు... వాషింగ్ మెషీన్‌లు అన్నీ తమతమ పాత్రల్ని యధోచితంగా పోషిస్తున్నాయా గందరగోళంలో.

అక్కడ సెంటరాఫ్ అట్రాక్షన్ సుకన్య. ఆమె కట్టుకొచ్చిన ఎరుపురంగు, వెడల్పాటి బార్డరున్న పట్టుచీర అద్భుతం. మెళ్ళో డైమండ్ నెక్లెస్‌తో, కొత్త చీరలో మెరిసిపోతోంది సుకన్య. దాదాపు పేరంటానికొచ్చిన అంగనామణులంతా ఆమె చుట్టూనే ఉన్నారు.

''ఆమెకేం... భర్త బాగా సంపాయిస్తున్నాడు. రోజొకటి కాకపోతే పూటకొకటి కడ్తుంది'' అక్కసుగా అంది ఇంతి సుకన్య వైభవానికి మొహం చిట్లించుకుంటూ.

'సుకన్య భర్త లంచాలు బాగా తీసుకుంటాడని రెండుమూడుసార్లు సస్పెండ్ కాబోయి ఆఫీసరుగారి కాళ్ళమీదపడి తప్పించుకున్నాడనీ' గుసగుసగా కాంతంతో చెప్పింది కిరణ్మయి.

''ఆ లతను చూడు... ఎప్పుడూ పండుకోతిలా ఎరుపు చీరే కట్టుకొస్తుంది'' ఎగతాళిగా అంది పార్వతి. అవతలివాళ్ళు కూడా తమ గురించి అలానే వెక్కిరిస్తుంటారని ఊహించక.

''అన్నట్టు సుందరమ్మ వదినా... మీ అమ్మాయికిప్పుడు ఆరోగ్యం బావుంటుందా?'' పరామర్శించింది కిరణ్మయి.

అప్పటివరకూ తన వాక్చాతుర్యంతో అందర్నీ హడలుగొట్టేస్తున్న సదరు సుందరమ్మగారు ''ఆఁ...'' అంటూ ముక్తసరిగా సమాధానమిచ్చి తప్పుకున్నారు.

ఆమె ఘనమైన కూతురుగారు పెళ్ళికాకుండానే ఎవడితోనో తిరిగి అబార్షన్ పాలైందన్నది అందరికీ తెలిసిన బహిరంగ రహస్యం. బాత్రూంలో కాలుజారిపడిందనే ముసుగు తొడిగిందావిడ.

అయిదున్నరకు పేరంటం ముగిసింది.

''రండి కాంతంగారు... మా యింటికెళ్దాం... కాఫీ తాగి వెళ్దురు'' అంటూ సుకన్య ఆహ్వానించేసరికి కాంతం, కిరణ్మయిలకు ఆమె ఇంటికి వెళ్ళక తప్పింది కాదు.

''కూర్చోండి'' అంటూ వాళ్ళకు సోఫా చూపించి కాఫీలు పంపించమని వంటమనిషికి పురమాయించింది సుకన్య. ఆ తర్వాత దాదాపు అర్ధగంటసేపు కాంతం మనసును హూరెత్తించింది సుకన్య.

తాము కొత్తగా కొన్న వి.సి.ఆర్‌ను ఓ కాసెట్ రన్‌చేసి మరీ చూపించింది. మిక్సీని కూడా ప్రదర్శించింది.

బీరువా తెరిచి చీరెలను పరిచింది. చీరెల దొంతరను చూసి కాంతం కళ్ళు జిగేల్మన్నాయి.

''అదేమిటోనండి కాంతంగారూ... ఇన్ని చీరెలున్నా పేరంటానికి కట్టుకు రావాలంటే ఒక్కటీ నచ్చదు'' అంది.

'తనకున్న చీరెల్ని మనముందు ప్రదర్శించటం కాబోలు' గొణికింది కిరణ్మయి.

బీరువాలోంచి నగలపెట్టెతీసి చూపించింది.





విస్మయంగా చూస్తూండిపోయింది కాంతం వాటివైపు.

నల్లపూసలదండ... కాసులపేరు... మామిడి పిందెల డిజైనున్న నక్లెస్... చంద్రహారం... గాజులు... లక్ష్మీదేవి ముద్దులపట్టిలా అని పించిందామె ఆ క్షణం.

ఆమెవైపు ఈర్ష్యగా చూసింది కాంతం.

కేవలం మూడు సవర్ల నల్లపూసలదండ మాత్రమే ఉన్న తనను ఆమెతో పోల్చుకుని చేదుమాత్ర మింగినట్లు అప్రసన్నంగా అయింది.

మరో పదినిముషాలపాటు ముళ్ళమీద కూర్చునట్లు గడిపి... కాఫీతాగి బయటపడ్డారిద్ద రూ.

★ ★ ★

అనీజీగా ఫీలవుతూనే ఇంట్లో కడుగుపెట్టా డు శివం. కాంతం ఏదైనా ఫంక్షన్కెళ్లొచ్చిన రోజు శివం ఇలా ఫీలవటం మామూలే పెళ్ళ యి నాలుగేళ్ళు దాటుతున్నా కాంతం అతనిక ర్థంకాలేదు.

ఆ రోజూ అంతే...

భోజనం వడ్డించింతర్వాత పురాణం విప్పింది కాంతం. ఫంక్షన్దగ్గర్నుంచి సుకన్య ఇంట్లో చూసిన ఫర్నిచర్వరకూ... నగలవరకూ ఏకరువుపెట్టింది. ఆ తర్వాత భర్త మొహంలో కి చూస్తూండిపోయింది.

"ఆయనకేం టేబుల్కింద చేతులుపెట్టి బాగా సంపాయిస్తున్నాడు. ఎన్ని నగలైనా చే యించగలడు" ముక్తసరిగా అన్నాడు శివం.

"భార్యను సుఖపెట్టాలి... సంతోషపెట్టాలనే కోరిక ఉండాలెగాని ఎలా సంపాదించాడన్నది కాదు ముఖ్యం. ఏమైనా పెట్టిపుట్టాలి - పుణ్యంకొద్దీ పురుషుడు - దానంకొద్దీ బిడ్డలూ అన్నారు. మీరూ ఉన్నారు ఎందుకు - పెళ్ళ యి నాలుగేళ్ళయినా ఓ మంచి చీరాలేదు నగాలేదు" నిష్ఠూరంగా అంది కాంతం.

గబగబా నాలుగు ముద్దలుతిని చేయి కడు క్కుని లేచాడు శివం. ఆ తర్వాతి ప్రవాహం అతనికి ఎరుకే.

కాంతం వంటిల్లు సర్దుకుని పక్కపైకొచ్చేస రికే నిద్రనటిస్తూ పడుకున్నాడు శివం. మేలు కుని ఉంటే ఏం జరుగుతుందో అతనికి తెలు సు.

సుకన్య ఇంట్లో చూసిన చీరలు, నగలు, ఫర్నీచర్ కళ్ళముందు కదలాడుతూండగా బలవంతాన కళ్ళు మూసుకుంది కాంతం.

తన హృదయ భారాన్నంతా ప్రియమిత్రు డు గణేష్ముందు వెళ్ళగక్కాడు శివం. సాలో చనగా చూస్తూ తలపంకించాడతను.

"ఏం చేయాలో అర్థం కావట్లేదురా. లక్షాధికా రుల్తో మనమూ పోటీపడాలంటుంది కాంతం. నెలాఖర్లో వెతుక్కోవాల్సిన బతుకులాయె మనవి. మార్కెట్లో రిలీజైన ప్రతి వస్తువునూ స్వంతంచేసుకోవాలంటే ఎలా సాధ్యం?" నిర్లిప్త తంగా పెదవి విరిచాడు శివం.

"సాధ్యమే.. ఓ మార్గంద్వారా" ఓ నిముషం తర్వాత గంభీరంగా చెప్పాడు గణేష్.

"సాధ్యమా - ఎలా?" ఆశ్చర్యంతో ఉక్కిరిబి క్కిరయ్యాడు శివం.

"అవును ... తక్కువ పెట్టుబడితో ఎక్కువ మొత్తాల్ని సాధించాలన్నా బిక్షాధికారులు చిటి కెలో లక్షాధికారులు కావాలన్నా మనలాంటి సామాన్యులు తమ గొంతెమ్మ కోర్కెలను తీర్చుకో వాలన్నా అదొక్కటే మార్గం" కళ్ళముందు ఏవేవో చిత్రాలు - శబ్దాలు కదలాడుతూండగా ఉద్వేగంతో చెబుతున్నాడు గణేష్.

ఏదో అనుమానం మనసులో ప్రవేశించగా "ఏ...మి..టా... మార్గం...?" అంటూ సందే హంగా చూశాడు శివం.

"రేసెస్"

తాపీగా వచ్చిన ఆ సమాధానానికి ఉలిక్కిప డ్డాడు శివం.

'రే..సె..స్.."

"అవును ... మనలాంటి సామాన్యులకు అదృష్టాల్ని పెంచే స్వర్గద్వారాలవి. సిరినితెచ్చే ధనలక్ష్మికి సింహద్వారాలు. అందలాన్నె క్కించే స్వర్ణసోపానాలు..." గణేష్ తన్మయ త్వంతో చెప్పుకుపోతున్నాడు.

ఓ క్షణం మౌనంగా చూశాడు శివం.

"ఇంకా ఆలోచిస్తావేం నేస్తం. కేవలం పదుల పెట్టుబడులతో వేలు, అదృష్టం

బావుంటే లక్షలు, కోట్లు కూడా సంపాదించవచ్చు. ఇష్టమైన ఫర్నీచర్, టి.వి, ఫ్రిజ్, డబుల్ కాట్, గ్రైండర్, మిక్సీ, ఎ.సి.ఆర్‌లతోపాటు అందమైన బిల్డింగ్‌ను కూడా స్వంతం చేసుకోవచ్చు". ఊహాసౌధాలు నిర్మిస్తున్నాడు గణేష్.

"న..ష్ట..పో..తే..?!' వివేకంతో గణేష్ వైపు చూశాడు శివం.

"ప్చ్.." పెదవి విరిచాడు గణేష్. "నెగటివ్‌గా ఆలోచించే ఏ వ్యక్తీ జీవితంలో పురోగమించలేడు. ఏ వ్యాపారస్తుడూ లక్షలార్జించలేడు. ఇదీ అంతే. అయినా మనం నష్టపోవటానికి మనం పెట్టే పెట్టుబడి ఎంత. వందో, యాభయ్యో పదో. లక్షలార్జించాలనుకునే కోర్కె ముందు ఇంత చిన్న మొత్తాలని దృష్టిలోపెట్టుకోకూడదు. నాలుగైదు సార్లు చూస్తాం. ఎప్పుడూ నష్టమే వస్తుంటే మానేస్తాం. లభాలొస్తే తిరిగి విజృంభిస్తాం" పూలబాటని అతని కాళ్ళ ముందు పరుస్తున్నట్లుగా అన్నాడు గణేష్.

"అయాంసారీ... అదృష్టంతో ఆటలాడలేను" నిర్లిప్తంగా అంటూ వెనక్కి తిరుగుతున్న శివం వైపు జాలిగా చూశాడు గణేష్. "పూర్ ఫెలో... ఆ భగవంతుడు కూడా నిన్ను రక్షించలేడ"నుకుంటూ.

అతికష్టం మీద ఆఫీస్ టైం తర్వాత సాయంత్రం అయిదున్నర నుంచి ఆరున్నర వరకూ ఓ ఎక్స్‌పోర్ట్స్ అండ్ ఇంపోర్ట్స్ ఆఫీస్‌లో అకౌంట్స్ రాయటానికి కుదిరాడు శివం. జీతం రోజుకు పది రూపాయలు.

ఉదయం పది నుంచి సాయంత్రం అయిదు వరకూ క్షణం తీరికలేకుండా హెవీ వర్క్‌తో తలమునకలయ్యే శివంకు ఈ అదనపు పని తలకు మించిందే అయినా తప్పలేదు. ఆలశ్యమయిందేమని మొదటిరోజు కాంతం అడిగిన ప్రశ్నకు జీతాల్రోజు అసలు విషయం చెప్పి ఉక్కిరి బిక్కిరి చెయ్యాలని ఏదో సమాధానం చెప్పాడు.

నెలాఖరున జీతంగాక అదనంగా మరో రెండు వందలా అరవై రూపాయలను కాంతం చేతిలో పెట్టి ఆమె మొహంలోకి చూశాడు శివం.

"ఈ డబ్బెక్కడిది?"

నెల రోజులుగా తను పడుతున్న కష్టాన్ని వివరించాడు శివం. "రెండు వందల అరవయ్యా... కనీసం ఓ మంచి చీర కూడా రాదే" నిర్లక్ష్యంగా అని లోపలికెళ్ళింది కాంతం.

విద్యుద్ఘాతం తగిలినవాడిలా షాక్ తిన్నాడు శివం. నిశ్శబ్దంగా మంచం పైకి జారిపోయాడు. నెల రోజులు అతని కష్టం కనీసం సానుభూతికైనా నోచుకోలేదు.

అదే సమయంలో ఆ దారంట వెళ్తూ అతన్ని పలకరించాడు గణేష్. అతని చేతిలో కొత్త మిక్సీ పాకెట్టుంది.

కాంతం దృష్టంతా అతని చేతిలోని పాకెట్ పైనే ఉంది.

"లోపలకు రారా" అంటూ ఆహ్వానించి, "కాంతం కాఫీ పట్రా" అంటూ పురమాయించాడు శివం.

బాధగా నిట్టూరుస్తూ వంటగదిలోకెళ్ళింది కాంతం. 'ప్రపంచంలో అందరూ అన్నీ కొంటున్నారు ఒక్క తాము తప్ప'

'ఇదే ప్రపంచంలో కనీసం తమలా నిత్యావసరాలు కూడా తీరని దరిద్రులు లక్షలాదిమందున్నారని ఆమె భావనకందదు'

"నిన్నేం జరిగిందో తెలుసా?" కాంతం వంటగదిలోకెళ్ళటం గమనించి తల ముందుకు వంచి గుసగుసగా అన్నాడు గణేష్.

ఆసక్తిగా చూశాడు శివం.

"అందరూ ఓడిపోతుందనుకున్న ఓ గుర్రం మీద నా అదృష్టాన్ని పరీక్షించుకోవాలని ఓ ఇరవై కాశాను. అదేం చిత్రమో. అదే గెలిచింది. రెండు వేలు లాభం వచ్చిందనుకో. ఇదిగో ఇది కొన్నాను"

స్థబ్దుగా అయ్యాడు శివం.

'కష్టపడి సంపాదించటంలో సుఖం ఉందా, ఏదో విధంగా సంపాదించిన మొత్తంలో సుఖం ఉందా?'

అతనికిది శేషప్రశ్నే అయిందా సమయంలో.

గంట కిందట కాంతం ప్రవర్తన గుర్తొచ్చి బాధగా మూలిగింది శివం హృదయం.





తను రోజూ ఓ గంట ఎగస్ట్రాగా పనిచేసి రెండొందలు అరవై రూపాయలు సంపాదిస్తే ఆమె తననభినందించాలి. కనీసం తన కష్టంపట్ల సానుభూతైనా చూపించాలి. అదేం లేదు, పైగా నిష్ఠూరాలు...

ఆ మొత్తం తక్కువనేగా ఆమెలో ఆ భావం. భర్త కష్టసుఖాలకన్నా ఆమెకు ఫర్నీచర్, చీరెలు, నగలే ముఖ్యం కాబోలు.

తనేమైనా కానీ అవి సంపాదిస్తే తనకొక గౌరవం, విలువ.

ఓ నిశ్చయానికొచ్చాడతను.

ఎలాగైనా సరే... ఆమెను సంతోషపర్చాలి- ఎలాగైనా సరే.

"గణేష్... ఈసారి నేను కూడా వస్తాను- పిలువు" చెప్పాడు శివం. ఇంతలో కాఫీ లందించింది కాంతం.

★ ★ ★

సరిగ్గా రెండు గంటలకు శివం ఇంట్లో అడుగుపెట్టాడు గణేష్.

"వెళ్దామా?"

"నీదే ఆలశ్యం..." అంటూ లేచాడు శివం.

పదిహేను నిముషాల తర్వాత వాళ్ళెక్కిన ఆటో ఓ బిల్డింగ్ ముందాగింది. మరో రెండు నిముషాల తర్వాత బుక్ మేకర్ దగ్గరున్నారు.

బుక్ మేకర్‌కి బెట్ ఎమవుంట్ ఇచ్చి నంబర్లు చెప్పారిద్దరూ. మరో రెండు నిముషాల తర్వాత రేస్ క్లబ్‌లోకి ఎంటరయ్యారు.

రెండున్నర కావస్తున్నా ఆకాశంలో చిటపట లాడ్తూనే ఉన్నాడు సూర్యభగవానుడు... గుమస్తాల దగ్గర్నుంచి... ఆఫీసర్లవరకు... గుండు సూదులమ్మే వాళ్ల దగ్గర్నుంచీ ఫాక్టరీ ఓనర్స్‌వరకూ... ఎవరి స్థాయినిబట్టి వాళ్ళు గాలరీల్లోకి నడుస్తున్నారు.

ఫస్ట్‌రేస్ సరిగ్గా మూడు గంటలకు

పాతిక ఎకరాల స్థలంలో విశాలంగా వృత్తాకారంలో నిర్మించబడుంది. రేస్ గ్రౌండ్... లోపల అంచుల్లో గుర్రాలు పరుగెత్తేందుకు వీలుగా నిర్మించబడి ఉంది ట్రాక్. దానివక్కనే కారు వెళ్ళగలిగేంత వైశాల్యంతో మరో ట్రాక్.

రేస్‌లో పాల్గొనే గుర్రాలు, జాకీలు సిద్ధంగా ఉన్నారు.

గ్రౌండ్ మధ్యలో ట్రాక్‌కి దగ్గర్లో మూడు నిలువుల ఎత్తులో రిజల్ట్స్ బోర్డ్ నల్లగా మెరుస్తూంది. బోర్డ్‌మీద వివరాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

జాక్‌పాట్ రేసెస్: 2...3...5...6...8

జాక్‌పాట్ పూల్ రు. 70,000

క్లబ్ నిర్ణయించిన ఈ అయిదు రేసుల్లో గెలిస్తే ఆ 70 వేలూ వస్తాయన్నమాట.

ట్రిపుల్: 2...3...5...

ఎమవుంట్ రు. 40,000

ఈ మూడు రేసుల్లో మాత్రం గెలిస్తే ఆ 40 వేలు వస్తాయి.

విన్ రు. 25,000 - ఒకే రేస్‌లో మొదటి రెండు స్థానాలను గెలిస్తే.

క్వినిల్లా: రు. 20,000 - ఒకే రేస్‌లో రెండు గుర్రాల్ని గుర్తించగలిగితేనూ, వాటిల్లో ఏదో ఒకటి ఫస్ట్... మరొకటి సెకండ్ వస్తేనూ.

తనాలా: రు. 30,000 - ఒకే రేసులో ఫస్ట్, సెకండ్, థర్డ్ వచ్చే గుర్రలపై పందెం కాయటం.

కళ్ళు తిరుగుతున్నట్లనిపించింది శివానికి ఆ అంకెలు చూస్తుంటే.

డబ్బు...

డబ్బు...

డబ్బు...

కష్టపడకుండా వేలకు వేలు

కళ్ళుబైర్లు కమ్మినట్లనిపించి ముందుకు తూలాడు శివం... గణేష్ భుజాన్ని ఆసరాగా చేసుకున్నాడు.

ఎటుచూసినా జనంహెూరు... గుసగుసలు... కేకలు...

శివానికి అర్థం కానివాటిని వివరిస్తున్నాడు గణేష్. అదో వింత ప్రపంచం మాయా ప్రపంచం...

సరిగ్గా మూడు గంటలైంది.

గేట్స్ తెరుచుకున్నాయి. అప్పటివరకూ కళ్ళాలు బిగించి కంట్రోలు చేస్తున్న జాకీల చేతుల్లోంచి గుర్రాలు రివాల్వర్‌లోంచి వెలువ



ర్థ బుల్లెట్లలా ముందుకు దూకాయి.

పంటర్స్ (పందెగాళ్ళు) జాతకాలను మార్చే అదృష్టచిహ్నాలా గుర్రాలు...

గేలరీల్లోంచి కేకలు... అరుపులు... విన్నపాలు...

"కమాన్... కమాన్ ఐసే"

"రన్... రన్... స్పీడప్"

ఎలుగెత్తి అరుస్తున్నాడు గణేష్... అర్థంకాకపోయినా అతనికి జతగా శివం కూడా అరుస్తున్నాడు.

మొత్తం ఎనిమిది గుర్రాలు. "ఛాంపియన్... విక్టరీ... విన్నర్... కార్నర్... బెస్ట్... జూలీ నక్సెస్ బుల్లెట్" వాటి పేర్లు.

విజయం కోసం ఒకదాన్ని మించి ఒకటి పరుగెడుతున్నాయవి. కాదుకాదు ... ప్రాణాలకు తెగించి పరుగెత్తిస్తున్నారు జాకీలు.

వేలాది పంటర్స్ అదృష్టాల్ని నిర్ణయించే కర్తలా గుర్రాలు. సామాన్యులకు ఆశజూపి వారి భవిష్యత్‌లకు సమాధులు కట్టే క్రీడ అది. ప్రభుత్వం చేత లైసెన్స్ తీసుకున్న జూదగృహాలవి.

పదిపదిహేను రోజులుగా రేస్‌బుక్ దగ్గర పెట్టుకుని రేసుల్లో పాల్గొనే గుర్రాల వంశవృక్షాలూ, జాతి, వాటి వేగం, వయసు, ట్రైనర్, జాకీల వివరాలు, బరువు... అతను గతంలో గెల్చిన వివరాలు... అన్నీ క్షుణ్ణంగా పరిశీలించి తమ అదృష్టాన్ని పరీక్షించుకోదలచుకున్న పంటర్స్...

. నిజంగా అదో వింత ప్రపంచం.

దీపం చుట్టూ తిరిగే శలభాలకు తెలును అవే తమకు ఆఖరిక్షణాలని అయినా తిరుగుతూనే ఉంటాయి. మంటల్లో చిక్కుకుని మాడి మసి అవుతూనే ఉంటాయి. రేస్‌క్లబ్‌లోకి ఎంటరయ్యే ప్రతి వ్యక్తికీ తెలును. అది ఒక జూదగృహమనీ, అక్కడకు అడుగుపెట్టడమంటూ జరిగితే అవే తమ అభివృద్ధికి ఆఖరి క్షణాలని.

అయినా అడుగుబెడుతూనే ఉంటారు.

కారణం

ఆశ...

ఆశ...

దురాశ...

అత్యాశ...

కష్టించకుండానే లక్షలు సంపాదించాలనే దురాశ...

ఒక్కసారే ఐశ్వర్యంలో తులతూగుతూ అందలం ఎక్కాలనే అత్యాశ...

తను గెలిచినా తనలాంటి మరో సామాన్యుడు ఓడిపోకతప్పదనీ... తను అందలం ఎక్కటానికి మరో సామాన్యుడి బతుకును సోపానాలుగా చేసుకోవాలని ఆరాటపడుతున్నాననీ... పంటర్ ఎన్నటికి గ్రహిస్తాడో...

క్షణాలు గడిచేకొద్దీ గాలరీలో కేకలు ఎక్కువయ్యాయి...

అభ్యర్థనలు... అర్థింపులు... హెచ్చరికలు...

ఎవరు పందెం కాసిన గుర్రాల పేర్లతో వాళ్ళు అరుస్తున్నారు.

"కమాన్... ఛాంపియన్ కమాన్..."

"కమాన్ కమాన్ విక్టరీ..."

"విన్నర్ కమాన్... కమాన్ ఐసే..."

ముందు పరుగెడుతూన్న గుర్రం క్షణాలు గడిచేకొద్దీ వెనకబడుతోంది. వెనకున్నది ముందుకురుకుతూంది.

అంతా అయోమయం... గందరగోళం... ఏదిముందో... ఏది వెనుకో... ఎవరి అదృష్టం ఎలా ఉందో అంతా అర్థం కాని సంకటస్థితి.

మొత్తం దూరం 1400 మీటర్లు...

వంద... రెండు... నాలుగు... ఎనిమిది... దూరం తరుగుతోంది వేగంగా.

శివం కళ్ళుమెరిశాయి... అతను బెట్‌కాసిన విక్టరీ... అన్ని గుర్రాలను అధిగమించి వేగాన్ని పుంజుకుంది.

విన్‌పోస్ట్‌ను దాటింది విక్టరీ.

ఇరవై రూపాయల పెట్టుబడితో వంద రూపాయలను గెల్చుకున్నాడు శివం... ఆశ్చర్యంతో నమ్మలేకపోయాడతను.

ఇది కేవలం ప్రారంభం మాత్రమే...

ఆ తర్వాత రెండో రేసులో ముప్పైరూపాయలను నష్టపోయాడు. తిరిగి మూడో రేసులో





లాభం... నాలుగో రేస్‌లోనూ లాభమే... అయిదో రేస్‌లో కొంత నష్టం. చివరకు నాలుగువందల లాభం మిగిలిందతనికి. తను పదిరోజులు ఉద్యోగం చేస్తే అంత డబ్బు సంపాదించగలడు. కేవలం ఓ పూటలో అతి సులభంగా అంత మొత్తాన్ని సాధించాడు.

ఈసారి ఆటో పిలవటం నామోషి అనిపించి టాక్సీ పిలిచాడు గణేష్.

ఫాల్స్ ప్రిస్టేజ్...

శివం కళ్ళముందు రంగుల వలయాలు తిరుగుతున్నాయి...

'ఏనాటికైనా తను జాక్‌పాట్ సాధిస్తాడు. కాంతం కలలన్నీ నెరవేరుస్తాడు'

సుమంగళి షోరూం ముందు టాక్సీదిగి మూడువందలు పెట్టి భార్యకు ఓ చీర కొన్నాడు శివం.

కొత్తచీరను చూడగానే ఆరాత్రి కాంతం కళ్ళల్లో కనిపించినంత సంతోషం ఆ నాలుగేళ్ళల్లో ఎన్నడూ చూడలేదతను. అప్పుడే ఓ నిశ్చయానికొచ్చాడు. ప్రతీవారం రేసులాడైనా సరే కాంతాన్ని సంతోషపర్చాలి.

ఇప్పుడు శివంకూడా అశ్వమేధయాగంలో ఓ సభ్యుడయ్యాడు. ముందు కొంతకాలంపాటు అన్నీలాభాలే కనిపించాయతనికి. మరో రెండుసార్లు కాంతానికి చీరలు కొన్నాడు. టేబుల్‌ఫాన్ కొత్తది తెచ్చాడు. అప్పుడప్పుడు నష్టం వస్తున్నా సాధించిన లాభాల్లో బేరీజు వేసుకుని తృప్తిపడుతూ వచ్చాడు. ఫలితంగా అప్పులపాలయ్యాడు. దొరికిన చోటల్లా చిల్లరఅప్పులు చేస్తూ వచ్చాడు.

ఇలాంటి పరిస్థితుల్లో ఓ రోజు ఆదివారం మధ్యాహ్నం...

సుడిగాలిలా దూసుకొచ్చాడు గణేష్.

"ఏం జరిగింది?" కంగారుగా అడిగాడు శివం.

"మేడప్ రేసెస్ జరుగుతున్నాయట" ఆయాసంతో వగరుస్తూ చెప్పాడు గణేష్.

"అంటే?" అర్థంగాక అడిగాడు శివం.

"ఈరోజు జరుగబోయే రేస్‌లో ఎందుకూ పనికిరాదనుకుంటున్న గుర్రాన్ని గెలిపించబోతున్నారట" ఉక్కిరిబిక్కిరవుతూ చెప్పాడతను.

ఆ మాటల సారాంశం శివానికి అర్థంకావటానికి రెండునిముషాలపైనే పట్టింది.

"అదెలా... సాధ్యం?"

"సాధ్యమే... గుర్రాల ఓనర్స్, జాకీలు కుమ్మక్కయితే అది సాధ్యమే. ఫస్ట్ వస్తుందని అందరూ భావిస్తున్న గుర్రాన్ని ఓడగొడతారు. నాలుగో ప్లేస్‌లోనో, అయిదో ప్లేస్‌లోనో వస్తుందనుకున్న గుర్రాన్ని గెలిపిస్తారు. అదే మేడప్ రేసెస్ అంటే. ఈరోజు ఇదే జరుగబోతోంది. బ్లూమూన్ అనే గుర్రాన్ని ఓడించి స్కైవాకర్ అనేదాన్ని గెలిపిస్తున్నారు" చెప్పాడు గణేష్.

అప్పటికి కుదుటపడ్డాడతను.

"అందువలన లాభం?" విస్మయంగా అడిగాడు శివం. రేసుల్లో ఇలాంటి మోసాలుకూడా ఉంటాయని తెలిసింతర్వాతకూడా వాటిపట్ల విరక్తి కలగటానికి బదులు అతని ఆసక్తి రెట్టింపైంది.

అతనివైపు జాలిగా చూశాడు గణేష్.

"అమాయకుడా... ఇంకా అర్థంకాలేదా అందరూ బ్లూమూనే గెలుస్తుందనే ఉద్దేశంతో లక్షలాది రూపాయలను దానిపైనే పందెం కాస్తారు. స్కైవాకర్‌పై ఎవరూ కాయరు. గెలిచే అవకాశాలు బాగా ఉన్న బ్లూమూన్‌లాంటి గుర్రాలకు కేవలం ఆఫ్ టైమ్, వన్‌టైమ్ మాత్రమే ఇస్తారు. కానీ స్కైవాకర్‌లాంటి గుర్రాలు అసలు గెలవలేవనే ఉద్దేశంతో హండ్రెడ్ టైమ్స్, థౌజండ్ టైమ్స్ కూడా ఇస్తారు. కానీ ఎవరూ పందెం కాయరు. చూస్తూచూస్తూ తమ డబ్బును ఎవరు పోగొట్టుకుంటారు. ఇదే పాయింట్ మీద ఈరోజు అద్భుతం జరుగబోతోంది. బ్లూమూన్ ఓడిపోతుంది; స్కైవాకర్ గెలుస్తుంది. బ్లూమూన్‌పై పందెం కాసినవాళ్ళంతా జుట్టు పీక్కుంటారు. స్కైవాకర్‌పై పందెం కాసిన దాని ఓనర్‌కు లక్షల్లాభం వస్తుంది. కొంత భాగాన్ని బ్లూమూన్‌ని ఓడించినందుకు దాని జాకీకి ఇస్తాడు... ఇదీ మేడప్ రేసెస్ అంటే"

స్తబ్దుడయ్యాడు శివం. రేసెస్ వెనుక ఇలాంటివి కూడా జరుగుతాయా.

"ఈ విషయం నీకెలా తెలుసు?"




"స్కైవాకర్ జాకీ నా ఫ్రెండ్‌కు ఫ్రెండ్. అతనిద్వారా ఈ విషయం తెల్సింది"

"మనమిప్పుడేం చేయాలి?" ఉత్సుకతతో అడిగాడు శివం.

"అమాయకుడా- ఇంకా అర్థంకాలేదా... మనం ఓ ఇరవైవేలు స్కైవాకర్‌మీద కాశామనుకో హండ్రెడ్‌టైమ్స్ అంటే ఇరవై లక్షలొస్తుంది"

షాక్‌తిన్నట్లు మొహంపెట్టాడు శివం.

"ఇ.. ర.. వై.. ల.. క్ష.. లు"

"ఓ మైగాడ్... అంతడబ్బా?"

గుండెలపై చేయేసుకున్నాడతను.

"ఇరవై వేలెక్కణ్నుంచి తేవాలి. నాదగ్గర పైసాకూడా లేదే. నీ దగ్గరుందా?" అడిగాడు శివం.

"నా దగ్గరుంటే ఇక్కడికెందుకొస్తాను?"

"మరెలా?"

"నువ్వే ఆలోచించు"

"ఊడ్చి తంతే నాదగ్గర పదిరూపాయలు దొరుకుతాయి. పోనీ వాటితో సరిపెట్టుకుందాం."

"తెలివుండే మాట్లాడుతున్నావా... ఇలాంటి ఛాన్సు జన్మలో ఓసారికూడా రాదు. కేవలం వెయ్యిరూపాయల రాబడితోటే సరిపెట్టుకుందామా. ఆలోచించు. నువ్వు తలుచుకుంటే ఇరవైవేలేం ఖర్మ... ముప్పై కూడా తేగలవు"

"నేనా?"

"అవును... నువ్వే"

"ఎలా... నాకర్థంకావట్లేదు. వివరంగా చెప్పు"

"తిన్నగా ఆఫీస్‌కెళ్ళి ఐరన్‌సేఫ్ తెరవటం ద్వారా" తాపీగా చెప్పాడు గణేష్.

అదిరిపడ్డాడు శివం.

"ఆఫీస్ డబ్బా?"

"కొంపలేం అంటుకుపోవు. నెలాఖరుకు గదా అకౌంట్స్ చెక్ చేసేది. ఇంకా పదిరోజులుంది. మళ్ళీ రేపు ఉదయం ఆఫీస్‌కెళ్ళినప్పుడు ఆ డబ్బును యథాస్థానంలో పెట్టేస్తాం"

"ఆఫీస్ డబ్బు తీయడం తప్పుకదూ?"

"తప్పా తప్పున్నర... ఆలోచించు. రేపు ఉదయమే తిరిగి ఆ డబ్బును బీరువాలో పెట్టెయ్యొచ్చు.ఒకటా రెండా ఇరవైలక్షల్లాభం. అప్పుడీ దరిద్రపు ఉద్యోగాలు చేయాల్సిన అవసరం మనకు లేదు. చెరో పదిలక్షలు పంచుకుని వ్యాపారాలు చేసుకోవచ్చు. మంచి ఇల్లు కొనుక్కోవచ్చు" భవిష్యత్తును రంగు రంగుల్తో అతని కళ్ళముందు పరుస్తున్నాడు గణేష్.

"కానీ..."

"కానీ లేదు అర్ధనా లేదు. అనవసరపు సందేహాలతో ధనలక్ష్మిని దూరంచేయకు. అయినా ఇందులో భయపడాల్సిన అవసరమేం ఉంది. ఈరోజు ఆదివారం. ఆఫీస్‌కు సెలవు. ఏదో తాళాలు మరిచిపోయాననే మిషతో ఆఫీస్‌కెళ్ళి డబ్బు తీసుకుంటావు. రేపు ఉదయానికల్లా తిరిగి ఆఫీస్‌లో పెట్టేస్తావు... అంతే"

"అం... తే.. నం.. టా.. వా?"

"అంతే అంతే.. త్వరగా పద- టైమవుతోంది" విసుగ్గా చెప్పాడు గణేష్.

శివం, గణేష్‌లు బయలుదేరుతుండగా ఏదో పేరంటానికి కాంతంను ఆహ్వానించాలని ఎదురయ్యారు నలుగురు ముత్తయిదువులు.

"శుభ శకునం" అంటూ అస్పష్టంగా శివం చెవిలో గొణిగాడు గణేష్.

ఆఫీస్ ముందు రిక్షా దిగుతున్న శివం, గణేష్‌లవైపు ప్రశ్నార్థకంగా చూశాడు వాచ్‌మెన్. అప్పటికే వణుకుతున్నాడు శివం శరీరంనిండా చమట్లుపట్టాయి. "కీస్ మరిచిపోయాను... వాటికోసం" అరిచేత్తో నుదుటికి పట్టిన చమటను తుడుచుకుంటూ అస్పష్టంగా చెప్పాడు శివం.

ఓసారతనివైపు ఎగాదిగా చూసి డోర్ తెరిచాడు వాచ్‌మన్. గబగబా లోపలికెళ్ళారు ఇద్దరూ.

ఆఫీసంతా నిశ్శబ్దంగా ఉంది. టేబుల్స్, కుర్చీలు, బీరువాలు మౌనంగా చూస్తున్నాయి జరుగుతున్న విపరీతాన్ని.

తన సీట్ పక్కనున్న ఐరన్‌సేఫ్ దగ్గర ఆగి బయటకు చూశాడు శివం. బీడీ దమ్ముకొడుతూ రోడ్‌వైపు చూస్తున్నాడు వాచ్‌మన్.

"త్వరగా కానివ్. టైమవుతుంది." విసుగ్గా అన్నాడు గణేష్.

వణుకుతున్న చేతుల్ని అదుపులో పెట్టుకుంటూ బీరువా తెరిచాడు శివం. పై అరలో ఫైల్స్, రెండో అరలో పాతరికార్డులు, మూడో అరకున్న సేఫ్‌ను ఓపెన్ చేశాడు. నీట్‌గా దొంతర్లుగా కనిపించాయి అంతకు ముందు రోజు అతను పేర్చిన నోట్ల కట్టలు.

"ఎంత తీయమంటావ్?" నోట్లకట్టలను తాకుతూ అడిగాడు శివం.

"నీ యిష్టం. మనకెంత కావాలంటే అంత తియ్. ఇరవైవేలు తీశామనుకో చెరో పదిలక్షలొస్తుంది ఆలోచించుకో."

రెండు వందల రూపాయల నోట్లకట్టలను తీసి ఫాంట్ జేబుల్లో సర్దుకున్నాడు శివం. బీరువా డోర్స్ క్లోజ్‌చేస్తూ "పద" అన్నాడు.

అప్రసన్నంగా మొహం పెట్టాడు గణేష్. "సిరి తలుపు తట్టుంటే అడ్డు చెప్పటం భావ్యం కాదు. ఇలాంటి అవకాశం జన్మలో ఇకరాదు. రాకరాక వచ్చిన ఇలాంటి అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలే గాని ఆఫ్టాల్ పది లక్షల్తోనే సరిపెట్టుకోవాలా! పది లక్షల్తోనే మన జీవితం సాఫీగా గడిచి పోతుందా. ఒకేసారి మరో పదిలక్షలు కూడా సంపాదిస్తే వీటన్నింటికీ స్వస్తిచెప్పి గానుగెద్దులాంటి ఈ బోడి ఉద్యోగానికి విడాకులిచ్చి హాయిగా కాలుమీద కాలేసుకుని బ్రతకొచ్చు. భగవద్గీతలోని శ్రీ కృష్ణపరమాత్మలా గీతోపదేశం చేశాడు గణేష్.

మరో మూడు కట్టల్ని తీసుకుని బీరువా క్లోజ్‌చేశాడు శివం. అతని చేతులు వణుకుతున్నాయి. పెదవులు అదురుతున్నాయి. కామ్‌గా బయటకు నడిచారిద్దరు.

మరో ఇరవై నిమిషాల తర్వాత రేస్‌క్లబ్ ముందున్నారు. ఫస్టరేస్‌లో పాల్గొనే గుర్రాల వివరాలను పరిశీలించారు. అందులో బ్లూమూన్, స్కైవాకర్‌లు లేవు. రెండో రేస్‌లో ఉన్నాయి.

మొదటి రేస్‌లోని ఓ గుర్రం మీద కాలక్షేపానికన్నట్లు చెరో యాభై రూపాయలను కట్టి, రెండో రేస్‌లోని స్కైవాకర్ మీద మిగిలిన మొత్తాన్ని కట్టి క్లబ్‌లోకి ఎంటరయ్యారు.

అనరికే క్లబ్ కోలాహలంగా ఉంది. మొదటి రేస్ ప్రారంభం కావటానికి కేవలం పది నిముషాలే వ్యవధి ఉండటంతో వాతావరణం ఉత్కంఠభరితం గానూ ఉంది.

ఫస్టరేస్ ప్రారంభమైంది.

పంటర్స్ అరుపులు.. కేకలు.. ఆర్తనాదాలు.. అభ్యర్థనలు మిన్నుముట్టాయి.

నిశ్శబ్దంగా చూస్తున్నాడు శివం. అతనికి రేస్ ఏమాత్రం ఇంట్రెస్ట్‌ను కలిగించటం లేదు. అతని దృష్టంతా సెకండ్ రేస్‌మీద ఉంది. ఇక్కడే జరిగిందో అద్భుతం. పంటర్స్ అంచనాల్ని తారుమారు చేస్తూ శివం బెట్‌కాసిన గుర్రం గెలిచి శివానికి ఆరొందల లాభాన్ని తెచ్చిపెట్టింది.

"నేముందే చెప్పానుగా.. శుభశకునమని" ఆనందంతో తబ్బిబ్బవుతూ కామెంట్ చేశాడు గణేష్.

మరో ఇరవై నిముషాల తర్వాత రెండో రేస్ మొదలైంది.

"కమాన్ కమాన్ బ్లూమూన్"

"కమాన్ బ్లూమూన్ కమాన్ ఐసే"

బ్లూమూన్‌పై బెట్‌కాసి అరుస్తూన్న పంటర్స్ వైపు జాలీగా చూశాడు శివం. అతనికి పెద్దగా నవ్వాలనిపించిందా క్షణం.

గుర్రాలు వేగంగా పరుగెత్తుతున్నాయి.

పది, యాభై, వంద విన్ పోస్ట్ దూరం తరుగుతూంది వేగంగా.

నెలరోజుల క్రితం తను పాతికవేలను గెల్చి కలర్ టి.వి, ఫ్రిజ్‌లతో ఇంట్లోకి అడుగుపెట్టినప్పుడు కాంతం కళ్ళల్లో కనిపించిన మెరుపు స్పష్టంగా గుర్తుందతనికింకా.

రెండొందలు, మూడొందలు, నాలుగు పంటర్స్ అంచనాలను తారుమారు చేస్తూ బ్లూమూన్‌ని అధిగమించింది స్కైవాకర్. శివం కళ్ళు తళ తళ మెరిశాయి. అతని భుజాన్ని నొక్కి విదిలాడు గణేష్. షడన్‌గా రేస్‌క్లబ్ గాలరీలో నిశ్శబ్దం అలుముకుంది. బ్లూమూన్ పై బెట్‌కాసిన వేలాది పంటర్స్ జరుగుతున్న దాన్ని జీర్ణించుకోలేక పోతున్నారు.

అయిదు, ఆరొందల మీటర్లు బ్లూమూన్ కన్నా అయిదారడుగుల ముందే ఉంది స్కైవా





కర్.

ఆనందంతో ఉక్కిరిబిక్కిరవుతూ గాల్లో తేలి పోతున్నాడు శివం. ఉత్సాహంతో అతని వీపు చరిచాడు గణేష్.

ఆ దెబ్బతో ఈ లోకంలో పడ్డాడు శివం.

ఇంతలోనే హఠాత్తుగా అరుపులు, కేకలు విన్పించటంతో ఊహాలోకంలోంచి పూర్తిగా వాస్త వంలోకొచ్చాడు శివం. ఎదురుగా కనిపించిన దృశ్యం అతని నవనాడులను కృంగతీసింది.

విన్‌పోస్ట్ మరో వంద మీటర్ల దూరంలో కనిపిస్తూంది.

శివం కలలను కల్లలు చేస్తూ స్కైవాకర్‌ను వెనకేసింది బ్లూమూన్.

క్షణాలు గడుస్తున్నాయి వేగంగా.

విన్‌పోస్ట్ దాటింది బ్లూమూన్.

అదిరిపడుతూ పక్కకు చూశాడతను.

గణేష్ కనిపించలేదక్కడ, అతనెప్పుడో జా రుకున్నాడు.

ప్రపంచమంతా గిర్రున తిరుగుతున్నట్లని పించింది శివానికి. కళ్ళముందు రెపరెపలా డుతూ కనిపించాయి యాభైవేలు.



సాయంత్రం అయిదైంది...

స్నానంచేసి తెల్లచీర కట్టుకుని... మల్లెపూ లు పెట్టుకుని శుభ్రంగా తయారై... గుమ్మం దగ్గర ఎదురు చూస్తోంది పావని. సరిగ్గా క్రిందటి సంవత్సరం ఇదేరోజున ఆమె పెళ్ళై ంది... తొలిమారేజ్‌డే... ఉదయం సుందరం బ్యాంక్ కెళ్ళేప్పుడే గుర్తు చేసిందా విషయా న్ని... 'సాయంత్రం త్వరగా వస్తాను... పిక్చర్ కెళ్దాం... రడీగా ఉండు'... చెప్పి వెళ్ళాడు సుందరం.

ఇంటర్ పాసైంది పావని. ఆమెది పెద్దలు కుదిర్చిన వివాహం అనే కంటే ప్రేమ వివాహం అంటే బావుంటుందేమో! ఒకే వీధిలో ఉంటు న్న పావని వైపు ఆకర్షితుడయ్యాడు సుందరం. కులాలు కూడా ఒకటే కావటంతో ధైర్యం చేశా డు. ముందుగా ఆమె అంగీకారాన్ని పొంది... ఆ తర్వాత ఆమె తల్లిదండ్రులతో సంప్ర దించాడు... కాణీకట్నం లేకుండా రత్నంలాంటి అల్లుడు... ఆనందంగా ఒప్పుకు న్నారు పావని తల్లిదండ్రులు. కట్నంలేదని సుందరం తండ్రి ముందు అభ్యంతరపె ట్టినా... సుందరం తీవ్రంగా పట్టుబడటంతో... దిగిరాక తప్పలేదు.

సంవత్సరంనుంచీ పావని సంసారం మూ డు పూలు... ఆరుకాయలుగానే ఉందని చెప్పొ చ్చు. ఈమధ్య... అంటే నెలరోజులుగా సుంద రంలో ఏదో మార్పును పసిగట్టింది పావని. ఇదీ అని స్పష్టంగా చెప్పలేని మార్పది... అడగా లంటే ఫీలింగ్... గిల్టీకాన్షస్ ... సుందరంపట్ల ఆరాధనే కాకుండా అపారగౌరవం కూడా ఉంది పావనికి. లక్షలకు లక్షలు కట్నం గుంజుతున్న ఈ రోజుల్లో సుందరం పైసా కూడా కట్నంగా తీసుకోకపోవటంవల్ల ఏర్పడిందది.

ఇదివరకు ఖచ్చితంగా అయిదున్నరకల్లా ఇంటికొచ్చే సుందరం... ఈమధ్య అప్పుడప్పు డు లేట్‌గా వస్తున్నాడు... ఒక్కోసారి అర్ధరాత్రి దాటిం తర్వాతే... ఏవేవో కారణాలు చెప్తున్నా డు... మనిషి కంఠంలో... పెదవుల్లో తడబాటు స్పష్టంగా కనిపిస్తూంది. తప్పు చేసినప్పుడే ఆ తడబాటు కనిపిస్తుందని పావని నమ్మకం.

ఏదో స్కూటర్ శబ్దం వినపడ్డంతో ఊహ ల్లోంచి ప్రస్తుతానికొచ్చి ముందుకు చూసింది.

భర్త స్కూటర్ కాదది... ఎవరిదో సిమెంట్ కలర్ స్కూటర్.

పావని వైపు చూస్తూ చిరునవ్వులు చిందిస్తూ సాగాడా స్కూటర్ వాలా... అది గమనించ లేదు పావని. తిరిగి ఆలోచనల్లో మునిగిపో యింది.

పావనిది చాలా సున్నితమైన వ్యక్తిత్వమని చెప్పొచ్చు. అల్పసంతోషి... చిన్నకారణానికే

అమితంగా బాధపడుతుంది. స్వల్ప విషయానికే పొంగిపోతుంది. సెపరేట్‌గానున్న పోర్షన్ వాళ్ళది. ఎక్స్‌టెన్షన్ ఏరియాకావటంతో అక్కడొకటి... అక్కడొకటిగా విసిరేసినట్లున్నాయి ఇళ్ళు. సిటీల్లో ఉండే రణగొణధ్వనుల్లేని ప్రశాంత వాతావరణం.

మళ్ళీ వినిపించింది. స్కూటర్ చప్పుడు... ఉల్లిక్కిపడి తలెత్తింది పావని అదే సిమెంట్ కలర్ స్కూటర్... సరిగ్గా పావని తలెత్తి అటు చూసిన క్షణంలోనే స్కూటర్‌వాలా కూడా ఆమె వైపు చూసి... చిరునవ్వులు చిందిస్తూ చేయి ఊపాడు.

చివ్వుక్కుమంది పావని హృదయం...

'ఇడియట్' కసిగా తిట్టుకుంటూ లోపలికెళ్ళింది... అయినా ఎంతో సేపుండలేకపోయిందక్కడ... సాయంత్రం అయిదున్నరకే వస్తానని చెప్పి ఎంతసేపటికీ రాని భర్త గురించే ఆలోచిస్తూ తిరిగి గుమ్మంలోకొచ్చింది పావని. నిముషాలు వేగంగా గడుస్తున్నాయి... సుందరం వస్తున్న జాడేలేదు.

పొద్దువాలిపోతోంది... క్షణాలు గడిచేకొద్దీ చీకట్లు ముసురుకుంటున్నాయి... ఆమె మనసులోలాగే. నిరాశగా నిట్టూరుస్తూ వెనుదిరగబోయింది పావని...

సరిగ్గా అదే క్షణంలో...

బర్ర్... మంటూ వచ్చి ఆమె ఇంటి ముందాగింది స్కూటర్. దిగి స్టాండ్ వేసి ఆమెను సమీపించాడతను... భర్తకాదు... అంతకు ముందు ఆమెవైపు చూసి చేయి ఊపిన సిమెంట్ కలర్ స్కూటర్ వాలా.

తీక్షణంగా చూసిందతని వైపు పావని.

"ఎక్స్క్యూజ్‌మి మిస్... దాహంగా ఉంది దయచేసి మంచినీళ్ళిస్తారా?" అతని చూపులు అసభ్యంగా ఆమె శరీరాన్ని శల్యపరీక్ష చేస్తున్నామాటలు మాత్రం సంస్కారయుతంగానే ఉన్నాయి.

ఓ క్షణం తటపటాయించింది. ఆమె ఒంటరి మనసు అతనికి మంచినీళ్ళివ్వటానికి తిరస్కరించింది. సభ్యత... సంస్కారాలు మాత్రం ఆ భావాన్ని బయటపెట్టలేకపోయాయి.

"ఒక్క నిముషం!" అని లోపలికెళ్ళి మంచినీళ్ళ గ్లాసుతో తిరిగొచ్చింది పావని. అప్పటివరకూ ఇంటివాసాలు లెక్కపెడుతూన్న అతను ఆమె రాకతో దృష్టి మరల్చి గ్లాసందుకున్నాడు... కావాలనే చేతివేళ్ళను ఆమె మునివేళ్ళకు తగిలించాడు...

చిరాకుగా చూసిందతని వైపు పావని.

'బిడ్డకు స్తన్యమిస్తున్న తల్లిలో సైతం సెక్స్‌ను చూడగలిగే ఈ సమాజంలో అతనూఓ భాగమే.

"థాంక్యూ మిస్" గ్లాసును రిటర్న్‌చేసి వెనుదిరిగాడతను...

"నాట్ మిస్... మిసెస్ పావనీ సుందరం..." సరిచేసింది పావని.

చురుక్కున ఆమెవైపు చూసి స్కూటర్ స్టార్ట్ చేశాడతను... అయిదారు క్షణాల్లో మలుపు తిరిగి మాయమైందది.

దీర్ఘంగా నిట్టూర్చి లోపలికెళ్ళింది పావని.

సరిగ్గా ఆ క్షణంలో... ఆమె తలపుల్లో కదలాడ్తున్న సుందరం...

విశాలమైన హాలు... ఫ్లోరోసెంట్ లైట్లతో పట్టపగల్లా ఉంది... అక్కడొకటి... అక్కడొకటిగా విసిరేసినట్లు మొత్తం ఆరురెండు టేబుళ్ళున్నాయా హాల్లో. ప్రతీ టేబుల్ చుట్టూ ఆరు కుర్చీలు... నిండుగా రకరకాల వ్యక్తులు.

పేరు మోసిన క్లబ్బది- ధంకా పలాసా దగ్గర్నుంచి రమ్మీవరకు... ఒక్కు రూపాయి నుంచి పదిరూపాయల వరకు... అన్నిరకాల గేమ్‌లు జోరుగా సాగుతున్నాయక్కడ... డబ్బు క్షణక్షణానికీ చేతులు మారుతూంది. బ్రాందీ... విస్కీ... రమ్ లాంటి లిక్కర్ వర్షపు నీరులా పారుతూంది.

ట్రేల్లో రకరకాల లిక్కర్ బాటిల్స్‌తో, గ్లాసుల్తో, సోడాల్తో హడావుడిగా తిరుగుతున్నారు బాయ్‌లు. ఎలాంటి గొడవలు జరక్కుండా పర్యవేక్షిస్తున్నాడు మానేజర్ కం ప్రొప్రైటర్ ఆనందరావు.

పేకాడ్డమంటే పరమ అసహ్యం ఆనందరావుకి కానీ అదే అతని జీవనాధారం...

క్లబ్ బయట రకరకాల వాహనాలు పార్క్ చేసున్నాయి. స్కూటర్ల దగ్గర్నుంచీ కార్లవ





రకూ. కాపలాగా ఓ వాచ్‌మన్.

ఓ టేబుల్ దగ్గర కూర్చొనున్నాడు సుందరం... ఓ చేతిలో పేకముక్కలు... మరో చేతిలో సగం ఖాళీ చేయబడ్డ విస్కీ గ్లాను...

"ఛా..." అంటూ కార్డ్సును టేబుల్‌పై పరిచి గ్లాను ఖాళీ చేసి పక్కన పెట్టాడు సుందరం... అతని ముందు కుప్పలా వచ్చిపడ్డాయి రకర కాల టోకెన్స్. వాటి విలువ పది... ఇరవై... యాభై... వందరూపాయలు.

సర్వం కోల్పోయి దివాళా తీసిన వాళ్ళు తుఫాన్ బాధితుల్లా మొహాలు వేలాడేసుకుని బయటకు నడుస్తున్నారు. గెలుస్తున్న వాళ్ళు మాత్రం ఆనందంతో కేరింతలు కొడ్తున్నారు.

ఎంతకూ రాని సుందరం గురించే ఆలోచి స్తూ కాలుగాలిన పిల్లిలా ఇంట్లోకి... బయటికీ తిరుగుతూంది పావని.

ఎవరింట్లోనో ఉన్న గోడ గడియారం "ఠంగ్... ఠంగ్..."మంటూ గంటలు కొట్టింది. అప్రయత్నంగా లెక్కపెట్టింది పావని.

"ఒకటి.. రెండు.. మూడు.. ఆరు.. ఎని మిది.. తొమ్మిది"

ఉలిక్కిపడిందామె. కంగారు ప్రవేశించింది మనసులోకి.

ఆ క్షణంలోనే నేనున్నానంటూ ఆవు లించింది ఉదరంలోంచి ఆకలి. స్పెషల్‌గా చేసిన పిండివంటలు ఆమె కొరకు ఎదురు చూస్తున్నాయి వంటగదిలో.

విడిగా కాపురం పెట్టిపనప్పట్నుంచీ భర్తతో కలిసితప్ప ఏరాత్రీ ఒంటరిగా భోంచేయలే దామె. ఆలోచిస్తూ సోఫాలో కూర్చుంది.

భర్త రాకకొరకు ఎదురుచూస్తూ తలుపులు వేయటం కూడా మరచి కళ్ళుమూసుకుని ఆలోచిస్తూండిపోయింది పావని.

ఆమెకు తెలీకుండానే, ఆమె ప్రమేయం లేకుండానే నిద్రాదేవత ఆవహించిందామెను.

'ఎన్ని నిముషాలు గడిచాయో, గంటలే గడిచాయో'?

సుందరం మాత్రం ఆమె విషయం పూర్తిగా మరిచిపోయి ఆటలో లీనమై పోయాడు. డి న్నర్‌కూడా అక్కడే పూర్తయింది. అర్ధరాత్రి పన్నెండును సూచిస్తూ గంటలు కొట్టింది క్లబ్ లోని గోడగడియారం.

పావని ఇంటి ముందాగింది సిమెంట్ కలర్ స్కూటర్.

స్కూటర్ దిగి స్టాండ్ వేశాడతను.

ఓ నిముషం అక్కడే నిల్చుని పరిసరాలను పరికించాడు.

ఎక్కడ్నుంచో వినిపిస్తున్న ఊరకుక్కల అరుపులు తప్ప నిశ్శబ్దంగా ఉంది వాతావ రణం. నగరమంతా నిశీధిలో కప్పబడుంది. ఒక్క పావని ఇల్లు తప్ప. తలుపులు బార్లా తెరిచున్నాయి. మధ్య గదిలో సోఫాలో కూర్చొను న్న పావని స్పష్టంగా కనిపిస్తూంది.

తలపంకిస్తూ లోపలి కడుగుపెట్టాడతను.

పైన సీలింగ్ ఫాన్ ఫుల్ స్పీడ్‌తో తిరుగు తూంది. నిద్రలో కదలికల వల్ల ఆమె అందాల ను కప్పుతూ భుజం మీదుండాల్సిన పైట కర్తవ్యం మరచిపోయిన ప్రభుత్వోద్యోగిలా సోఫా మీద విశ్రాంతి తీసుకుంటూంది. రేగిన ముంగురులు ఫాన్‌గాలికి నుదుటిమీద అల్లల్లా డుతూ ఆమె మొహానికి వింత అందాన్నిస్తు న్నాయి. ఏదో మధురమైన కలగంటున్నట్లు ఆమె పెదవులు విరిసీ విరియని పూవులా విచ్చుకొనున్నాయి.

తమకంగా ఆమె వైపు చూస్తూ సమీపించా డతను.

ఎన్నాళ్ళగానో ఆమెపై ఏర్పరచుకున్న కాంక్ష స్పష్టంగా కనిపిస్తూందతని కళ్ళల్లో.

ముందుకు వంగాడతను. ఆమె లేత పెద వులపై తన కరకు పెదవులనుంచాడు. ఆ కాస్త స్పర్శకే ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది పావని.

అత్యంత సమీపంలో ఓ పురుషాకారం.

వర్తమానానికొచ్చేసరికి ఆమెకి నాలుగైదు క్షణాలపైనే పట్టింది.

"హేయ్.. ఎవరు నువ్వు?" కంగారుగా అరుస్తూ చేతుల్తో అతన్ని నెడుతూ సోఫాలోంచి లేచింది పావని.

కంగారుగా వెనక్కి తూలాడతను.

అప్పుడు గుర్తు పట్టిందతన్ని పావని.

'సిమెంట్ కలర్ స్కూటర్‌వాలా!'

"ప్లీజ్ కాదనకు. కోర్కెతో కాగిపోతున్నాను" తమకంగా అంటూ ముందుకు దూకి పావని చేతుల్ని గట్టిగా పట్టుకుని కౌగలించుకోబోయాడతను.

"వదులు దుర్మార్గుడా మర్యాదగా వదలకుంటే గట్టిగా అరుస్తాను. నలుగురూ వచ్చి దేహశుద్ధి చేస్తారు" గింజుకుంటూ అంది పావని.

నవ్వాడతను.

"ప్రొసీడ్. అందువలన నీకే నష్టం. నువ్వే ఆహ్వానించి ఇప్పుడు ప్లేటు ఫిరాయిస్తున్నావని వచ్చిన వాళ్ళందరితో చెబ్తాను"



నిర్ఘాంతపోయింది పావని.

ఏంచేయాలో పాలుపోలేదు ఓ క్షణం.

ఆ క్షణాన్ని సద్వినియోగం చేసుకోవాలని ప్రయత్నిస్తూ ఆమె మొహాన్ని దగ్గరకు లాక్కున్నాడతను.

ఆ క్షణంలో

కసుక్కున అతని చేతిని కొరికింది పావని.

"అమ్...మ్మా" అంటూ భీకరంగా అరిచి ఆమెని విడిచిపెట్టాడతను.

చటుక్కున ముందుకు పరుగెత్తి టేబుల్‌పై

నున్న పండ్లు కోసుకునే చాకునందుకుని పావని

"అడుగు ముందుకేస్తే చంపేస్తా" చాకు చూపిస్తూ కాళికలా గర్జించింది.

క్షణంలో పరిస్థితి తారుమారైనందుకు నిశ్చేష్టుడయ్యాడతను.

"ఆడదంటే అంత అలుసటరా నీకు. అక్కచెళ్ళెళ్లు లేరా, నిన్ను కని పెంచింది కూడా ఆడదేరా... మైండిట్" అర్చింది పావని.

ఉక్రోషంగా పెదవి కొరుక్కుంటూ నిష్క్రమించాడతను.

తలుపులు బిగించి ఏడుస్తూ కూలబడింది పావని.

చెప్పకుండా ఎక్కడకో వెళ్ళి ఎంతకూ తిరిగిరాని భర్త..

ఓ పరాయి మగాడి దౌర్జన్యం..

ఆవేదన కన్నీళ్ళ రూపంలో పొంగింది.

అంతలో

"టక్‌టక్" మంటూ తలుపు తట్టిన శబ్దం

కళ్ళు తుడుచుకుంటూ తలుపును సమీపించింది.

అంతలోనే ఏదో సందేహం.

"ఎవరూ?" అంటూ ప్రశ్నించింది.

"నే..ను..సుంద..రాన్ని"

భర్త కంఠస్వరాన్ని గుర్తించి తలుపు తెరిచింది పావని.

ఆ క్షణం వరకూ నిగ్రహంగా నిల్చున్న సుందరం సత్తువ కోల్పోయినట్లు ముందుకు తూలి ఆమెపై బడ్డాడు. గుప్పుమంది భయంకరమైన దుర్వాసన. అతని కనురెప్పలు వాలిపోతున్నాయ్. బలవంతంగా ఆమె వైపు చూడాలని ప్రయత్నిస్తున్నాడతను.

దుర్వాసనను భరిస్తూ కంపరంగా చూసింది పావని.

"ఏమండీ"

"ఊఁ" అన్నాడు సుందరం స్టడీగా నిల్చోవాలని ప్రయత్నిస్తూ.

గతంలోకూడా నాలుగైదుసార్లిలానే తాగి వచ్చాడతను. ఓసారి ఫ్రెండ్స్ బలవంత చేశారనీ, మరోసారి ఫ్రెండ్ పుట్టినరోజనీ ఏవో ఎక్స్‌ప్లనేషన్సిచ్చాడు.

ఉబికివస్తున్న కన్నీళ్ళను బలవంతంగా అదుముకుంటూ బెడ్‌రూంలోకి నడిపించుకెళ్ళింది.

"భోజనం" అడిగింది పావని. అతన్ని బెడ్‌పై పడుకోబెట్టి బూట్లు విప్పుతూ...

"నేను... చే...సే...వ...చ్చా...ను" చెప్పాడతను పావనిని మీదకు లాక్కుంటూ. అతన్నుంచి వస్తున్న వాసన భరించటం కష్టంగా ఉందామెకు.

"ప్లీజ్ వదలండీ" విడిపించుకోవాలని ప్రయత్నించింది పావని.

"ఊ హు" అంటూ మీదకు లాక్కుని ఆమె పెదవులపై ముద్దుపెట్టుకుంటూ తనకేసి హత్తుకున్నాడు.

మూగగా రోదించిందామె.

భార్యాభర్తల మధ్యనున్న సున్నితమైన బంధం బీటలు వారడానికి ఇంతకన్నా పెద్ద కారణాలు అక్కర్లేదు.

★ ★ ★

తూరుపు వేపున్న కిటికీలోంచి చొచ్చుకొచ్చిన సూర్యకిరణాలు చురుక్కుమనిపించటంతో ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు సుందరం. టీపాయ్‌పై కాఫీకప్ పెట్టి వెళ్తున్న పావని కనిపించింది. చటుక్కున కళ్ళు మూసుకున్నాడతను.

కళ్లు తెరవాలంటే గిల్టీగా ఉందతనికి. తలంతా దిమ్ముగా కూడా ఉంది. రాత్రి తాగిన విస్కీ తాలూకు మత్తు వదలిపెట్టి బ్రతుకలేనని నటించే ప్రియురాలిలా ఇంకా అతని అంటిపెట్టుకునే ఉంది. పావని మొహం చూడాలంటే సిగ్గుగా కూడా అనిపించింది. అది భయం కాదు. తప్పుచేసి ఆత్మీయులముందు దొరికిపోతే కనిపించే ఫీలింగ్.

నిన్నటికి ఇవాల్టికీ తేడా స్పష్టంగా కనిపిస్తూందతనికి.

నిన్న

ప్రాతఃకాలన్నే నిద్రలేచి తలస్నానం చేసింది పావని. తడి ఆరని కురులను అతని మొహంపై విదిలించింది. పూలజల్లులా





అతని మొహాన్ని తాకి మేల్కొలుపు పాడాయి నీటితుంపర్లు.

అభిమానం, ఆప్యాయతతో కూడిన మేలుకొలుపది.

నిన్న తమ జీవితంలో గుర్తుంచుకోదగ్గరోజు. తొలి మారేజీడే.

అంతకుముందు ఎవరికి ఎవరో ముక్కూ మొహం తెలీని తమిద్దరు పోయిన సంవత్సరం ఇదేరోజున దంపతులయ్యారు. ఒకరికొకరు ఆలంబనగా ప్రాణంలో ప్రాణంలా శరీరాలు వేరైనా మనసులొకటే అన్నట్లుగా కలిసిపోయారు.

కాని తనేం చేశాడు. సాయంత్రం త్వరగా వస్తాను. పిక్చర్‌కెళ్దాం రడీగా ఉండమని ఆశలురేపి అర్ధరాత్రి తాగి మరీవచ్చాడు.

సినిమాకు తీసుకెళ్ళకపోతే మానె. కనీసం పెందళాడే అయినా వచ్చుండాల్సింది.

కళ్ళు తెరిచి మంచంమీద లేచి కూర్చున్నాడు సుందరం. పొగలుకక్కుతూంది కాఫీ పావని మనసులానే.

చిన్నప్పట్నుంచి బెడ్ కాఫీ అలవాటతనికి. కప్‌చేతిలోకి తీసుకుని కాఫీ సిప్‌చేశాడు. చేదుగా అన్పించింది కాఫీ. కప్ టేబుల్‌పై పెట్టి బెడ్ దిగాడు. బ్రష్ చేతపట్టుకుని టవల్ భుజంమీద వేసుకుని బాత్‌రూంలోకి నడిచాడు. మధ్యలో ఎదురైంది పావని. అతనివైపు చూడ్డం ఇష్టంలేనట్లు తలవంచుకుని మౌనంగా పక్కకు తప్పుకుంది. తేలు కుట్టిన దొంగలా చరచరా బాత్‌రూంలో వెళ్ళాడు.

మౌనంగానే అతని స్నానానికి వేడినీళ్ళు సిద్ధం చేసింది పావని. ఎప్పుడూ గలగలపారే సెలయేరులా సందడిగా ఉండే పావని అలా గంభీరంగా మౌనంగా ఉండటం భరించలేక పోతున్నాడతను.

స్నానం ముగించి డ్రస్‌చేసుకుని డైనింగ్ రూంలోకి అడుగుపెట్టాడు సుందరం. ఆ సరికే టిఫిన్ రెడీచేసుంది.

పావని సాధారణ గృహిణే అయినా పరిస్థితులను విశ్లేషించి అర్ధంచేసుకోగల తెలివైన యువతి. రాత్రి భర్త తాగివచ్చినందుకు అతనిపై కక్ష సాధించలేదు. ప్రత్యక్షంగా పోరాటానికీ దిగలేదు. తన నిరసనను మౌనం ద్వారానే చూపించింది.

టిఫిన్ తిని చేతులు కడుక్కుంటూ పిల్చాడు సుందరం

''పావనీ''

మౌనంగా వెనక్కి తిరిగింధి

''అయాం సారీ'' తలొంచుకుని మెల్లగా చెప్పాడు సుందరం.

'' ...... ''

''పావనీ... ప్లీజ్.. అయాంసారీ.'' సిగ్గుపడ్తూనే చెప్పాడు.

అతనివైపు దృష్టి సారించింది పావని. తలొంచుకొనున్నాడతను. ఓ క్షణం జాలిగా అతనివైపు చూసింది. అంతలోనే రాత్రి జరిగిన సంఘటన మనసులో మెదిలి కటువుగా మారిపోయింది.

''శరీరాన్ని గాయపరచి సారీ చెపితే సర్దుకోవచ్చు.. బట్.. ఎన్నివేల సారీలు చెప్పినా మనసుకు తగిలిన గాయం మాసిపోదు..'' కటువుగా అంది పావని.

'ఆ ఒక్కమాట చాలు అభిమానమున్న మగాడు మారటానికి!'

దెబ్బతగిలిన పక్షిలా గిలగిల్లాడాడు సుందరం. అంతగా కదిలించాయతన్ని ఆ మాటలు.

''సారీ పావనీ.. పొరపాటు జరిగిపోయింది. నా తప్పు ఒప్పుకుంటున్నాను. నువ్విలా మౌనంవహించటం నేసహించలేను. ప్లీజ్ మాట్లాడు పావనీ..'' పశ్చాత్తాపం పడ్తున్నవాడిలా అన్నాడు సుందరం.

పావనికి తెలుసు.. ఏ విషయాన్నైనా తెగేవరకూ లాగకూడదనీ.. భర్త అనేవాడు పిడికిట్లోని ఇసుకలాటివాడని.. కంట్రోల్ చేయాలని పిడికిలి బిగించినకొద్దీ వేళ్ళ సందుల్లోంచి జారిపోయే ఇసుకలా అతను పట్టుతప్పిపోతాడనీ చదివిందామె.

''మీ మాటలు నిజాలా.. నీటిమీది రాతలా..?'' అనుమానంగా చూస్తూ అడిగింది పావని.

''నన్ను నమ్ము పావనీ. నీమీదొట్టు..'' దృ

ఢంగా అంటూ ఆమెను దగ్గరకు తీసుకున్నాడు సుందరం.

"చూస్తా.. ఎంతవరకు మాటమీద నిలబడగలరో?"

"నీ నమ్మకాన్ని వమ్ముచేయను.." అంటూ ఆమెనుదురు చుంబించి కదిలాడతను.

అతన్నే చూస్తూ తొలినాటి అతని మనఃస్థితిని ఈనాటితో పోల్చుకుని ఆలోచిస్తూంది.

తొలిరోజు

గదిలోకేతెంచిన తనను గాఢపరిష్వంగనలో బంధించాడు. ముద్దుల వర్షం కురిపిస్తూ నా ప్రాణం.. నా గమ్యం.. నా లక్ష్యం సర్వం నీవేనన్నాడు. కరిగిపోయిందా ప్రేమవెల్లువలో తను.. తననతడు ఎంతగా ఆరాధించకపోతే.. పెద్దలనొప్పించి కట్నకానుకలను తృణీకరించి తనను వివాహమాడతాడని మైమరచి సర్వస్వం అర్పించింది.

అలసిన శరీరాలు సేదదీరటానికై ఎన్నో కబుర్లు చెప్పాడు.

"ఈ రోజు.. మన జీవితంలో మరపురాని రోజు మన జీవన ప్రయాణంలో తొలిరోజు. శరీరాల్తోపాటు మనసులను కూడా ముడిపెట్టుకోవల్సినరోజు" అన్నాడతను. అంగీకారసూచనగా అతని గుండెల్లో ఒదిగిపోయింది తను.

"పావనీ.. కబుర్లు చెప్పు. నీకెలాంటి భర్త రావాలని పెళ్ళికి ముందు కలలుకన్నావో చెప్పు" ఆమె కురుల్తో ఆడుకుంటూ అడిగాడతను. సిగ్గుతో మరింత ముడుచుకుపోయిందామె.

"ఇది కాదు సమాధానం. నీనోటితో చెప్పాలి" గుసగుసగా అన్నాడతను.

"తాగుడు.. పేకాట.. సిగరెట్స్.. రేసులు.. వ్యభిచారంలాంటి వ్యసనాలులేని భర్త కావాలనుకున్నాను. అందం గురించి ఆస్తిగురించి ఏ క్షణమూ ఆలోచించలేదు" రెండు నిముషాల తర్వాత గునుస్తూ చెప్పిందామె.

ఎందుకో ఆ క్షణంలో ఆమెకు తండ్రి గుర్తొచ్చాడు. తిండినైనా మరచేవాడుకాని తాగుడు మాత్రం మరచేవాడు కాదు. తల్లి నెప్పుడూ హింసించేవాడు. అప్పట్నుంచీ పావని మనసులో తాగుబోతులంటే భయం... అసహ్యం...

ఆమెను మరింత గాఢంగా హత్తుకున్నాడు సుందరం.

"మీరు.... మీరెలాంటి భార్య కావాలనుకున్నారు?" సిగ్గుతోనే అయినా పెదవి విప్పింది పావని.

"నీలాంటి భార్య...." అంటూ ఆమెను ఆక్రమించుకున్నాడతను.

"పావనీ... కల్తీలేని అధరామృతముండగా... విస్కీ, బ్రాందీ లెందుకు. అపరూపలావణ్యాలకు నిలయమైన నీ చెంత మైమరచి పోతున్నప్పుడు వేరే ఆలోచనల్తో పనేముంది. నీ నల్లని కురులతో కాలక్షేపముండగా... వేరే పేకలెందుకు... రేసులెందుకు..." తన్మయత్వంగా అంటూ ఆమెను అల్లుకపోయాడు సుందరం.

ఆనాటి అతని ప్రవర్తన మనసులో మెదిలి భారంగా నిట్టూర్చింది పావని.

"ఎందుకొచ్చిందతనిలో ఈ మార్పు...?!'

★ ★ ★

ఫైల్స్ మూసేస్తున్న సుందర్గాన్ని సమీపించాడు 'పార్థు'.

"వెళ్దామేంటి?"

"ఇవాళ నేరావటంలేదు" చెప్పాడు సుందరం ముక్తసరిగా.

"అదేం...?!" బర్రున కుర్చీని లాక్కుని కూర్చుంటూ విస్మయంగా అడిగాడు పార్థు.

"నా మూడ్ బాగోలేదు" అసలు కారణాన్ని చెప్పటం ఇష్టంలేక విషయాన్ని దాటేశాడు సుందరం.

"ప్లీజ్ గురూ... నాకోసమైనా రావాలి. నీది లక్కీహాండ్ గురూ. నీకోసం కాకపోయినా నా కొరకు ఆడు..." బ్రతిమిలాడాడు పార్థు.

"సారీ పార్థూ. నేనికరాను. ఆటను మరచిపోవాలనుకుంటున్నాను..." ఖచ్చితంగా చెప్పాడు సుందరం మనసులో పావని కదలాడ్తూండగా.

మంకుపట్టు పట్టాడు పార్థు. 'ఈమధ్య వారం నుంచీ నా అదృష్టం బాగోలేక పదివేల పైనే పోయాయి గురూ. ఇదే ఆఖర్రోజు. నా బదులు నువ్వాడిపెట్టు. ఈ రోజైనా గెలవక





# ఏరిన ముత్యాలు

## స్నేహమేరా జీవితం

★ బుద్ధిహీనుల స్నేహం, అహంభావం కలవారి ప్రేమ, నీటిమీద గీతల్లాంటివి. నిలవవు. కనబడవు.

--గురునానక్

★ జలబిందువులన్నీ చేరి సాగరమైనట్లు మైత్రితో స్నేహసాగరం సృష్టించవచ్చు. ప్రతిమనిషి పరస్పర మైత్రితో వ్యవహరించినట్లయితే ప్రపంచాన్నే మార్చవచ్చు.

--గాంధీజీ

★ చీకట్లో దారి చూపేది నేస్తం; కళ్ళు తలకెక్కితే దింపేది నేస్తం; మనలోని లోపాలు తెలిపేది నేస్తం; నిజమైన మనిషిగా నిలిపేది నేస్తం.

--దాశరథి

★ నీకు వందమంది మిత్రులు వున్నా తక్కువే. కానీ ఒకే ఒక శత్రువు వున్నా ఎక్కువే.

★ తాను ఇచ్చింది మరచిపోయి, తీసుకున్నది మాత్రం గుర్తుంచుకోగలగడమే స్నేహం.

--డ్యూమెన్

★ స్నేహితుని కోసం ప్రాణాన్నిసహితం ధారపోయటం ఏమంత కష్టమైన పనికాదు; కానీ ఆ త్యాగానికి అర్హుడైన స్నేహితుడు దొరకడమే కష్టం.

-- హేమర్

★ మీకు సంపద వున్నప్పుడు మీ దోషాలు చెపుతూ, కష్టకాలంలో మనసారా చేయూతనిచ్చేవాడే నిజమైన స్నేహితుడు.

--రేస్ స్మిత్

★ సంపద స్నేహితులను సృష్టిస్తే, కష్టాలు వారిని పరీక్షిస్తాయి.

--ఎనన్

★ డబ్బున్న మిత్రుని ఇంటికి పిలిస్తేనే వెళ్ళు. కానీ పేదమిత్రుని ఇంటికి పిలవకుండానే వెళ్ళు.

--పోర్చుగల్ సామెత.

★ జంతువులంత మంచి మిత్రులు దొరకడం కష్టం. అవి ప్రశ్నలడగవు. మనల్ని విమర్శించవు.

--జార్జి ఇలియట్

★ కయ్యం, వియ్యం, నెయ్యం సమానస్థాయివారితోనే చెయ్యాలి.

--హితోపదేశం

---

సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ

పోతే నాకు ఆత్మహత్యే శరణ్యమంటూ ప్రాధేయపడుతున్న పార్థునిచూసి కరిగిపోయాడు సుందరం.

పార్థుతో క్లబ్బులోకడుగుపెట్టాడు.

★ ★ ★

"హలో ఫ్రెండ్ హౌ ఆర్ యూ...?" క్లబ్‌లో పేకాడుతున్న సుందరాన్ని పలుకరించాడో వ్యక్తి.

"ఫై...న్..." అంటూ అతన్ని తేరిపారచూశాడు సుందరం. ఎవరో గుర్తురావటంలేదు. ఎక్కడో చూసినట్లు మాత్రం అనిపిస్తూంది.

"మీరు నన్ను గుర్తుపట్టినట్లు లేదు. అయాం రాకేష్. చక్రవర్తిగారి బర్త్‌డే పార్టీలో కలుసుకున్నాం. అప్పుడే మరచారా..." చనువుగా అన్నాడతను.

"యస్...యస్...యు ఆర్ రాకేష్. సారీ ఫ్రెండ్. చూసింది ఒక్కసారే కావటంచేత మరిచిపోయాను. మీరు హెడ్డాఫీసులో చేస్తున్నారు కదూ?" నొచ్చుకుంటూ పరామర్శించాడు సుందరం.

"థాంక్ గాడ్... గుర్తుపట్టారు" హాయిగా అన్నాడు రాకేష్ ఓ కుర్చీని లాక్కుని అతని పక్కనే ఆసీనుడవుతూ.

"షో" అంటూ కార్డ్సును టేబుల్‌పై పరిచి "బాయ్" అంటూ కేకేశాడు సుందరం.

"యస్సర్..." వినయంగా పలికాడు బాయ్.

"చెప్పండి మిస్టర్ రాకేష్. ఏం తీసుకుంటారు. సాఫ్ట్ ఆర్ హాట్...?" ఫ్రెండ్లీగా అడిగాడు సుందరం.

"వాతావరణం వేడిగా ఉంది సాఫ్ట్ చెప్పండి"

"ఓ కళ్యాణీ వట్రా" ఆర్డరిచ్చాడు సుందరం చేతిలోనున్న గ్లాసు ఖాళీచేస్తూ.

ఎలాంటి వారితోనైనా ఇట్టే కలిసిపోగల తత్త్వం రాకేష్‌ది. పది నిముషాల్లోనే సంవత్సరాల పరిచయమున్న సన్నిహితుడ్లా కలిసిపోయాడు. దిన దిన ప్రవర్ధమానమైంది వారి స్నేహం. అయిదారోజుల్లోనే ప్రాణస్నేహితుల య్యారిద్దరూ.





"మొదలజూచిన కడుగొప్ప పిదప కురుచ; ఆది కొంచెము తర్వాత అధికమగుచు తనరు; దినపూర్వ పరభాగ జనితమైన ఛాయ పోలిక; కుజన సజ్జనుల మైత్రి. (చెడ్డవారితో మైత్రి ఉదయపునీడలాగా మొదట పొడవుగా ఉండి, క్రమంగా క్షీణిస్తుంది. మంచివారితో స్నేహం సాయంత్రం నీడలాగా మొదట చిన్నదిగా ఉండి క్రమక్రమంగా పెరుగుతుంది. అంటే చెడ్డవారు ఎంత తొందరగా చేరువౌతారో అంత తొందరగా దూరమౌతారు, మంచివారి మైత్రి క్రమేణా అభివృద్ధి చెందినా స్థిరంగా ఉంటుంది)" అన్న భర్తృహరి సుభాషితానికి జీవంపోశారు సుందరం, రాకేష్‌లు.

★ ★ ★

తూర్పున ఉదయించాల్సిన సూర్యుడు పశ్చిమాన ఉదయించినంత వైపరీత్యంగా ఆ రోజు సాయంత్రం అయిదున్నరకు స్కూటరాపి దిగుతున్న భర్తవైపు విస్మయంగా చూసింది పావని.

గత రెండు మూడు నెలల నుంచీ భర్త ప్రవర్తనకు యాంత్రికంగా తయారైంది పావని. చెప్పి చెప్పి ప్రాధేయపడి విసిగి వేసారింది. తన బ్రతుకింతేననుకుని ప్రాణమున్న శవంలా అయింది. అదే క్షణంలో ఆగిన సిమెంట్ కలర్ స్కూటర్‌ను దిగుతున్న అతన్ని నివ్వెరపోతూ చూసింది పావని.

"అతను.... అతను.... ఆనాడు ఒంటరిగానున్న తనను కబళించాలని ప్రయత్నించిన ధూర్తుడు..."

"కమాన్ మిస్టర్ రాకేష్ ఇదే మా ఇల్లు..." చిరునవ్వుతో అంటున్న భర్త మాటల్ని ఆలకించి నిశ్శబ్దంగా లోపలికి తప్పుకుంది పావని.

"రాకేష్... ప్లీజ్ టేక్ యువర్ సీట్..." అంటూ ఓ కుర్చీని చూపించి... మరో కుర్చీలో తను కూర్చుని బూట్లు విప్పుకుంటూ "పావనీ" అంటూ కేకేశాడు సుందరం.

నిశ్శబ్దంగానే వచ్చింది పావని.

"రాకేష్.... మై వైఫ్ పావని. పావనీ.... మీట్ మై ఫ్రెండ్" అంటూ పరిచయాలు గావించాడు సుందరం.

మొహం చిట్లించింది పావని.

"నమస్తే సిస్టర్..." చేతులు జోడించి

అంటూన్న అతనివైపు తృణీకారంగా చూసింది పావని.

"పావనీ... కాఫీ పట్రా..."

వినురుగా లోపలికెళ్లింది పావని.

అయిదు నిముషాల తర్వాత "ఏమండీ..." అంటూ లోపల్నుంచి పిలిచింది పావని. "ఎక్స్యూజ్ మి ఫ్రెండ్" అంటూ లోపలికెళ్లాడు సుందరం.

"ఏమిటి?"

"కాఫీ... మీ ఫ్రెండ్‌కివ్వండి" ఫ్రెండ్ అనే పదం దగ్గర కాస్త ఒత్తిపలుకుతూ వెటకారంగా అంది పావని.

ఆమె అభిప్రాయాన్ని తప్పుగా అర్థంచేసుకున్న సుందరం.

"పావనీ... హి ఈజ్ మై క్లోజ్ ఫ్రెండ్... పైగా నిన్ను సిస్టర్ అని పిలిచి బ్రదర్‌లాంటి వాడయ్యాడు. అతని దగ్గర నువ్వు బిడియపడాల్సిన అవసరం లేదు. నేనిస్తే అతను ఫీలవుతాడు.... ప్లీజ్ నువ్వే తీసుకురా" నచ్చచెబుతున్నట్లుగా చెప్పాడు.

"మీకు తెలీదండీ... అతనూ..." అంటూ ఆ రోజు అతను చేసిన అకృత్యాన్ని తెలీపరచ ప్రయత్నించిన ఆమె మాటల్ని మధ్యలో ఖండిస్తూ అన్నాడు సుందరం.

"పావనీ... హి ఈజ్ ఎ జంటిల్‌మన్. నూటికో కోటికో ఒక్కరుంటారు. రాకేష్‌లాంటి పెద్దమనుషులు. అలాంటి వ్యక్తిదగ్గర నువ్వు సందేహిస్తున్నావంటే నిన్నెలా అర్థంచేసుకోవాలో అర్థం కావట్లేదు... భర్తగా చెబుతున్నాను తీసుకురా..." అని బయటకెళ్లాడు సుందరం.

నిర్ఘాంతపోయింది పావని. రాకేష్‌పట్ల అతని అభిప్రాయానికి. కన్నీళ్ల పర్యంతమైంది. అతను భర్త హృదయంలో ఎంతగా పీఠం వేసుకున్నాడో అర్థమవుతూంది. ఈ పరిస్థితుల్లో అతని గూర్చి చెప్పినా వినడు. పైగా తననే నిందిస్తాడు. భర్త గురించి తనకు తెలుసు. 'తావట్టిన కుందేటికి మూడే కాళ్లనే రకం'.

కన్నీళ్ళు దిగమ్రింగుకుంటూ రాకేష్‌కు కాఫీ కప్పందించింది పావని.

తన స్థితికి నిశ్శబ్దంగా కుమిలిపోయింది. 'భగవాన్ ఇలాంటి స్థితి పగవాని క్కూడా రానీయకు' అంటూ ప్రార్థించింధి.

'తనపై అత్యాచారం చేయ యత్నించిన తనికి తనే మర్యాద చేయటం...?'

ఆ రాత్రి భర్త మూడ్ సరిగా ఉన్నప్పుడు రాకేష్ గురించి హెచ్చరించ మరోసారి ప్రయత్నించింది.

ఆమె ప్రయత్నాన్ని ఆదిలోనే ఖండించాడు సుందరం.

"పావనీ అతను నిన్నెంతగా అభిమానిస్తున్నాడో తెలుసా ఎప్పుడో చనిపోయిన అతని చెల్లెలి పోలికలు నీలో కనిపించాయట 'తన చెల్లెలు కూడా బ్రతికుంటే నీలా ఉండేది కదా! అని కళ్ళనీళ్ళు కూడా పెట్టుకున్నాడు తెలుసా?'

భర్త మాటలకు నిశ్చేష్టురాలైంది పావని.

రెండు రోజుల తర్వాత...

ఆరోజు సాయంత్రం

సుందరం రాకేష్ కలిసే వచ్చారు. రాకేష్ చేతిలో ఓ పాకెట్ కూడా ఉంది. వార్ని చూసి లోపలికి తప్పుకోబోయింది పావని.

"పావనీ" మంద్రంగా పిలిచాడు సుందరం.

ఏమిటన్నట్లు మౌనంగా చూసింది పావని.

"సిస్టర్" రాకేష్ పిలుపువిని చిరాకుగా చూసింది పావని.

"సిస్టర్... ఈ రోజు నా చెల్లెలు పుట్టినరోజు. ఏనాడో నన్ను వదిలి కనిపించని తీరాలకు పయనమైపోయిన నా సోదరి పుట్టిన రోజు. ఆమె జ్ఞాపకార్థంగా ప్రతీ పుట్టినరోజునాడు ఎవరికో ఒకరికి బట్టల్ని దానం చేసేవాడ్ని. కానీ ఈ సంవత్సరం చనిపోయిన నా చెల్లెలు మీలో సాక్షాత్కరించింది. మీరు ఈ చీర కట్టుకుంటే నా చెల్లెలే బ్రతికొచ్చి చీరకట్టుకున్నంతగా సంతోషిస్తాను. ఈ అన్నయ్య కోర్కె తీర్చరూ" అంటూ నీరు నిండిన కళ్ళతో ఆమెవైపు చూశాడతను.

అతని నటనకు విభ్రాంతురాలైంది పావని. శిలావిగ్రహంలా చూస్తూండిపోయింది-

"సందేహిస్తావేం పావనీ అతను మంచి మనసుతో ఇస్తున్నప్పుడు తిరస్కరించటం



మర్యాదనిపించుకోదు''

భర్తవైపు చూసింది పావని అమాయకంగా ప్రోత్సహిస్తున్నాడతను. రాకేష్‌వైపు దృష్టి సారించింది. కపటంగా నవ్వుతున్నాయతని నేత్రాలు.

"ప్లీజ్ సిస్టర్ నన్ను నిరాశపరచకండి'' ఓ అన్నలా అభ్యర్థించాడు రాకేష్.

"పావనీ మూర్ఖంగా ఆలోచించకు అన్నలేని నీకు ఓ అన్నలా అతనిస్తున్న కానుకని తిరస్కరించకూడదు''

భర్త బలవంతపెట్టడంతో ఆ పాకెట్‌నందుకుంది పావని. వేలకొలది తేళ్ళూ లక్షల పాములూ శరీరంపై పాకినట్లు జలదరించిందామె శరీరం. అయినా నిస్సహాయంగా లోపలి కెళ్ళింది.

కబుర్లలో పడ్డారు సుందరం రాకేష్‌లు.

చరచరా కిచెన్‌లోకి వెళ్ళి మండుతున్న 'స్టౌ'పై పడేసిందా చీరను. మౌనంగా రోదించ సాగింది. మండుతోంది చీర. క్షణాల్లో బూడిదైందది. నిశ్శబ్దంగా స్రవిస్తూన్న ఆమె కన్నీళ్ళు చెంపలపైంచి పాకి ఆ బూడిదను తాకాయి.



ఆ మరునటి రోజు తన నిజస్వరూపాన్ని ప్రదర్శించాడు రాకేష్.

పావని ఒంటరిగా నున్న సమయం చూసి అడుగుపెట్టాడతను.

"ఆయనింట్లోలేదు'' మొహంమీద కొట్టినట్లు చెప్పి వెనక్కి తిరిగింది పావని.

"నేనాయనకోసం రాలేదు బ్యూటీ. కేవలం నీకోసమే వచ్చాను'' తాపీగా అంటూ ఓ కుర్చీలాక్కుని కూర్చున్నాడు.

"మర్యాదగా మాట్లాడ్డం మంచిది'' హూంకరించింది పావని.

"నీ దగ్గర నేర్చుకుందామని వచ్చాను. నీ లేత పెదవుల్లో మర్యాదని- మెత్తటి రొమ్ముల్లో సభ్యతని- పిడికిట ఇమిడే నడుముతో సంస్కారాన్ని నేర్చుకోవచ్చాను డియర్-'' ఉన్మాదిలా పెట్రేగిపోతున్నాడతను.

ఆడనాగులా బుసకొట్టింది పావని.

"ఛీ సిగ్గులేదు- సోదరీ అని పిలిచిన నోటితో ఛండాలపు కూతలెలా కూస్తున్నావురా దౌర్భాగ్యుడా- మీ అమ్మను కూడా ఇలాగే తలుస్తావటరా నీచుడా- నువ్వు ఒక మనిషివేనా?'' ఛీత్కారంగా చూస్తూ గర్జించింది.

ఒక్క క్షణం నల్లగా వాడిపోయిందతని మొహం. క్షణంలోనే సర్దుకుని నవ్వాడు.

"పొరపడుతున్నావు పావనీ. ఇదంతా నీ కోసమే. రంకు బొంకు దాగవన్నారు పెద్దలు- అందుకే ముందు జాగ్రత్తలు తీసుకున్నాను. ఈ క్షణంలో మనిద్దరం ఒకే బెడ్‌మీదున్నా నీ భర్త అనుమానించని విధంగా అతన్ని హిప్నటైజ్ చేశాను'' ఓ క్షణమాగాడు.

అతని ప్రవర్తనలోని పరమార్థాన్ని వివరిస్తూంటే శిలా విగ్రహంలా వింటూండిపోయింది పావని.

మనుషుల్లో ఇలాంటి నీచులు కూడా ఉంటారని ఊహించటానిక్కూడా మనస్కరించలేదామెకు. మస్తిష్కం మొద్దుబారుతూంది.

"కమాన్ డియర్ ఉపేక్షించకు ఆలస్యం అమృతం విషమన్నారు. సమయాన్ని వృథా చేయటం నీలాంటి వివేకుల లక్షణంకాదు. నీ భర్త ఇప్పుడిప్పుడే రాడు కూడాను. అలా షికారుగా క్లబ్‌కెళ్ళి పేకాడి డ్రింక్ చేసి ఎప్పుడో అర్ధరాత్రికొస్తాడు నిన్నేం సుఖపెట్టగలడు- రా... నీకు అమర సుఖాలు రుచి చూపిస్తా'' కుర్చీలోంచి లేచి ఆమెని సమీపించాడతను-

"ఫట్'మంటూ అతనూహించని వేగంతో అతని చెంపపై బలంగా చరిచింది పావని.

నిశ్చేష్టుడయ్యాడతను. తీక్షణంగా ఆమె వైపు చూశాడు

"రాస్కెల్'' పళ్ళు పటపటా కొరికింది పావని. గెటవుట్- ఐసే గెటవుట్ ఫ్రం హియర్.





నా భర్త రాకముందే వెళ్ళిపో అతనొచ్చాడంటే నీ ప్రవర్తన విని ముక్కలు ముక్కలుగా నరికిపో గులు పెడ్తాడు'' గర్జించింది పావని.

నవ్వాడతను.

''నీ భర్తా'' నిర్లక్ష్యంగా విరగబడి నవ్వాడు. 'అతనిప్పుడు మనసావాచా నా బందీ. నేనిలా చేశానని నీవు చెవినిల్లుకట్టుకుని చెప్పినా నమ్మలేని అమాయకవ్యక్తి. నన్ను నీ సోదరుడి గానే భావిస్తున్నాడతను. అతనెదురుగా నిన్ను నేను ముద్దుపెట్టుకున్నా.. ఓ అన్న తన చెల్లె ల్ని దగ్గరకు తీసుకుంటున్నాడని భ్రమిస్తాడే తప్ప అనుమానించడు. అలాతీర్చిదిద్దానత న్ని.. నా కౌగిట్లో బందీ కావటం తప్ప నీకు వేరే గత్యంతరం లేదు'' అన్నాడతను.

అదే క్షణంలో గేటుముందు స్కూటరాపి దిగాడు సుందరం. అతన్ని చూస్తూనే కాస్త రిలీఫ్ ఫీలైంది పావని.

''ఏమిటి.. అన్నాచెల్లెళ్ళిద్దరూ హాట్‌హాట్‌గా డిస్కస్ చేస్తున్నారు?'' అంటూ వస్తున్న అత న్ని ఏమనాలో అర్థంగాక విస్తుపోతూ చూసింది పావని. ఓరగా ఆమె వైపు చూస్తూ వ్యంగ్యంగా నవ్వాడు రాకేష్.

★ ★ ★

ఆ రోజు రాత్రి తన విశ్వరూపాన్ని పూర్తిగా ప్రదర్శించాడు రాకేష్.

సుందరాన్ని బాగా రెచ్చగొట్టి అతనింట్లోనే విస్కీబాటిల్ ఓపన్ చేయించాడు. అంత క్రితం నాలుగైదుసార్లు బాటిల్స్ తెచ్చుకుని ఇంట్లోనే త్రాగుతున్నాడు సుందరం. ఆ అను భవంతోనే ధైర్యం చేశాడు.

వాళ్ళిద్దరికీ గ్లాసులందిస్తూ.. సేవలు చేయ లేక గుండెలవిసేలా విలపించింది పావని. భర్త ప్రవర్తన రోజురోజుకూ మితిమీరుతుంది. ఎప్పుడూ బార్లలో తాగివచ్చే సుందరం ఈ మధ్య ఇంటికే తెచ్చుకుంటున్నాడు. ఇప్పుడు రాకేష్‌తో...?

నిముషాలు గంటలవుతున్నాయి. ఇక్కడ కూడా తన తెలివినుపయోగించాడు రాకేష్. తను మాత్రం నామామాత్రంగా పుచ్చుకుని సుందరంచేత ఫుల్‌గా తాగిస్తున్నాడు.

బెడ్‌రూంలో అసహనంగా పచార్లు చే స్తూంది పావని. అగ్నిపర్వతంలా మండు తుంది ఆమె శరీరం. ఆమె సహనానికి పరాకా ష్ట ఆనాటి సుందరం చర్య... మనసులో ఆవే దన... ఉదరంలో ఆకలి... ఆమె సహనాన్ని ప్రశ్నిస్తున్నాయి... వంటగదిలో వండిన వంటకా లు ఎదురుచూస్తున్నాయి వాళ్ళకోసం.. బయట వాళ్ళ కార్యక్రమం ఎంతకీ తెమలటం లేదు.. తాగిన నిషాలో బిగ్గరగా అరుస్తున్నాడు సుందరం.. వినోదంగా చూస్తున్నాడు రాకేష్.. అతని మనసులో ఏవేవో ఆలోచనలు... ఓర కంట పావనినే చూస్తూ.. సుందరం చేత త్రా పిస్తున్నాడు.

దాదాపు అర్ధరాత్రియ్యింది. మత్తుగా టేబు ల్‌పై వాలిపోయాడు సుందరం.. అతని కళ్ళు మూతలువడ్తున్నాయి.

''సుందరం... సుందరం...'' పిల్చాడు రాకేష్.

''ఊఁ'' అయిదు నిముషాలు కదిపింత ర్వాత భారంగా కళ్ళు తెరిచి మూలుగుతూ తిరిగి కళ్ళు మూసుకున్నాడు సుందరం.

నిశ్శబ్దంగా కుర్చీలోంచి లేచాడు రాకేష్. అతని కళ్ళల్లో కోరిక ఉవ్వెత్తున ఎగిసింది.

నిశ్శబ్దంగానే బెడ్‌రూమ్‌ను సమీపించాడు.

అర్ధరాత్రి నిశ్శబ్దంగా ఉంది వాతావరణం. ఆ ఏరియా అంతా నిదురపోతూ ఉంది. బయట సుందరం మత్తులో శవంలా పడున్నా డు. బెడ్ రూంలోకి అడుగుపెట్టాడు రాకేష్. అలసిన హృదయంతో ఆదమరచి నిద్రి స్తూంది పావని.

తమకంగా ఆమెవైపు చూశాడతను.

అస్తవ్యస్తంగా నిదురిస్తూందామె.. చీర చెంగులు చెదిరున్నాయి. ఫాన్‌గాలికి పైట అల్లల్లాడుతూ ఉంది. నిద్రిస్తున్న ఆమె అందం మరింత సెక్సీగా అనిపించిందతనికి. లైటు కాంతి ఆమె ఎర్రటి శరీరంపై ప్రతిఫలి స్తూంది. బెడ్‌ను సమీపించి ఆమె పక్కన కూర్చున్నాడతను. ఆ క్షణం వరకూ హృదయ భారంతో కుమిలిపోయి నిద్రించటంతో బాహ్యా స్మృతిని పూర్తిగా కోల్పోయిందామె శరీరం.

ఆమె చీరచెంగులపై చేయేశాడతను. స్ప ర్శకు కాబోలు పక్కకు ఒత్తిగిల్లిందామె. ఆ




మరుక్షణం ఆమె నల్లుకుపోయి తమకంతో పెదాలనందుకున్నాడతను.

ఉలిక్కిపడి కళ్ళు తెరిచిందామె. మొద్దుబారిన ఆమె మస్తిష్కానికి అతన్ని ఆనవాలు పట్టేసరికి నాలుగైదు క్షణాలు పట్టింది.

''వదులు వదులు'' అంటూ గింజుకుంది పావని.

''ప్లీజ్.. కాదనకు ఒక్కసారి'' తమకంగా అంటూ చేతుల్తో ఆమెని చుట్టేసి... పెదవులందుకో ప్రయత్నించాడు.

''దుర్మార్గుడా.. వదులు ఏమండీ ఏమండీ-'' గింజుకుంటూ భయంతో బిగ్గరగా అర్చింది పావని.

''నువ్వు పిలిచినా ఎలుగెత్తి అరిచినా వచ్చే పరిస్థితిలో లేడు నీ మొగుడు. వాడు వచ్చేంత వరకూ నన్నే నీ మొగుడనుకో'' ఉద్రేకంతో అంటూ ఆమె జాకెట్‌లోనికి వేళ్ళను జొనిపి బలంగా లాగాడు రాకేష్. 'పర్'మంటూ చినిగిందది.

''ఏమండీ... ఏమండీ'' అంటూ గుండెలవిసేలా అరిచింది పావని.

మత్తుగా కాస్త కదిలాడు సుందరం. కళ్ళు తెరవాలని ప్రయత్నించాడు. సాధ్యం కాలేదు. మెదడును పూర్తిగా మైకమావహించింది. అదే క్షణంలో ''ఏమండీ.. రక్షించండీ'' అంటూ హృదయవిదారకంగా పావని ఆక్రోశం అతని మస్తిష్కాన్ని తాకింది. కుర్చీలోంచి లేవాలని ప్రయత్నించాడు. కానీ అవయవాలు సహకరించకపోవటంతో కూలబడిపోయాడు.

''ఎందుకే నీకు కంఠశోష. ఓ క్షణం కళ్ళు మూసుకుని హాయిగా అమరసుఖాలనుభవించు-'' అంటూ ఆమె చీరచెంగులపై చేయి వేసి గట్టిగా లాగాడు రాకేష్.

కాళ్ళతో తన్నుతూ... చేతుల్తో రక్కుతూ ''వదులు.. ఏమండీ'' ఏడుస్తూ గింజుకుంది పావని...

'ఈ క్షణంలో భూమి బ్రద్దలై తనందులో కూరుకపోతే బావుండు' ననిపించింది పావనికి.

తన జీవితాన్ని కబళించ ప్రయత్నిస్తున్న రాక్షసుడు. మూర్ఖత్వంతో నిస్సహాయుడైన భర్త ఏ స్త్రీ మాత్రం సహించగలదా సన్నివేశాన్ని..

''ఏమండీ... ఏమండీ'' మత్తులో బాహ్య స్మృతిని కోల్పోయిన భర్తను స్పృహతెప్పించే ఆమె ప్రయత్నంలో ఆ గది మారుమ్రోగుతుంది ఆర్తనాదాలతో.

రాళ్ళను సైతం కరిగించే ఆ రోదన రాకేష్‌ను కరిగించలేకపోవటమే కాకుండా సుందరాన్ని కూడా కదిలించకలేకపోయింది.

''ప్లీజ్.. నా జీవితాన్ని నాశనం చేయకు... నీ సోదరిలాంటిదాన్ని'' గత్యంతరం లేక చేతులు జోడించింది పావని.

'తప్పు.. తప్పు.. నువ్వు నా అందాల రాణివి. సోదరివి కావు'' అంటూ ఆమె శరీరంపై మిగిలున్న ఆఖరి అచ్ఛాదన లంగాపై చేయేసి పెదవులను కసుక్కున కొరికాడు.

''అమ్...మ్మా''..

మత్తుగా అటూఇటూ కదుల్తున్న సుందరం హృదయాన్ని తాకిందామె ఆర్తనాదం.

కళ్ళు తెరిచి అటూఇటూ చూశాడు స్వాధీనంలోకొచ్చిన మెదడు లోపల జరుగుతున్న దుస్సంఘటన గూర్చి అతని అవయవాలకు ఆదేశాలిచ్చింది. తడబడుతూనే కుర్చీలోంచి లేచాడు. తులుతూనే ముందుక్కదిలాడు.

రాకేష్ జరుపుతున్న ఘోరకృత్యాన్ని గమనించి.. మూసుకుపోతున్న కళ్ళను తెరుస్తూ ''ఒరేయ్'' అంటూ గర్జించాడు సుందరం ఆవేశంతో...

అదిరిపడ్డాడు రాకేష్.. గుమ్మంలో సుందరం.

చటుక్కున పావని లంగానొదిలి లేచాడు.

అప్పటికి మైకం పూర్తిగా దిగిపోయింది సుందరానికి.

''ఒరేయ్.. ద్రో..హీ.. చంపుతా'' గర్జిస్తూ ఆవేశంతో ముందుకు దూకి రాకేష్ గొంతుపట్టుకున్నాడు సుందరం.

బలంగా అతన్ని వెనక్కుతోసి బయటకు పరుగెత్తాడు రాకేష్. క్షణాల్లో స్కూటర్ స్టార్టయిన శబ్దం వినిపించింది.

స్థిరంగా నిలదొక్కుకుంటూ పావని వైపు చూశాడు సుందరం.



బెడ్‌పై కూర్చుని మౌనంగా రోదిస్తూంది పావని. ఆమె కన్నీళ్ళు ధారాపాతంగా కారుతూ బెడ్‌లో ఇంకిపోతున్నాయి.

తడబడుతున్న అడుగుల్తో ముందుక్కదిలి ఆమె భుజంపై చేయేశాడు సుందరం.. తనపై తనకే అసహ్యంగా ఉందతనికి.

"ఛీ.. దూరంగా జరగండి.." గర్జించింది పావని.

చటుక్కున చేయితీసి వెనక్కి జరిగాడు సుందరం.

* * *

యధాప్రకారంగానే తూరుపుదిక్కున సూర్యుడుదయించాడు. సత్యం ఎప్పటిలా ఆలస్యంగానే ఏడుగంటలకు నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకున్నాడు. పంకజం మాత్రం సహజ విరుద్ధంగా సద్దిఅన్నం పెట్టింది.

"ఇదేమిటి?" కోపంగా చూశాడు సత్యం.

"నన్నేం చేయమంటారు. ఇంట్లో ఉన్నదిదే. మధ్యాహ్నానికి బియ్యం కూడా లేవు" ముక్తసరిగా చెప్పింది పంకజం.

సణుగుతూనే తింటూండగా పాల సీత వచ్చింది. మూడునెల్లనుంచీ ఆమె బాకీ పెరుగుతుందే తప్ప తరగలేదు.

భారీఎత్తునే దాడిచేసింది సీత. ఆమె ఆకారంలానే స్వరంకూడా పెద్దదే. ఇరుగుపొరుగు చేరారు. వినోదంలా చూస్తున్నారు. తలకొట్టేసినట్లనిపించి తలపట్టుకుంది పంకజం. సత్యం మాత్రం నింపాదిగా సర్దిచెపుతున్నాడు సీతకు.

అతని స్వరంలో మార్దవం, నమ్రత, నెమ్మది ఆమె తీవ్రతకు ఆజ్యం పోస్తున్నాయి.

"ఎప్పుడిస్తావయ్యా మూడునెలలనుంచీ కబుర్లు చెప్పటంతప్ప పైసా రాల్చలేదు. మేంమాత్రం బ్రతకాలా వద్దా?" అంటూ రుద్రకాళిలా విరుచుకపడింది.

మీనమేషాలు లెక్కింస్తూండి పోయాడు సత్యం. ఆమె వాదన్లోని వాస్తవాన్ని గ్రహించి సమాధానం గోచరించక మిన్నకుండిపోయాడు.

దాదాపు పదినిముషాలు కథాకళి చేసింది సీత. సత్యంనుంచి ప్రతిస్పందన లేకపోయేసరికి తగ్గిపోయింది. ఈసారి ఫస్ట్‌కి మొత్తంబాకీ తీర్చకపోతే మర్యాద దక్కదని వార్నింగిచ్చి వెళ్ళింది.

ఆమె నిష్క్రమించిన మరుక్షణమే ప్రత్యక్షమైన ఇంటిఓనర్‌ను గమనించి అవాక్కయ్యాడు సత్యం.

"ఏమయ్యా సత్యం, నీకిది మర్యాదగా ఉందటయ్యా?" అతను కాస్త చదువుకున్నవాడు కావటాన సంస్కారయుతంగానే యుద్ధం ప్రారంభించాడు తను.

"మరే... మరే..." నసిగాడు సత్యం.

"ఎన్ని నెలలైందయ్యా నువ్వు అద్దె ఇచ్చి"

"మరే... మూడు నెల్లైందండీ" నసిగాడు.

"ఏం చెబుతున్నావయ్యా చిలకపలుకుల్లా. మర్యాదగా నా బాకీ చెల్లించి ఇల్లు ఖాళీ చెయ్" అంటూ రంకెలేశాడతను.

అయోమయంగా చూశాడు సత్యం.

ఇంటిఓనర్ సాత్వికుడే. సుతి తప్పితేమాత్రం అతన్ని మించిన కర్కోటకుడు ప్రపంచంలో మరెక్కడా కనిపించడు.

"వచ్చే నెల్లో మొత్తం ఇచ్చేస్తానండి" ధైర్యంచేసి చెప్పాడు.

"ఇది నాలుగోసారి ఇలా చెప్పటం. ఓసారి జీతాలు రాలేదు. మరోసారి పర్స్ పోయింది. ఇలా ఎన్నిసార్లు చెప్పి తప్పించుకొంటావయ్యా. నీ వరసేం నచ్చలేదు నాకు. నీలాంటి మోసగాళ్ళు నా ఇంట్లో ఉండటానికి లేదు. రేపు ఫస్ట్‌కి బాకీ మొత్తం చెల్లించి ఇల్లు ఖాళీచెయ్" గర్జించాడతను.

చివరకు పంకజం కలుగచేసుకుని బ్రతిమిలాడుతూ సర్దిచెప్పటంతో తగ్గాడతను.

"చూతమ్మా బిడ్డలాంటి నీ మొహం చూసి తమాయించుకుంటున్నాను. ఈసారి అద్దె చెల్లించకుంటే మెడబట్టి బయటికి గెంటాల్సుంటుంది. ఖబడ్దార్" తీవ్రంగా హెచ్చరించి వెళ్ళిపోయాడు ఓనర్.

ఈరోజు ఉదయాన్నే నిద్రలేస్తూనే ఎవరి మొహం చూశాడోగాని సత్యం జాతకానికి గ్రహణం పట్టినట్లుంది. ఇంటిఓనర్ నిష్క్రమిస్తూనే కిరాణాకొట్టు రామయ్యచెట్టి ప్రత్యక్షమయ్యాడు.





సత్యం గుండె గుభిల్లుమంది అతన్ని చూడగనే.

"ఏమయ్యా సత్యం కులాసానా?" మర్యాదగానే ప్రారంభించాడు రామయ్య.

"రండి రండి... కూర్చోండి" మొహాన చిరునవ్వును పులుముకుంటూ ఆహ్వానించాడు సత్యం.

"మర్యాదలు బాగానే ఉన్నాయి. పద్ధతులే బాగోలేవు" అంటూ వచ్చి కుర్చీలో కూర్చున్నాడు రామయ్య.

మౌనంగా చూశాడు సత్యం. అతని మాటల్లోని శ్లేష బోధపడుతూనే ఉంది.

"మాట్లాడవేమయ్యా... నా బాకీ సంగతేంచేశావ్?" బొంగురుగొంతుతో గర్జించాడు రామయ్య.

"ఇ..స్తా..ను త్వరలో"

"ఎప్పుడయ్యా ఇచ్చేది. నాలుగు నెలల్నుంచీ ఇస్తూనే ఉన్నావు. నువ్వేదో మర్యాదస్థుడివనుకున్నాగానీ ఇలాంటి దగాకోరువని తెలిసుంటే నీకు బాకీ పెట్టేవాడ్నే కాదు" అంటూ విరుచుకపడ్డాడు రామయ్య.

నీళ్ళు నములుతూండిపోయాడు సత్యం.

"మనిషన్నాక మాటమీద నిలబడ్డం నేర్చుకోవాలయ్యా. నేను మంచికే మనిషిని. తిక్కరేగిందో నాలాంటి రాక్షసుడ్ని ఎక్కడా చూడవ్. ఈ నెలాఖరువరకూ టైమిస్తున్నా. నా బాకీ అణాపైసల్తో తీర్చకపోతే పరువుతో బ్రతకలేవు" స్ట్రిక్ట్‌గా వార్నింగిచ్చి కదిలాడు రామయ్యచెట్టి.

"ఏమిటండీ ఇది?" ఏడుపుగొంతుతో అడిగింది పంకజం. కంపరంగా ఉందామెకు. బ్రతుకుమీద విరక్తికూడా పుడ్తూంది.

"నీకెందుకు నోర్మూరుసుకుని పో" అందరిమీద కోపం ఆమెపై చూపించి వెనక్కి తిరిగి ఉలిక్కిపడ్డాడు సత్యం.

ఎదురుగా... త్రివిక్రమరావు.

"నాన్నా... మీరా ఎప్పుడొచ్చారు?" త్రివిక్రమరావును చూస్తూనే సత్యం గొంతులో తడారిపోయింది.

"పాలమనిషి నిన్ను శవనార్థాలు పెడ్తున్నప్పుడొచ్చాను" గంభీరంగా అంటూ లోపలికొచ్చి కుర్చీలో కూర్చున్నాడు త్రివిక్రమరావు.

నిశ్చేష్టుడయ్యాడు సత్యం.

"ఇంకెంతమందున్నారు?"

"నా.. న్నా..?"

"నాన్ననేరా అడుగుతున్నాను... ఇంకెంతమందున్నారు నీకప్పులిచ్చి నిన్నూ... నీ వంశాన్ని భస్మమయ్యేలా తిడ్తూన్న పెద్దమనుషులు?" వాడిగా ప్రశ్నించాడు త్రివిక్రమరావు.

మౌనంగా నేలచూపులు చూస్తూండిపోయాడు సత్యం.

"ఏమ్మా... ఏమిటిదంతా నువ్వైనా చెప్తావా?" పంకజం వైపు చూస్తూ అనునయంగా అడిగాడు.

తన నిస్సహాయతలో దౌర్భాగ్యంలో భాగం పంచుకొంటూన్న అతని పరామర్శతో మంచులా కరిగిపోయింది పంకజం. భోరున విలపించింది. నిరుత్తరుడయ్యాడు త్రివిక్రమరావు ఆమె ఏడ్పును చూసి.

అప్పటికే సగమర్థమైందతనికి. మిగతా సగంకోసం సత్యాన్నడిగాడు. "ఒరేయ్... ఏమిట్రా ఇది?"

"నన్నేం అడక్కండి. నేనేం చెప్పలేను" తలొంచుకుని గబగబా వెళ్ళిపోయాడు సత్యం.

వరదగోదారిలా విలపిస్తూన్న పంకజాన్ని కదిలించాడు త్రివిక్రమరావు. ఆమె హృదయభారం అతని భారాన్ని పెంచింది. ఆమె ఆవేదన అతనికి రంపపుకోతైంది. ఆమె ఆక్రోశం అతనికి శాపంలా తగిలింది.

నిశ్చేష్టుడయ్యాడు త్రివిక్రమరావు ఆమె చెప్పింది విని.

సత్యం తన జీవితానికి వారసుడనుకున్నాడే కాని కేవలం తనలోని దుర్వ్యసనాలకే వారసుడని భావించలేదు. పంకజాన్నెలా ఓదార్చాలో తెలీక తలమున్కలయ్యాడు.

ఇంటిని పరిశీలించాడు. పెద్దమ్మ పుట్టిల్లులా ఉంది. ఓ ప్రభుత్వోద్యోగి నివాసంలా లేదు. నిరుపేద లోగిల్లా ఉంది.

సత్యం అప్పుల పట్టిక ఆలకించి తనొచ్చిన కార్యాన్ని మనసులోనే కప్పెట్టి ఓ దృఢనిశ్చయా

నికొచ్చి తలపంకిస్తూ కదిలాడు త్రివిక్రమరావు.

సత్యం ఆఫీసులో కడుగుపెట్టి సరాసరి మానేజర్‌ని కలుసుకున్నాడు. సత్యం పరిస్థితి వివరించి అతని సమస్యకో పరిష్కారాన్ని సూచించమని వేడుకున్నాడు.

సత్యాన్ని పిలిపించాడు మానేజర్. సిగ్గుపడుతూనే అతని ముందు నిలిచాడు సత్యం. ఆ క్షణంలో మానేజర్ అడిగిన ప్రశ్నలకు సిగ్గుతో చితికిపోయాడతను.

"మిస్టర్ సత్యం. దిసీజ్ ఫస్ట్ అండ్ లాస్ట్ వార్నింగ్. ఇకనుంచి ఎటువంటి వ్యసనాల జోలికి పోయినట్లు చూచాయగా తెల్సినా ఊస్టింగ్ ఆర్డర్స్ ఇవ్వటానికైనా వెనుకాడను. ఈక్షణం నుంచీ ప్రతీనెలా వస్తున మీ శ్రీమతినొచ్చి జీతం తీసుకెళ్లమను. ఓ మూడువేలు లోన్ కూడా శాంక్షన్ చేస్తాను. నీ అప్పులన్నీ తీర్చేయ్. లోన్ బాకీని నెలకింత చొప్పున కట్ చేస్తాను. ఇక మీదట నువ్వీ ఆఫీస్‌లో పనిచేస్తావో లేదా అన్నది నెలనెలా జీతం తీసుకునేటప్పుడు మీ శ్రీమతి గారిచ్చే రిపోర్ట్‌పై ఆధారపడి ఉంటుంది. ఓ.కే." ఖచ్చితంగా చెప్పాడతను.

బిక్కచచ్చిపోయి తలూపి బయటపడ్డాడు సత్యం.

"ఒరే సత్యం నీ సమస్యకిది పరిష్కారం కాకపోయినా ఈ క్షణంలో నాకు తోచిందింతే. ఒరేయ్ వ్యసనాలు జీవితాల్ని తినేస్తాయిరా. సుఖంగా జీవించాలనుకునే వాళ్ళకు వ్యసనాలు చెదపురుగుల్లాంటివి. నా అంత వాడివయ్యావు. ఇంతకన్నా నీకెక్కువ చెప్పలేను. ఇకనైనా నీ మార్గాన్ని దిద్దుకుంటే సంతోషిస్తా. లేకుంటే ఈ ఆఖరి దశలో కుమిలిపోతాం. వనితకు పెళ్ళి కుదిరింది. ఈ నెల ఇరవై అయిదునే పంకజాన్ని తీసుకుని రెండు రోజుల ముందే వచ్చేయ్" చెప్పి కదిలాడు త్రివిక్రమరావు.

అతనిప్పుడు దుర్వ్యసనాలకు బానిసైన వ్యక్తి కాదు. దుర్వ్యసనాల వలయాన్ని ఛేధించుకుని బయటపడిన వ్యక్తి. మనిషిగా మారిన మనిషి. ఒకరిచే చెప్పించుకునే స్థాయి నుంచి మరొకరికి చెప్పగలిగిన స్థాయికి ఎదిగిన వ్యక్తి.

అతని కళ్ళ ముందు రెండో కొడుకు శివం మెదుల్తున్నాడు.

★ ★ ★

"కాంతం...ప్లీజ్!!" ప్రాధేయపడ్తున్నాడు శివం.

"నేనివ్వనండీ.. నా ప్రాణాలైనా ఆనందంగా ఇస్తాను కాని దాన్ని మాత్రం ఇవ్వను" ఖచ్చితంగా చెప్పింది కాంతం.

ఆ ముందురోజు గణేష్ సలహాప్రకారం ఆఫీస్ డబ్బును అశ్వార్పణం చేసినందుకు ఫలితాన్ని అనుభవిస్తున్నాడు శివం... ఆ ఉదయం ఆఫీసుకెళ్ళగానే పిడుగు పాటులా ఓ వార్త తెల్సిందతనికి

ఆ మధ్యాహ్నం రెండు గంటలకు హెడ్డాఫీసునుంచి ఇన్‌స్పెక్షన్ కొస్తున్నారనీ, రికార్డ్స్ బాలన్స్ షీట్ కాష్ అకౌంట్సన్నీ అప్‌టుడేట్‌గా ఉంచమని టెలిగ్రాం వచ్చింది.

గుండెలపై టన్ను బరువు నుంచినట్లు ఫీలయ్యాడు శివం. ఎప్పుడూ నెలాఖరుకు జరిగే ఇన్‌స్పెక్షన్ అతని ఖర్మకొద్దీ ఆనెల్లో మధ్యలోనే జరుగుతూంది. వెంటనే ఆదరాబాదరాగా గణేష్ దగ్గరకు పరుగెత్తాడు. ఈ విషయం తెలిసీ అతనెప్పుడో మొహం చాటేశాడు.. నిశ్చేష్టుడయ్యాడు శివం.

ఒకటా.. రెండా.. యాభైవేలు.. అదీ నాలుగ్గంటల్లో.. ఎక్కడ్నుంచి తేవాలి.. గుండె గుభిల్లుమందతనికి.. కర్తవ్యం పాలుపోలేదు. చిత్తరువులా నిల్చుండి పోయాడొక్షణం.. మస్తిష్కం మొద్దుబారిపోయింది.

అతని కళ్ళ ముందు అనేక దృశ్యాలు కదలాడుతున్నాయి. ఆఫీసు సొమ్మును సొంత సొమ్ములా వాడుకున్నందుకు సస్పెండ్ కాబడ్డమూ.. అరెస్ట్.. పోలీసులూ..లాకప్‌రూం.. వరుసగా చెదిరిపోతున్నాయి.

కర్తవ్యం గుర్తొచ్చి గణేష్ ఇంటికి పరుగెత్తి అతన్ని కలిశాడు. ఆ సొమ్ములో అతనికీ వాటా ఉంది.

ఆ విషయాన్ని అప్పుడే తనూ వింటున్నట్లు బిక్కమొహం వేసి ఆ తర్వాత గాభరాపడ్డాడు గణేష్.

"ఇప్పుడేం చేయాలి?" అయోమయంగా





చూస్తూ అడిగాడు శివం.

"అదే అర్థం కావట్లేదు. నా దగ్గరా చిల్లిగవ్వ లేదే?" బేలగా చూశాడు గణేష్.

"ఏదో ఒక మార్గం చెప్పి ఈ గండం గట్టెక్కించరా.. ఆ డబ్బులో నీ భాగం ఉందిగా" ఆదుర్దాగా అన్నాడు శివం.

"నన్నేం చేయమంటావ్. ఇన్‌స్పెక్షన్ ఇప్పుడే వస్తుందని నేను మాత్రం కలగన్నానా ఏమిటి?" నిష్ఠూరంగా అన్నాడు గణేష్.

అప్పటికే అర్థగంట గడిచిపోయింది. జుట్టు పీక్కున్నాడు శివం.

"నాకు తెల్సిన మార్వాడీ ఉన్నాడు. ప్రయత్నిద్దాం" అంటూ బయలుదేరదీశాడు గణేష్.

అయిదు రూపాయల వడ్డీ చొప్పున అసలు తీర్చేంతవరకూ ఏ నెల వడ్డీ ఆ నెల చెల్లించే నెపంమీద అయిదు వేలివ్వగలనని చెప్పాడా మార్వాడీ.

"ఏరా... నీ యిష్టం?" అంటూ భారమంతా శివంపైనే వేశాడు గణేష్.

"నీవు తప్పించుకున్నా నాకు తప్పదు కదా" అనుకుంటూ సరే నన్నట్లు తలూపాడు శివం.

తన షరుతుల ప్రకారం శివం చేత నోటు వ్రాయించుకుని అయిదు వేలిచ్చాడు మార్వాడి. మరో పావు గంట గడిచింది. అయిదువేలు మాత్రం దొరికాయి.

ఇంకా దాదాపు మూడు గంటల్లో నలభై అయిదు వేలు సమకూర్చాలి.

ఎలా?

"మీ ఆవిడ బంగారం ఏమైనా?" ఆపై పూర్తిచేయటానికి మనస్కరించనట్లు ఆగిపోయాడు గణేష్.

అదే క్షణంలో నెలరోజుల క్రితం తను కొనుక్కొచ్చిన కలర్ టి.వి., ఫ్రిజ్ శివం మనసులో మెదిలాయి.

"గణేష్... కమాన్" అంటూ ఇంటి దారి పట్టాడు శివం.

ఆటో శివం ఇంటి ముందాగింది.

ఆదరాబాదరాగా లోపలికొస్తున్న భర్తను వింతగా చూసింది కాంతం. టి.వి. ఫ్రిజ్‌లను అదే ఆటోలోకెత్తించాడు. గణేష్‌తో లోగొంతుకతో మాట్లాడాడు కొంచెంసేపు. ఆటో కదిలింది. దాదాపు అర్థగంట తర్వాత పదిహేను వేలతో తిరిగొచ్చాడు గణేష్.

నెలక్రింద వాటి ఖరీదు ఇరవైరెండు వేలు. ఇప్పుడు కేవలం పదిహేను వేలు. 'అమ్మబోతే అడివి. కొనబోతే కొరివి'

"ఏ..మి...టం...డీ?" అయోమయంగా అడిగింది కాంతం.

"కాంతం... పీకల మీదికొచ్చింది వ్యవహారం. అర్జంట్‌గా ఆఫీస్‌లో యాభైవేలు కట్టాలి. ఇంకా ముప్పైవేలు కొరవైనాయి" కంగారుగా చెప్పాడు శివం. కేవలం రెండు గంటలు మాత్రమే ఉంది సమయం.

"యాభైవేలు? ఏం చేశారంత డబ్బు?" ఆమె భృకుటి ముడిపడింది.

"అవన్నీ తర్వాత చెప్తాను. ముందు డబ్బు గురించాలోచించు"

"ఆలోచించేందుకేముందని.. ఇంట్లో చిల్లిగవ్వ లేదు. ఎక్కడ్నుంచి తెస్తారంత డబ్బు?" అదోలా చూసింది కాంతం.

"డబ్బులేదని నాకూ తెలుసు... నీ బంగారం..." అంటూ నసిగాడు శివం.

"నా బంగారమా నేనివ్వను..." వెంటనే అంది కాంతం.

"కాంతం... ఇప్పుడా బంగారం ఇవ్వకుంటే... నన్ను సస్పెండ్ చేస్తారు... ఆఫీసు ధనాన్ని దుర్వినియోగం చేసినందుకు అరెస్ట్ కూడా చేస్తారు... కాంతం ఇప్పుడు నువ్వే నన్నాదుకోవాలి..." భయంగా అన్నాడు శివం.

"నాకేం... నన్నడిగి చేశారా ఆపని... నేనివ్వను..." మొండిగా అంది కాంతం.

"కాంతం..." కోపంగా అన్నాడు శివం.

"కాంతం... కేవలం నాకోసమే చేశానా ఇదంతా... నీకోసం... నీ సరదాలకోసం కాదా... మొన్న కలర్ టీ.వీ... ఫ్రిజ్‌లు తెచ్చినప్పుడు అవి తెచ్చినందుకు మురిసిపోయావే కానీ... నెలజీతంమీద బ్రతికే మీకు ఇంత ఖరీదైన వెలా వచ్చాయని ఎందుకు అడగలేదు... నీగురించి కాదూ నేనిలా అయ్యింది... కేవలం నీ

నరదాలు... గొంతెమ్మ కోర్కెలు తీర్చటానికి కాదూ నేనా గుర్రప్పందాల జోలికెళ్ళింది... లాభం వచ్చినన్నాళ్ళూ ఆనందించావు... ఇప్పుడు నష్టాన్ని కూడా భరించు... కాంతం ఆలోచించుకో... ఇప్పుడు నువ్వు బంగారమిచ్చినన్నాదుకోలేదనుకో... నేనరస్టవుతాను... జైల్లో కూర్చుంటాను... ఆ తర్వాత నీ యిష్టం..."

భోరున ఏడ్చింది కాంతం... కర్తవ్యం పాలుపోలేదామెకు...

ఏడుస్తూనే నక్లెస్... చంద్రహారం... కాసుల పేరు... కేవలం మంగళసూత్రం మాత్రం ఉంచుకుని... సర్వస్వం అతని చేతిలో పెట్టింది కాంతం...

వాటిని తీసుకుని వెనక్కి తిరిగాడు శివం... ఎదురుగా త్రివిక్రమరావు... అదిరిపడ్డాడు శివం అతన్ని చూసి...

"నా...న్నా... మీరా...?" బిక్కచచ్చిపోయాడు శివం...

"అవున్రా నేనే..."

"ఎప్పుడొచ్చారు...?"

"నువ్వు నిలువుదోపిడీ చేస్తున్నప్పుడు..." కఠినంగా ఉన్నాయతని మాటలు...



సత్యం పరిస్థితి చూసి ద్రవించుకపోయిన అతని మనసు శివం స్థితిని చూసి రెట్టింపైంది...

"ఒరేయ్... ఏమిట్రా ఇది... లక్షణంగా బ్రతుకుతారని సొంత కాపురాలు పెట్టిస్తే... ఇదట్రా మీరు చేస్తున్న నిర్వాకం?..." బాధగా అన్నాడు త్రివిక్రమరావు.

"నా...న్నా..."

"ఇంకెక్కడి నాన్నరా... మీ నాన్నెప్పుడో చచ్చిపోయాడురా... అప్పులపాలైన పెద్దకొడుకుని... పెళ్ళాంని నిలువుదోపిడీ చేస్తున్న రెండో కొడుకుని చూసిన క్షణంలోనే చచ్చిపోయాడురా..." బాధగా అంటున్న అతని కళ్ళలో మెదుల్తూన్న నీళ్ళను చూసి చలించిపోయాడు శివం...

"ఒరేయ్ శివం... వ్యసనాలు మనిషిని పతనం చేస్తాయిరా... అందుకు నేనే ఉదాహరణ... కన్నబిడ్డ పెళ్ళిచేయలేక అప్పులపాలై వీధులపడ్డాను. పుత్రుల నర్థించాలనొచ్చి... ఆ పుత్రుల పరిస్థితికి ఏడవాలో... నవ్వాలో అర్థంగాక సతమతమవుతున్నాను... ఒరేయ్ శివం... నేను మట్కాలో పోగొట్టిందాంట్లో ఓ భాగాన్ని వెనకేసున్నా... వనిత పెళ్ళి ఈనాడు నాకో సమస్య అయిఉండేది కాదురా... ఒరేయ్ వ్యసనపరుల జీవితాలు వేగంగా ప్రవహించే నదుల్లాంటివిరా... లాభనష్టాలు ఎత్తుపల్లాల్లాంటివి... నదులన్నీ చివరకు సాగరంలో కలిసినట్లు వ్యసనపరులందరూ దుఃఖసాగరంలో మునుగక తప్పదు... ఇప్పటికైనా మించిపోయింది లేదు కళ్ళు తెరువ్... నీ మార్గాన్ని మలుచుకో..." అంటూ బోధచేశాడు త్రివిక్రమరావు.

"నన్ను మన్నించండి నాన్నా... తెలీక ఊబిలో అడుగుపెట్టాను..." సిగ్గుపడుతూనే అన్నాడు శివం...

"శివం... ఒకరి జీవితం మనకనుభవాన్ని నేర్పాలి... ఇప్పుడు నీ జీవితాన్నే ఓ ఉదాహరణగా తీసుకుని... ఈ అనుభవంతో నీ భవిష్యత్ను తీర్చిదిద్దుకో..." అని మనసులో ఓ దృఢనిశ్చయానికొచ్చి... "శివం... వనిత పెళ్ళి కుదిరింది... ఇరవై అయిదున ముహూర్తం... కాంతాన్ని తీసుకుని రెండ్రోజుల ముందే వచ్చెయ్..." చెప్పి కదిలాడు త్రివిక్రమరావు.

అతని మనసు వికలమైంది. తనే అనుకుంటే కొడుకులు తనకంటే రెండాకులెక్కువే చదవటం కలవరంగా ఉందతనికి.

ఈ బోధతోనే సత్యం... శివంలు మారతారని పించటంలేదతనికి. తనకు జ్ఞానోపదేశం కలుగటానికి ముప్పైఏళ్ళు పట్టింది. వీళ్ళ మనసు లెప్పుడు ప్రక్షాళనమవుతాయో...

మూడో కొడుకు సుందరం గుర్తొచ్చాడతనికి.

ఇప్పటికి ఇద్దరు కొడుకులు తన అంచనాలను తారుమారు చేసి హృదయాన్ని గాయపర్చారు... ఇక వాడేం చేస్తాడో...?!

★ ★ ★

మూర్తీభవించిన శోకదేవతలా కూర్చునుంది పావని... కళ్ళు స్రవించి... స్రవించి... ఇక కన్నీళ్ళు లేవన్నట్లు అలిసిపోయున్నాయి... ప్రాణమున్న శిల్పంలా ఉందామె. తెల్లవారిందని తెలుస్తూన్నా లేవాలనిపించటం లేదామెకు. జాకెట్ చినిగిపోయింది. చీర అస్తవ్యస్తంగా ఉంది... కురులు చిందర...వందరగా ఫాన్‌గాలికి అల్లలాడుతున్నాయి.

ఆమెకక్కడ్నుంచి లేవాలనీ... బట్టలు మార్చుకోవాలనీ అనిపించటంలేదు. శరీరాన్ని నిస్తేజం... మనసును నిర్లిప్తత ఆవరించింది.

ఎవరికోసం తను బట్టలు మార్చుకోవాలి... ఎందుకోసం బ్రతకాలి...

ఏ వ్యక్తిని నమ్మి తను ఇంతదూరం వచ్చిందో... ఏ వ్యక్తి తనను భార్యగా స్వీకరించి కష్టసుఖాల్లో పాలుపంచుకుంటానని అగ్నిసాక్షిగా తనమెళ్ళో మూడుముళ్ళువేసి తనను భార్యగా స్వీకరించాడో... ఆ వ్యక్తి... అతనే మూర్ఖుడై తన జీవితాన్ని సుడిగుండంలో పడదోయ ప్రయత్నిస్తుంటే ఎవరికోసం తను జీవించాలి... ఎవరికోసం ఈ బ్రతుకు...?

నిరాసక్తంగా ఆలోచిస్తుంది...

భర్త రావటం ఓ క్షణమాలస్యమైయ్యుంటే ఏం జరిగేది?...

ప్రాణంకన్నా విలువైన శీలం కోల్పోయేది...

ఇక ముందుముందు ఇలా జరుగదనే మిటి...





భర్త మూర్ఖత్వానికి తన బలికాకముందే కళ్ళు తెరవాలి...

ఇప్పుడేమిటి తన కర్తవ్యం...

ఏం జరుగలేదులే అనుకుంటూ జరిగిందాన్ని మరిచిపోయి ఎప్పటిలానే మౌనంగా కన్నీళ్లు త్రాగుతూ కృశిస్తూ బ్రతకాలా.

తనకయిష్టమైన వ్యసనాలను తనకన్నా ఎక్కువగా ప్రేమించే భర్తనిలా ఉపేక్షించటమేనా...?

మౌనంగా కూర్చుండిపోయింది పావని...

సోఫాలో కళ్ళు తెరిచాడు సుందరం...

తల దిమ్ముగా అనిపించింది... మైకం తగ్గినా హాంగోవర్... ఒళ్ళంతా బడలికగా అన్పించింది. అదే క్షణంలో రాత్రి జరిగిన సంఘటన కళ్ళముందు మెదిలింది...

"ప్చ్..." బాధగా మూలిగిందతని హృదయం...

'రాకేష్...' ఆపేరు తలుచుకుంటేనే కంపరంగా అనిపించిదతనికి.

ఎంత నమ్మించాడు తనను.. నమ్మకద్రోహం చేశాడు...

మనుషుల్లో ఇలాంటి నీచులు కూడా ఉన్నారంటే నమ్మశక్యం కావటంలేదతనికి...

సోదరీ అని పిలిచిన నోటితో ప్రేయసీ అంటానికి మనసెలా ఒప్పింది...

అతని గురించి తనను ఎన్నిసార్లు పావని హెచ్చరించాలని ప్రయత్నించినా... మూర్ఖంగా తను పెడచెవిన పెట్టాడు...

పేకాట... తాగుడులాంటి వ్యసనాలు ఆమెకయిష్టం అని తెల్సినా తను వాటికి ఆకర్షితుడయ్యాడు... ఆమె మనసును గ్రహించలేక వాటికి బానిసయ్యాడు...

ఆమె హృదయం క్షోభించేలా ఆమె కళ్ళముందే త్రాగాడు.

తను లేవటం ఓ క్షణమాలశ్యమైయ్యుంటే రాత్రి ఏం జరిగేది...?

పావని బ్రతుకు, తన భార్య జీవితం నాశనమైయుండేది.

తనే చేతులారా ఆమె సంతోషాన్ని నాశనం చేసుండేవాడు.

అదే జరిగుంటే ఈ జన్మలో తననామె క్షమించేది కాదు.

అతని మనసులో పశ్చాత్తాపంలాంటి భావం కదలాడింది. పావనిపై ఒక్కసారిగా ప్రేమ, జాలి పుట్టుకొచ్చాయి.

సోఫాలోంచి లేచాడు. శరీరం నిస్సత్తువగా అనిపించి, ముందుకు తూలాడు- సోఫా అంచును పట్టుకుని నిలదొక్కుకుని ముందుకు కదిలి బెడ్‌రూంను సమీపించాడు.

దయనీయంగా ఉంది పావని.

కదిలిపోయిందతని హృదయం ఆమెనలా చూస్తుంటే-

"పావనీ"- ఆర్ధ్రంగా పిలుస్తూ ఆమె పక్కనే కూర్చున్నాడు సుందరం.

చివాలున అతనివైపు చూసింది పావని.

బండరాళ్ళను సైతం భస్మంచేసే తీక్షణత ఆ నేత్రాల్లో.

ఆ కళ్ళకే గనుక శక్తుంటే అక్కడికక్కడే భస్మమై ఉండేవాడతను.

ఆమె వైపు చూసే సాహసం లేనట్లు అపరాధిలా తలొంచుకున్నాడతను.

"పావనీ, నన్ను క్షమించు" అతని హృదయపులోతుల్లోంచి వచ్చిందా వాక్యం.

"ఎందుకు క్షమించాలి...?" క్రమేపీ ఆమె నేత్రాలు అరుణకాంతుల్ని అలుముకుంటున్నాయి.

"నేనీకు చాలా క్షోభను కలిగించాను. నన్ను మన్నించు పావనీ..." దీనంగా చూశాడతను.

ఏక్షణంలోనైతే రాకేష్ ఆమె శరీరంపై చేయేశాడో ఆ క్షణమే కరడుగట్టిందామె హృదయం.

"ఎందుకు మన్నించాలండీ మిమ్మల్ని పెళ్ళినాటి ప్రమాణాల్ని విస్మరించినందుకా, దుర్వ్యసనాలు నాకయిష్టమని తెలిసీ వాటిని మీ జీవితంలోకాహ్వానించినందుకా, రాకేష్ దుర్మార్గుడనీ, నయవంచకుడనీ నేనెంత హెచ్చరింప ప్రయత్నించినా నన్ను లెక్కపెట్టక నా జీవితాన్ని ఆ దుర్మార్గుడి కబంధహస్తాల్లో ఇరికించ ప్రయత్నించినందుకా లేక పీచికకి, మరీచికలకీ బేధం తెలుసుకోలేని మీ మూర్ఖత్వాని

కా, చెప్పండి ఎందుకు మన్నించాలి మిమ్మల్ని-'' సూటిగా అతనివైపు చూస్తూ అడిగింది పావని.

అవి మాటలు కావు, మాటల తూటాలు, వాడి శరాలు, పదునైన బాకుల్లా అతని హృదయాన్ని ఛిద్రంచేశాయి.

విలవిల్లాడిపోయాడతను, అతని కళ్ళల్లో నీళ్ళు మెదిలాయి.

నిజమే...

ఆమె మాటలన్నీ అక్షరసత్యాలే.

ఆమె జీవితానికి తను చేసిన ద్రోహం అంతా ఇంతా కాదు.

రాత్రి ఆక్షణం తను నిస్సహాయుడైయుంటే ఆమె జీవితం ఏమలుపు తిరిగుండేదో తల్చుకుంటే అతని హృదయం జలదరించింది.

అదేక్షణంలో ఆమె మనసులో ఓ నిర్ణయం.

ఛరాలున బెడ్ దిగింది పావని. క్షణాల్లో బట్టలు మార్చుకుంది.

విస్మయంగా చూస్తున్నాడతను. ఆమె మనసర్థం కాలేదతనికి.

సూట్‌కేస్‌లో బట్టలు సర్దుతుంటే అప్పుడు కదిలాడతను.

''పావనీ, ప్లీజ్, ఏం చేస్తున్నావ్?'' ఆమె కడ్డుబోయాడతను.

''మీ నీడకూడా పడనంత దూరం వెళ్తున్నాను'' కఠినంగా ఉన్నాయామె మాటలు.

''పావని... ప్లీజ్... నన్ను ఒంటరివాడ్నిచేసి వెళ్తావా?'' దీనంగా అభ్యర్థిస్తున్నాడతను.

''మీరు, ఒంటరెందుకు అవుతారండీ, బ్రాందీ, విస్కీలు మీకో తోడు పేకాట, క్లబ్బు మరో తోడు, మీ నేస్తాలు ఇంకొక తోడు, మీ ఆదరణ కోల్పోయిన నేను ఒంటరినవుతాను కానీ, ఇంత మంది తోడున్న మీరెలా ఒంటరవుతారండీ'' అంటూ సూట్‌కేస్ మూసేసి చేత పట్టుకుంది.

నిరుత్తురుడయ్యాడతను. క్షణంలోనే తేరుకున్నాడు.

''పావనీ, నా తప్పు ఒప్పుకుంటున్నాను. నా తప్పుకు ఇంత పెద్దశిక్ష విధించటం భావ్యంకాదు. పావనీ, ఈక్షణం నుంచి తాగుడు, పేకాట మానేస్తున్నానని ప్రమాణం చేస్తున్నాను. నా మాట నమ్ము'' దీనంగా చెప్పాడతను.

''ఈ మాటలైనా మనస్ఫూర్తిగా అంటున్నవా, లేక నాలుక చివరినుంచొస్తున్నాయా?''

ఈ మాటలన్నది పావని కాదు. ఎప్పుడో ఆ ఇంట్లోకి అడుగుపెట్టి వారి సంభాషణకి సాక్ష్యంగా నిల్చిన త్రివిక్రమరావువి

''నా...న్నా-''

''మామయ్యా''-

దిగ్భ్రాంతి చెందారిద్దరూ. పావని చేతిలోంచి జారి కిందపడింది సూట్‌కేస్.

''శభాష్ పావని, ఆడపిల్లవైనా మంచి నిర్ణయం తీసుకున్నావ్. ఇలాంటి ధైర్యం, స్థైర్యం ఎంతమందికుంటాయ్. ఒరేయ్ సుందరం ఇప్పటికైనా కళ్ళు తెరుచుకుని ప్రవర్తించు. కలకంఠి కంట కన్నీరొలికిన ఇంట శుభములుండవురా'' నిర్వేదంగా ఉంది త్రివిక్రమరావు గొంతు. అతని మనసెప్పుడో మొద్దుబారిపోయింది. ఇన్నాళ్ళూ మూసుకుపోయిన కళ్ళతో లోకాన్ని చూడలేకపోవటం తన అవివేకం. మట్కా, తాగుడు, లాటరీలే తన ప్రపంచమయ్యాయి. ఆ బంధాలను తెంచుకుని బయటపడిన తర్వాత వనిత పెళ్ళి ఓ ప్రశ్నలా మిగిలింది. బాధ్యతలను పంచుకుంటారని ఆశ పెట్టుకున్న ముగ్గురు పుత్రులూ, తనకంటే అసమర్థులయ్యారు.

త్రివిక్రమరావు మాటల్ని మన్నించి ప్రయాణాన్ని మానుకుంది పావని. మనస్ఫూర్తిగానే తన ప్రవర్తనకు సిగ్గుపడ్డాడు సుందరం.

''ఒరేయ్ సుందరం, చిరంజీవితో వనిత పెళ్ళి కుదిర్చాను. నా కడుపున పుట్టినందుకు తలా కాస్త భాగం పంచుకొమ్మని అడగటానికొచ్చానురా. ముగ్గురూ ముగ్గురే అయ్యారు. ఏది ఏమైనా నాకు మాత్రం వనిత పెళ్ళి ఓ బాధ్యతే. ఇరవై అయిదున ముహూర్తం.. ఇద్దరూ రండి'' చెప్పి కదిలాడు త్రివిక్రమరావు.

ఆటోలో కూర్చున్న అతని మనసునిండా ఆలోచనలు.

ఇల్లమ్మాలనే నిశ్చయానికొచ్చాడతను. కొడుకులపైనున్న ఆశ తీరిపోయింది.

నేరుగా వెళ్ళి మార్వాడీ కంగన్‌లాల్ షాపు ముందు ఆటో దిగాడు.





ఇరవై అయిదు నిముషాల చర్చ తర్వాత అరవై వేలకు బేరం కుదిరింది. వడ్డీతో సహా అతని బాకీ పోను మిగతా యాభై మూడువేలు ఇరవై అయిదవ తేదీ సాయంత్రం ఆరుగంటలకు, పెళ్ళి ముహూర్తానికి రెండున్నర గంటల ముందు ఇస్తానని చెప్పాడు కంగన్ లాల్.

''సరే''నంటూ లేచాడు త్రివిక్రమరావు. అతని మొహమిప్పుడు నిర్వికారంగా ఉంది.

వనిత పెళ్ళికి డబ్బు సమకూరిందన్న తృప్తి ఓ కంట్లో, ఇల్లమ్మానన్న అసంతృప్తి మరో కంట్లో.



వనిత పెళ్ళికోసం త్రివిక్రమరావు ఇల్లమ్మాడనే విషయం విని దిగ్భ్రాంతి చెందాడు వెంకట్రామయ్య. అంతకంటే అతన్ని కలవరపరచిన విషయం సత్యం... శివం... సుందరంల జీవనసరళి.

హఠాత్తుగా మాటపడిపోయినట్లు వనిత వైపు పిచ్చిగా చూశారాయన.

''అమ్మా వనితా...ఇదికాదమ్మా నేనాశించిన ముగింపు. నా బావ మనసు ప్రక్షాళనం చేసి నా చెల్లెలికి కానుకగా సమర్పించాలనుకున్నానే గాని వారి నిలువనీడను కబళించాలని ఏనాడూ అనుకోలేదు. చూశావామ్మా ఆవు చేలో మేస్తుంటే దూడ గట్టున మేస్తుందా అని మీ అన్నయ్యలు మీ నాన్నగారి అలవాట్లకే వారసులయ్యారు'' బాధగా అన్నాడు వెంకట్రామయ్య. ఈ క్షణం వరకు సాఫీగా సాగిన అతని పథకం పుత్రుల ప్రవర్తనతో విసిగివేసారిన త్రివిక్రమరావు ఇంటిని బేరం పెట్టడంతో హఠాత్తుగా మలుపు తిరిగింది.

''జరిగిందేదో జరిగిపోయింది. ఇకముందేం చేయాలో ఆలోచించండి'' అనునయంగా చూస్తూ అంది వర్ధని.

''ఇంకేమాలోచించను. ఓ పథకంతో వాళ్ళ గూడు పీకేయించాను. మరో పథకంతో ఇంకేమవుతుందో?'' డీలా పడ్డట్లు అన్నాడాయన.

నిముషాలు వేగంగా గడుస్తున్నాయి. కాలుగాలిన పిల్లుల్లా తిరుగుతున్నారంతా... అందరి మొహాల్లోనూ ఆందోళన చోటుచేసుకుంది.

''వనితా'' గంభీరంగా పిలుస్తూ ఆమెవైపు తిరిగాడు వెంకట్రామయ్య.

''మామయ్యా?'' అతన్ని సమీపించిందామె.

''ఏం జరిగినా మన మంచికేననుకుంటూ సాగాల్సిన పరిస్థితి మనది. జాగ్రత్తగా విను. పథకంలో కొస్త మార్పు... మీ ఇల్లు పెళ్ళికొచ్చిన అతిథుల్తో కళకళ్ళాడుతుంటుంది. నువ్వూ చిరంజీవి పెళ్ళి పీటలపై ఉంటారు. ముహూర్తం సమీపిస్తుంది. ముందనుకున్నట్లుగానే మీ నాన్న కట్నం డబ్బుల్ని సూత్రధారణకు ముందే చెల్లిస్తాడు. చిరంజీవి సూత్రధారణకు ఉద్యుక్తుడవుతాడు. ఆ క్షణంలో సినిమాటిక్‌గా ''ఆగండి'' అంటూ నేను ప్రవేశిస్తాను'' ఓ క్షణం ఆగాడు వెంకట్రామయ్య.

''మామయ్యా?'' ఆందోళనగా అంది వనిత.

''కంగారుపడకు. మన సమస్యకు మీ వివాహం పరిష్కారమే అయినా... అది మన లక్ష్యం కాదు. మీ తండ్రిగారిలో మార్పు మన ఆశయం. మీ నాన్నకు ఇప్పుడు మీ అన్నయ్యలు కూడా తోడయ్యారు. మీ వదినలు రేపటి భాగ్యంలు కారాదు. మన బాధ్యత మరింత పెరిగింది. సూత్రధారణకు నేనో కండిషన్ పెడతాను. ఓ వ్యసనపరుడి కూతురు మరో వ్యసనపరుల సోదరి నా ఇంటికోడలు కావటం నాకిష్టం లేదని షరతు పెడ్తాను. మీ నలుగురిలో మార్పు వస్తేనే... మీరు వ్యసనాలకు దూరమవుతామని వాగ్దానం చేస్తేనే ఈ పెళ్ళి జరుగుతుందని డిమాండ్ చేస్తాను. ఈ పాయింట్ దగ్గర మీ వదినలు కూడా మనకు సహకరిస్తారని నా ఆశ. అతిథులు కూడా ఛీ కొడతారు.

అప్పుడు మీ వాళ్ళంతా దిగిరాక తప్పదు. మీ ఆశ. నా లక్ష్యం నెరవేరతాయి'' గంభీరంగా వివరించాడు వెంకట్రామయ్య.

మౌనంగా తలూపింది వనిత.

★ ★ ★

ఇంటి ముందు ఆకాశమంత కాకపోయినా విశాలమైన పందిరే వేయించాడు త్రివిక్రమ రావు. పెళ్ళైన రెండు మూడు రోజులకే ఖాళీ చేసి వెళ్ళాలని తెలిసినా దాదాపు ఎనభైఏళ్లు తనకో ఆస్తిలా నిల్చిన ఇంటిని మమకారం వదుల్చుకోలేక శుభ్రంగా వెల్లవేయించాడు. గుమ్మాలకు మామిడితోరణాలతో వింతశోభను అరువు తెచ్చాడు.

ఆరోజు రాత్రికే ముహూర్తం. ఉదయానికే బంధుమిత్రులంతా విచ్చేశారు. ఆహూతులతో... కళకళ్ళాడుతూంది త్రివిక్రమరావిల్లు. హడావుడిగా తిరుగుతున్నాడాయన. కొడుకులు... కోడళ్ళతో... చుట్టపక్కాలతో నిండుగా ఉంది ఇల్లు. అయిదారు నిముషాల సేపు గిల్టీగా ఫీలైనా... ఆ తర్వాత మనస్ఫూర్తిగానే పాలువంచుకున్నారు సత్యం.. శివం... సుందరంలు.

మొహంలో సంతోషాన్ని... హృదయంలో ఆనందాన్ని అరువుతెచ్చుకుని యాంత్రికంగా తిరుగుతోంది భాగ్యం. భర్త తనను వంచించినా కనీసం కొడుకులైనా యోగ్యులు కాకపోతారా అన్న ఆమె ఆశలు అడియాసలు గానే మిగిలాయి. తను తన ఆస్తిపాస్తులనేకాక నుదుటిరాతను కూడా కోడళ్ళకు వారసత్వంగా ఇవ్వవలసి వచ్చినందుకు కుమిలిపోతూందామె.

భర్తలానే కొడుకులు కూడా వ్యసనపరులై... అప్పులపాలయ్యారనే విషయం తెలిసిన రాత్రి వనిత పెళ్ళికని భర్త ఇంటిని అమ్మి డబ్బు తెచ్చాడని తెలిసిన రాత్రి ఆమె గుండె నీరైంది. మనసు సముద్రమైంది. కంటికి మంటికి ఏకధారగా విలపించింది. ఆ సమయంలోనే అన్న వెంకట్రామయ్య గుర్తొచ్చాడామెకు.

తండ్రి తమ ఆలనా పాలనా చూసి బరువు బాధ్యతలను తలకెత్తుకోవాలసి వస్తుందనే భయంతో కాబోలు.. ఏదో హడావుడి పనున్నట్లు తనకు ఊహతెలిసేసరికే ఏవో తెలీని లోకాలకెగిరిపోయాడు. క్రమేణా కాలం గడిచేసరికి పెద్దక్కలు పెళ్ళిళ్ళు చేసుకుని వెళ్లిపోతే పెద్దన్నలిద్దరూ స్వార్థంతో భార్యల,అత్తమామల ప్రోద్బలంతో స్వార్థంతో తమదారి తాము చూసుకున్నారు. ఆర్తితో విలపించే తల్లికి అప్పుడే వికసించి గుండెలపై కుంపటిలా నిల్చిన తనకు చిన్నన్నయ్య వెంకట్రామయ్యే దిక్కయ్యాడు. చదువుతున్న చదువును కేవలం సంసారబాధ్యతను నెత్తినేసుకునేందుకే అర్థాంతరంగా వదిలి గుమస్తా అయ్యాడు. డాక్టరు కావాలని చిన్నప్పట్నుంచీ అతను కన్న కలల్ని హృదయంలోనే నిక్షిప్తం చేసుకున్నాడు. చెల్లెలి కోసం తన పెళ్ళిని కూడా వాయిదా వేసుకున్నాడు. చెల్లెలికి పెళ్ళిచేయటంలో తమ బాధ్యతకూడా ఉందని విస్మరించి మొండిచేయి చూపించిన పెద్దన్నలిద్దరికీ బుద్ధి చెప్పేలా అతి వైభవంగా భాగ్యం పెళ్ళి చేశాడు. ఆ తర్వాత ఆ అప్పునెంత కష్టపడి తీర్చాడో అతనికే తెలుసు. మొదట్నుంచీ అంతే. భాగ్యం అంటే అమితిష్టం అతనికి.

'ఆనాటి ఆ అభిమానం. ఆ ఆప్యాయత... ఆ ప్రేమ... అతనిలో ఈనాడేమయ్యాయి. చెల్లెలి పరిస్థితి తెల్సుండీ అతనిలా కట్నమడిగే కర్కోటకుడెందుకయ్యాడు?' ఈ ప్రశ్న వేసుకోగానే బాధగా మూలిగింది భాగ్యం హృదయం.

ఈనాడు డబ్బు ముందు ఆనాటి అభిమానం వెలవెలపోయింది కాబోలు. ఆనాటి అప్యాయత రెక్కలొచ్చి పారిపోయింది కాబోలు. శాశ్వతాలైన ఆప్యాయత అభిమానాలు... అనురాగాలు... రంగు రుచి వాసనలేని నోట్లకట్టల కంటే తీసికట్టయ్యాయా?

'డబ్బుకెందుకింత విలువిస్తున్నాడతను?'

'మానసిక బంధాలకన్నా డబ్బులోనే సంతృప్తి ఉన్నదని భావిస్తున్నాడా?'

'చెల్లెల్ని మానసిక క్లేశకు గురిచేసి కంటతడిపెట్టించి సంపాదించిన డబ్బుతో ఊరేగాలనుకుంటున్నాడా?'

బాధగా నిట్టూర్చి ఏదో గుర్తొచ్చి ముందుకు కదిలింది భాగ్యం.

అతిథులకు భోజనాలను తయారుచే





యించటంలో బీజీగా ఉన్నాడు త్రివిక్రమ రావు. సదానందం అతనికి సహాయపడుతు న్నాడు.

**ఆడవాళ్ళంతా** ఓ వైపుగుమిగూడి ముచ్చ ట్లాడుకుంటున్నారు. పట్టుచీరల దగ్గర్నుంచీ... ఎలక్ట్రిక్ సామానులు... నేటి సినిమాలు అన్నీ చోటుచేసుకుంటున్నాయా ముచ్చట్లలో... కాంతం కూడా శక్తివంచన లేకుండా పాలు పంచుకుంటోందా సమావేశంలో.

**వనిత** దగ్గర చేరి సరసాలాడుతూంది పావని. దాదాపు ఇద్దరిదీ ఒకేఈడు కావటంతో పావని దగ్గరున్నంత చనువు... మిగతా ఇద్దరు వదినలదగ్గరా లేదు వనితకు. ఓ వైపు పావని సరసోక్తులకు మనసారా ఆనందిస్తున్నా... హృదయంలో మాత్రం ఆమె భావాలు పరిపరి విధాల సాగుతున్నాయి.

సాయంత్రం ఏం కానున్నది?

'ఈ పెళ్ళి సవ్యంగా జరిగేనా?'

మామయ్య ఆశలు... లక్ష్యం నెరవేరేనా?

**తేనెతుట్టెలా** ప్రశ్నలు ఝుమ్... ఝుమ్ మంటూ రొద చేస్తూ ఆమెను స్థిమితంగా ఉంచటంలేదు.

వరధ్యానంగా పావనికి సమాధానమిస్తూ ఆలోచిస్తూంది వనిత.

**హడావుడి** పడ్తున్న భాగ్యంకు అవీ ఇవీ అందిస్తూ తోడ్పడుతోంది పెద్దకోడలు పంకజం.

సత్యం, శివంలు వచ్చిన అతిథులకు కబుర్లు చెప్తూ నవ్విస్తున్నారు. రాజకీయాల దగ్గర్నుంచి సినిమా నటుల అక్రమ సంబంధాల వరకూ అన్నీ వారి కబుర్లే. సుందరం మాత్రం ఫ్రెండ్స్‌తో బాతాఖానీ కొడ్తున్నాడు. ఓ వైపు మధ్యాహ్నపు వంటల ఘుమఘుమలతో కబుర్లతో జోరుగా హుషారుగా ఉంది త్రివిక్రమరావి ల్లు.

మధ్యాహ్నం భోజనాలయ్యాయి.

పెళ్ళివారు తరలివచ్చారు.

శివాన్ని డబ్బు నిమిత్తం కంగన్‌లాల్ దగ్గరకు పంపించి పెళ్ళివారికి మర్యాదలు చేయటంలో బిజీ అయ్యాడు త్రివిక్రమరావు.

ఇరువైపు బంధువులూ దాదాపు ఒకరే కావటంతో పలకరింపులతో పరామర్శలతో మారు మ్రోగిపోతూంది పెళ్ళిల్లు.

"బావా" త్రివిక్రమరావును సమీపించాడు వెంకట్రామయ్య.

"చెప్పండి"

"మనం ముందుగా అనుకున్న ప్రకారం" నసిగాడు వెంకట్రామయ్య.

"ఓ అదా మన శివాన్ని ఆ పనిమీదే పంపాను. ఈ పాటికి డబ్బుతో వస్తుంటాడు. రాగానే పువ్వుల్లో పెట్టి మీకు సమర్పిస్తాను. సరేనా!" వ్యంగ్యంగానే అయినా హుందాగానే అన్నాడు త్రివిక్రమరావు.

శివం ఎక్కిన ఆటో రేస్‌గ్రౌండ్ మీదుగా సాగి దాదాపు ఇరవై నిముషాల తర్వాత కంగన్ లాల్ ఇంటిముందాగింది.

"రండి రండి మీ కొరకే ఎదురుచూస్తున్నాను." చిరునవ్వుతో ఆహ్వానించాడు మార్వాడీ సేట్ కంగన్‌లాల్.

కాఫీలవీ అయింతర్వాత తను తెచ్చిన ఇంటి తాలూకు పత్రాలను త్రివిక్రమరావు తమ ఇంటిని కంగన్‌లాల్‌కు అమ్ముతున్నట్లు వ్రాసిన పత్రాన్ని కంగన్‌లాల్‌కిచ్చాడు శివం. అన్నీ సరిచూసుకుని అతను డబ్బు శివానికిచ్చాడు.

"కౌంట్ చేయండి సాబ్ మొత్తం యాభై మూడువేలు."

లెక్కపెట్టుకుని తలూపాడు శివం.

తనకు డబ్బు ముట్టినట్లు శివంచేత రసీదు పై సంతకం చేయించుకున్నాడు కంగన్‌లాల్.

"వస్తాను సేట్‌జీ" డబ్బున్న బాగ్‌తో కదిలాడు శివం.

"మంచిది" చెప్పాడు కంగన్‌లాల్

ఆటోలో కూర్చుని "పోనివ్" అన్నాడు శివం.

ఆటో ముందుక్కదిలింది.

అక్కడ ఓ వైపు శివంకోసం ఎదురుచూస్తునే మరోవైపు పెళ్ళి ఏర్పాట్లతో సతమతమవుతున్నాడు త్రివిక్రమరావు.

మంగళవాద్యాల హోరు మిన్నంటుతూంది.





ఓ వైపు రాత్రి వంటకాలు సిద్ధమవుతూంటే మరోవైపు పెళ్ళి మంటపం అలంకరణ పూర్త వుతోంది.

నలుగులు పెట్టడం స్నానాలు గౌరీ పూజ లాంటి సాంప్రదాయ తతంగాలు పూర్తయింత ర్వాత వధూవరులను పెళ్ళిబట్టల్లో ముస్తాబు చేస్తున్నారు.

రేస్‌గ్రౌండ్ ముందు రెడ్‌లైట్ వెలగటంతో ఆటోనాపాడు డ్రైవర్.

బాగ్‌ను కాళ్ళపై పెట్టుకుని అటుచూశాడు శివం.

కోలాహలంగా ఉంది రేస్‌గ్రౌండ్ లోనికెళ్ళే వాళ్ళు వెళ్తుంటే బయటకొచ్చేవాళ్ళు వస్తున్నారు. చాలామంది మొహాలు మతాబుల్లా వెలుగుతూండటాన్ని గమనించాడు శివం. అప్రయత్నంగా వాచీ చూసుకున్నాడు. మూడున్నరైంది. ముహూర్తానికింకా చాలా టైముందనుకున్నాడు.

రెడ్‌లైట్ ఆరి గ్రీన్‌లైట్ వెలిగింది.

ఆటో కదిలించబోయాడు డ్రైవర్

"ఆపవోయ్" చెప్పి ఆటో దిగి ఫేర్ చెల్లించి ఆటోను పంపించాడు శివం. ఆ సమయంలో అతని మనసులోనున్నది కేవలం కొంతసేపు రేసెస్‌చూసి వెళ్ళాలనే కోర్కెతప్ప ఆడాలని ఏమాత్రం లేదు.

రేస్‌గ్రౌండులోకి ఎంటరయ్యాడు.

ఆ సరికే ఓ రేస్ పూర్తయి రెండో రేస్‌కు గుర్రాలు జాకీలు సిద్ధంగానున్నారు. సరిగ్గా ఓ నిముషం తర్వాత గుర్రాలు ముందుకురికాయి.

పరిచయస్థులెవరైనా కనిపిస్తారేమోనని వెదుకుతూ గాలరీలోకి వెళ్ళాడు శివం. అరుపులతో కేకల్తో మారుమ్రోగిపోతోంది గాలరీ. ఎవరికీ అతన్ని పట్టించుకునే ఉత్సాహం, తీరిక లేదు.

ట్రాక్‌వైపు చూశాడు

ఏడు గుర్రాలు గాల్తో పందెం వేసినట్లు విజయంకోసం పరుగెడుతున్నాయి. నాలుగోస్థానంలో వస్తున్న గుర్రంపై నిల్చింది శివం దృష్టి. అతనికెందుకో ఆ గుర్రం గెలుస్తుందని పించింది. ఆసక్తిగా చూస్తున్నాడు.

శివం దృష్టిలోనున్న గుర్రం తనకంటే ముందు పరుగెత్తుతున్న గుర్రాల్తో పోటీపడలేక క్షణాలు గడిచేకొద్దీ వెనుకపడుతోంది.

వంద... రెండు... నాలుగు... ఆరు... దూరం తరుగుతూంది వేగంగా.

విన్‌పోస్ట్ దగ్గర పడుతూంది.

అంతే ఓ అద్భుతంలా పరిస్థితి తారుమారైంది.

నాలుగో స్థానంలో వస్తున్న గుర్రం క్షణాల్లో ముందు పరుగెడుతూన్న గుర్రాల్ని అధిగమించి రెండోస్థానంలోకొచ్చింది.

తన సెలక్షన్ నిజం కాబోతుందేమోనని సంభ్రమంగా చూస్తున్నాడు శివం. అతని కళ్ళను అతనే నమ్మలేకపోతున్నాడు.

విన్‌పోస్ట్ పదిమీటర్ల దూరంలో ఉండగా శివం పాయింట్‌చేసిన గుర్రం ప్రథమస్థానంలో వస్తున్న గుర్రాన్ని మెరుపువేగంతో అధిగమించి విన్‌పోస్ట్ దాటింది.

"హుర్రే" అంటూ ఎగిరి గంతేశాడు శివం.

మూడో రేస్ మొదలైంది. ఈసారి కూడా శివం ఊహించిన గుర్రమే గెలిచింది. బెట్ గెలిచిన పంటర్స్ సంబరం చూస్తూ "ప్చ్"మంటూ బాధగా నిట్టూర్చాడు శివం. తనుకూడా బెట్‌చేసుంటే తనకూ లాభించేది గదా అనే ఊహ తలెత్తిందతనిలో క్రమంగా ఆ ఊహ మహావృక్షమంతైందతని మనసులో. దానికితోడు చేతిలో డబ్బుంది.

ఆ సమయంలో తనకోసం డబ్బుకోసం ఎదురుచూసే తండ్రిని మరిచాడు. చెల్లెల్ని పెళ్ళిని విస్మరించాడు. నాలుగో రేస్‌లో ఓ గుర్రంపై వెయ్యి రూపాయలు బెట్‌కాశాడు. ఎంతోమంది పోగొట్టుకున్నా అతనికి మాత్రం రెండువేలు లాభించింది. అతనిపై అతనికి విశ్వాసం రెట్టింపైంది. ఈ రోజు నా జాతకం, అదృష్టం దివ్యంగా ఉందనుకున్నాడు. అయిదో రేస్‌లో మరో వెయ్యి సంపాదించాడు. ఆరో రేస్‌లో వెయ్యి పోయినా ముందు సంపాదించిన దాంతో పోల్చి చూసుకుని బాధపడలేదు. ఏడో రేస్‌లోనున్న గుర్రాల్ని పరిశీలించాడు. కింగ్ గార్డ్స్ ఆకర్షించిందతన్ని. అతను చదివిన పరిశీలించిన గుర్రాల చరిత్ర ప్రకారం కింగ్



గార్డ్స్‌కి ఏనాడూ ఓటమి ఎదురుకాలేదు. ఆరోగ్యవంతమైన శరీరంతో కండల్తో పరువంలోనున్న పడుచులా మిసమిసలాడ్తూ కనిపించిందతని కళ్ళకు. మిగతా గుర్రాలను నిశితంగా చూశాడు. కింగ్‌గార్డ్స్ ముందు వెలవెలబోతూ కనిపించాయవి. కింగ్‌గార్డ్స్ గెలుపు తథ్యమని భావించాడు. అందుకే క్లబ్‌వారు కూడా దానికి ఒన్ టైమ్‌మాత్రమే నిర్ణయించారు.

క్షణాల్లో ఓ నిర్ణయానికొచ్చాడు శివం. తన దగ్గరున్న డబ్బు మొత్తాన్ని కింగ్‌గార్డ్స్‌పై కాశాడు. తన చుట్టుపక్కలున్న అందరూ కూడా అదే గుర్రంపై బెట్‌చేయడాన్ని గమనించాడు శివం.

మొదటినుంచి తన సెలక్షన్ విజయంగానే ఉందీరోజు. దానికితోడు ఈ పందెంలో ఘనమైన చరిత్రకల్గిన కింగ్‌గార్డ్స్ తోడైంది. ఈసారి తన సెలక్షన్‌కు అదృష్టానికి తిరుగులేదు.

యాభై అయిదువేలు లాభం.

చాలు.

జారిపోయిన తన వైభవం తిరిగొస్తుంది.

గతంలో పోగొట్టుకొన్న వస్తువులన్నీ తిరిగి సంపాదించి రేస్‌లను పూర్తిగా మానేయాలి.

అప్పుడు సమయం సరిగ్గా ఆరు గంటలు.

రేస్ మొదలైంది.

గుర్రాలు ముందుకు దూకాయి.

పెళ్లి మంటపం ముందు కాలుగాలిన పిల్లిలా తిరుగుతున్నాడు త్రివిక్రమరావు. ఎప్పుడో గంట క్రితమే రావాల్సిన శివం ఇంకా రాకపోవటం చిత్రంగా ఉందతనికి. అప్పటికి కట్నం విషయమై నాలుగైదు సార్లు హెచ్చరించున్నాడు వెంకట్రామయ్య. అడిగిన ప్రతిసారీ ఏదో ఒక సమాధానం చెప్పటం సిగ్గుగా ఉంది త్రివిక్రమరావుకి.

చిరంజీవిని పెళ్లి కుమారుడిని చేసి పీటలపై కూర్చోపెట్టారు.

ఏవో మంత్రాలను ఎవరికీ అర్థంకాని రీతిలో ఉచ్చరిస్తున్నాడు పురోహితుడు.

ఏదో అనుమానం తలెత్తింది త్రివిక్రమరావుకి.

'కొంపతీసి శివాన్ని ఎవరైనా దోచుకోలేదు గదా?'

మనసులో ఆ ఊహ కదలాడగానే కంపించిపోయాడతను. వెంటనే సత్యం సుందరంలను పిలిచి కంగన్‌లాల్ ఇంటికి పంపించాడు.

★ ★ ★

అన్నింటికంటె ముందొస్తున్న గుర్రంవైపు సగర్వంగా చూశాడు శివం. అతనూహించినట్లుగానే కింగ్ గార్డ్స్ ఫస్ట్ ప్లేస్‌లో వస్తూంది.

''కమాన్..కమాన్ కింగ్ గార్డ్స్ కమాన్ ఐ సే''

ఎలుగెత్తి అరుస్తున్నాడు శివం. అతనికి వంత పాడుతున్నారు అనేక వందల మంది.

క్షణాల్లో రేస్ గ్రౌండంతా నిశ్శబ్దం.

పిన్‌డ్రాప్ సైలెన్స్ అలుముకుంది.

శిలా విగ్రహంలా అయిపోయాడు శివం.

ఉన్నట్లుండి పరిస్థితి తారుమారైంది.

ఆ క్షణం వరకూ సెకండ్ ప్లేస్‌లో వస్తూన్న ఒక్క గుర్రం కింగ్ గార్డ్స్‌ను అధిగమించింది. ఆ మరు క్షణంలో కింగ్ గార్డ్స్ వేగం పడిపోయింది. దాని జాకీ ఉదాసీనంగా తయారయ్యాడు.

జరిగిన మోసం అర్థమైంది శివానికి.

''మేడప్ రేసెస్''

కావాలని కింగ్ గార్డ్స్‌ను ఓడించారు.

''దారుణం మోసం'' అంటూ ఆర్తనాదం చేస్తూ కూలిపోయాడు శివం. ఫెయింటైపోయాడతను. ఆ తర్వాత ఎప్పటికో ఎవరో మొహంపై నీళ్లు చల్లేసరికి మెల్లగా కళ్లు తెరిచాడు.

నిశ్శబ్దంగా ఖాళీగా కనిపించింది రేస్ గ్రౌండ్

నిశ్శబ్దంగా లేచి కూర్చున్నాడతను.

జరిగిన మోసం తల్చుకుంటే అతని గుండె నీరవుతుంది.

అపుడు గుర్తుకొచ్చారతనికి తండ్రి, చెల్లెలు, పెళ్లి.

''అమ్మా వనితా నీకన్యాయం చేశానమ్మా'' మొహాన్ని అరిచేతుల్లో దాచుకుని ఏడ్చాడు.

వేలాది లక్షలాది అభాగ్యులకు ప్రతినిధిలా ఏడుస్తున్నాడతను.




మెల్లగా లేచి నిల్చుని కళ్లు తుడుచుకుంటూ బయటకు నడిచాడు. అదే సమయంలో రేస్ గ్రౌండ్‌లోకి ఎంటరైన సత్యం సుందరంలు అతన్ని గమనించారు.

★ ★ ★

ఎక్కడో గోడ గడియారం ఏడు గంటలు కొట్టింది.

ముహూర్తానికి కేవలం ఇరవై రెండు నిముషాలు మాత్రం ఉంది.

ఆందోళనగా చూశాడు త్రివిక్రమరావు.

'డోంట్ వర్రీ' అన్నట్లు వనిత చేయి నొక్కి వదిలాడు చిరంజీవి.

పెళ్లి పందిరంతా అదో రకమైన గంభీర వాతావరణం అలుముకుంది.

ఆ క్షణంలో ఇంటి ముందాగింది ఆటో. ముందుగా సత్యం దిగాడు. తర్వాత సుందరం, ఆఖరుగా శివం.

త్రివిక్రమరావులో ఒక్కసారిగా జీవం ప్రవేశించింది.

''పంతులుగారూ మీరు కానివ్వండి'' అంటూ బిగ్గరగా ఓ ఆర్డర్ పారేసి శివం దగ్గరకు పరుగెత్తాడు త్రివిక్రమరావు.

''ఏరా ఇంతాలశ్యమయిందేం. నువ్వు రావటం కాస్త ఆలశ్యమయ్యే సరికి ఎంత కంగారు పడ్డానో తెలుసా?'' ఆతృతగా అంటూ అతన్ని సమీపించాడు త్రివిక్రమరావు.

సిగ్గుతో మౌనంగా తలొంచుకున్నాడు శివం.

అది గమనించిన త్రివిక్రమరావు.. ''ఏదిరా ఆ డబ్బు. బోడి డబ్బుకోసం గంటనుంచీ పీడించుకు తింటున్నాడు మీ మామయ్య. వాడి మొహాన కొట్టి సగర్వంగా పెళ్లి చేయిస్తాను'' ఉత్సాహంతో గబగబా అన్నాడు త్రివిక్రమరావు.

''........''

అప్పుడు పడింది త్రివిక్రమరావు దృష్టి శివం మొహంపై.

''ఒరేయ్ ఏమైందిరా. సమాధానం చెప్పవేం. ఏదీ డబ్బు?'' ఆందోళనగా అడిగాడు.

''అ..దీ అ..దీ-?'' అంటూ నసిగాడు శివం.

''ఏమిట్రా ఆ నసుగుడు. కంగన్‌లాల్ డబ్బివ్వలేదా?''

''ఇచ్చాడు''

''మరేదీ''

''రేసెస్‌లో పోయింది''

అణుబాంబులా పేలిందామాట

''నిశ్శబ్దం''

మంగళవాద్యాలు మూగవోయాయి.

పురోహితుని గొంతు పడిపోయింది.

''ఒరేయ్ ఏమిట్రా నువ్వనేది?'' అర్థంగాక అడిగాడు త్రివిక్రమరావు.

''నన్ను క్షమించండి నాన్నా. కంగన్‌లాలిచ్చిన డబ్బు రేసుల్లో పోగొట్టాను. నన్ను క్షమించండి.'' అంటూ భోరున ఏడుస్తూ త్రివిక్రమరావు కాళ్లపై పడ్డాడు శివం.

నిశ్చేష్టుడయ్యాడు త్రివిక్రమరావు.

భాగ్యం గుండె గుభిల్లుమంది శివం మాటలు విని.

వెంకట్రామయ్య చిరంజీవిలతోపాటు తదితర బంధుమిత్రులంతా శిలా విగ్రహాలయ్యారు. శివం వైపు ఏవగింపుగా చూశాడు వెంకట్రామయ్య.

''ఒరేయ్ శివం ఏమిట్రా నువ్వు చేసింది?'' ఎక్కడో అగాధాలనుంచొస్తున్నట్లుగా ఉంది త్రివిక్రమరావు స్వరం. గొంతు జీరవోయింది.

''నన్ను మన్నించండి నాన్నా. ఇలా జరుగుతుందనుకోలేదు'' గద్గద స్వరంతో చెప్పాడు శివం.

''చిరంజీవీ ఇంకా చూస్తావేరా లేచిరా'' త్రివిక్రమరావు, భాగ్యంల గుండె నీరయ్యేలా అరిచాడు వెంకట్రామయ్య.

భయం లేదన్నట్లు వనిత చేయి నొక్కి వదిలి పీటల పైనుంచి లేచాడు చిరంజీవి.

''అన్నయ్యా'' ఏడుస్తూ పరుగున వెళ్లి వెంకట్రామయ్య కాళ్లపై పడింది భాగ్యం. ఆమె నేత్రాలు వరద గోదారులే అయ్యాయి.

''అన్నయ్యా కట్నం కోసం ఆశపడి పీటలపై పెళ్లి చెడగొట్టి నా కూతురి బ్రతుకు అన్యాయం చెయ్యద్దు'' అంటూ భోరున విలపించింది.

ఏం చేయాలో అర్థంగాక శివం వైపు చూస్తుండిపోయాడు వెంకట్రామయ్య. ఎటూ పాలుపోవటం లేదతనికి. శివం మరీ ఇంతగా దిగజారతాడని కల్లో కూడా ఊహించలేదతను.

"ఇంకా ఆలోచిస్తావేంరా మేనకోడలి భవిష్యత్కన్నా నీకు డబ్బే ఎక్కువైందా. చెల్లెలి పరువు మర్యాదలకన్నా ఆపాపిష్టి డబ్బే ముఖ్యమైందా. ఒరేయ్ తోడబుట్టిందాన్ని. కాళ్లు పట్టుకుని వేడుకుంటున్నా. ఈ పెళ్లి జరిపించు" దీనంగా అర్థిస్తోంది భాగ్యం.

"చెల్లెమ్మా డబ్బుకోసం గడ్డి తినే మనిషిని కానమ్మా. వ్యసనాలకు విచ్చలవిడిగా వేలకు వేలు ఖర్చు పెట్టే నీ భర్తకు డబ్బు విలువ తెలీచేయాలనే ఉద్దేశంతో కట్నమడిగానే కాని చెల్లెలి కన్నీటిని అమ్ముకుని డబ్బు సంపాదించాలని కాదమ్మా. చూడు. ఇప్పుడేమైందో నీ కొడుకులు కూడా తండ్రి జీవితానికే కాక వ్యసనాలకూ వారసులయ్యారు. చెల్లెలి పెళ్లి ఆగిపోతుందని తెల్సినా మూర్ఖంగా ఆ డబ్బుతో రేసులాడి ఓడిపోయాడు శివం. నేనెప్పుడో చెప్పాను. 'బావా పెద్దలు పిల్లలకు ఆదర్శంగా నిలవాలేగాని వారి పతనానికి పునాదులు కారాదని' నామాట పెడచెవిని పెట్టినందుకు ఫలితం అనుభవించండి" కఠినంగా అన్నాడు వెంకట్రామయ్య.

"వెంకట్రామయ్యా... ఆనాటి నీ బోధను విననందుకు ఈనాడు అనుభవిస్తున్నాను. జరిగిందేదో జరిగిపోయింది. పెళ్లిమాత్రం ఆపకు" వెంకట్రామయ్య చేతులుపట్టుకుని ప్రాధేయపడ్డాడు త్రివిక్రమరావు. అతని కళ్ళల్లో పశ్చాత్తాపం స్పష్టంగా కనిపిస్తూంది.

జాలిగా అతనివైపు చూశాడు వెంకట్రామయ్య. అంతలోనే కఠినంగా మారిపోయాడతను. కేవలం ఈ మార్పే చాలదు. సత్యం, శివం, సుందరంల్లో కూడా మార్పు రావాలి.

"నో" కఠినంగా చెప్పాడు వెంకట్రామయ్య.

"ఓ వ్యసనపరుడి కూతురు మరో ముగ్గురు వ్యసనపరుల సోదరి నా యింటి కోడలు కావటం నాకిష్టంలేదు. బావా జాగ్రత్తగా విను. ఓ షరతుమీదనైతే నీ కూతుర్ని మా యింటి కోడలిగా చేసుకుంటాను. నీవూ, నీ కుమారులు

వ్యసనాలనుంచి విముక్తులయ్యారని నాకెప్పు డైతే నమ్మకం కలుగుతుందో అప్పుడే ఈ పెళ్లి జరుగుతుంది. డబ్బు విలువ కూడా మీకు అర్థం కావాలి. కాబట్టి కట్నం కూడా ఖచ్చి తంగా ఉండాలి. అప్పటివరకూ సెలవ్. చిరంజీవీ కమాన్' అంటూ చరచరా వెళ్ళిపో యాడు వెంకట్రామయ్య. నిశ్శబ్దంగా అతన్ననుసరించాడు చిరంజీవి.

పలురకాలుగా కామెంట్ చేసుకుంటూ నిష్క్రమించారు బంధుమిత్రులు.

బాధగా తలపట్టుకున్నాడు త్రివిక్రమరావు.

బేల చూపులు చూస్తూండిపోయింది భాగ్యం.

వెళ్లిపోతున్న బంధువులవైపు నిరాసక్తగా చూస్తూంది వనిత.

★ ★ ★

ప్రేతకళ కరాళనృత్యం చేస్తూంది త్రివిక్రమ రావింట్లో. శ్మశాన వాతావరణం స్థానం చేసుకుంది. వెలవెలబోతున్న పెళ్లిమంటపం. వాడిపోయిన మామిడి తోరణాలు. నిశ్శబ్దంగానున్న ఇల్లు అందుకు సాక్ష్యాలు.

రకరకాలుగా వ్యాఖ్యానించుకుంటూ బంధుమిత్రులంతా వెళ్లిపోయారు. త్రివిక్రమ రావు కుటుంబ సభ్యులు మాత్రం మిగిలారు.

మధ్యగదిలో పడక్కుర్చీలో కూర్చొనున్నాడు త్రివిక్రమరావు. వంటగది గోడకానుకుని వారగిలబడి కూర్చుంది భాగ్యం. ఆమె కళ్లనుండి ధారగా నీళ్లు కారుతున్నాయి. ఓ మూల తలపట్టుక్కూర్చుంది వనిత. ముందు హాల్లో కోడళ్లు ముగ్గురూ లోగొంతుకల్తో సంభాషించుకుంటున్నారు. ముఖ్యాంశం నిన్నటి శివం ప్రవర్తనే - ఎప్పుడూ గలగలా వాగే నానిగాడు కూడా గంభీరంగా ఉన్నాడు. సత్యం, శివం, సుందరంలు మాత్రం ఆ వాతావరణాన్నుంచి తప్పించుకోవటానిక్కాబోలు బయటకెళ్లారు. మొత్తంమీద తీగె తెగిన వీణలా ఉంది మూగవోయిన ఆ ఇంటి వాతావరణం.

మనసులోనే మధనపడుతున్నాడు త్రివిక్రమరావు. డబ్బు పోయినందుకు, వనిత పెళ్లాగిపోయినందుకూ కాదతని మధనం. శివం ప్రవర్తన గుర్తొచ్చి కుమిలిపోతున్నాడతను.

ఎప్పటికొస్తుంది వీళ్లల్లో మార్పు...?

ఇప్పుడేమిటి తన కర్తవ్యం?

రేపో మాపో మార్వాడీ కంగన్‌లాల్‌కి ఈ ఇంటినప్పగించాలి.

ఇల్లుపోయినా ఫలితం మాత్రం దక్కలేదు.

ఇప్పుడెలా చేయాలి వనిత పెళ్లి.

పెళ్లికాకుండా గర్భవతైన కూతురు. ఆ పెళ్లి కష్టపడ్తున్న కొడుకుల ప్రవర్తన...

వెంకట్రామయ్య షరతు గుర్తొచ్చిందతనికి.

వనిత పెళ్లికి డబ్బు సిద్ధంచేయటం ఒకెత్తయితే... కొడుకులను మార్చటం మరో ఎత్తు.

ఎలా మార్చాలి వీళ్లని.

చిన్నపిల్లలైతే దండించి బోధించవచ్చు. తనంతైన వాళ్లకి ఎలా చెప్పగలడు — ?

ఎలా చెప్పినా... చెప్పే మార్గం బలీయంగా ఉండాలి.

సాధ్యమైనంత త్వరలో డబ్బుకూడా సిద్ధంచేయాలి.

ఇప్పటికే సూటిపోటి మాటల్తో ఇరుగుపొరుగులు హృదయాన్ని ఛిద్రం చేస్తున్నారు.

ఆలోచన అతని ఉచ్ఛ్వాసమైంది. ఆవేదన అతని నిశ్వాసమైంది.

గత రాత్రి సంఘటనకే మరో పదేళ్ల వార్ధక్యం పైబడ్డట్లు కృంగిపోయాడతను. శరీరం వంచుకునిపోయింది అవమానభారాన్ని మోయలేక... పెళ్లికాకుండానే గర్భవతైన కూతుర్ని ఎంతకాలం మాత్రం భరించగలడు తను...

క్షణాలు గడిచేకొద్దీ ఇంటివాతావరణం భరించరానిదైందతనికి.

నిశ్శబ్దంగా కుర్చీలోంచి లేచాడు. ఓసారి నలుదిశలా దృష్టి సారించాడు. చిత్తరువులా ఉదయం నుంచీ అలానే ఉంది దృశ్యం. రాత్రినుంచి ఇంటిల్లిపాదీ పచ్చిగంగను కూడా ముట్టలేదనేది పచ్చినిజం.

ఆ గంభీరవాతావరణంలో పాలుపంచలేనట్లు బయటకు నడిచాడు. కడుపులో ఆహారం లేకపోవటంతో నీర్సంగా అనిపించింది. ఏదైనా తింటానికీ మనస్కరించలేదు.





అలానే నడుస్తున్నాడతను.

పిల్లల పార్క్ దాటాడు.

ఓ క్షణం పార్క్ దగ్గరే ఆగి లోపలకు చూశాడు.

హాయిగా ఆడుకుంటున్నారు పిల్లలు. రకరకాల బట్టల్తో... ఫాషన్ డ్రస్సుల్తో... బొద్దుగా... ముద్దుగా ఉన్నారు.

ఏ బరువూ బాధ్యతల్లేని... చీకూ చింతా లేని... కల్మషంలేని వయసది.

ఓ క్షణం బరువుగా నిట్టూర్చాడు త్రివిక్రమరావు.

మనిషి జీవితంలో మధురమైంది బాల్యమే కదా నన్పించింది. 'ఆ బాల్యం శాశ్వతమైతే ఎంత బావుండుననుకుంటూ' ముందుక్కదిలాడు.

దారిలో ఓ శవం ఎదురైంది.

శవం వెంట కొడుకులూ, కూతుళ్ళూ కాబోలు ఏడుస్తున్నారు. కొంచెంసేపటికి ఆడవాళ్ళాగిపోయారు. కేవలం మగవాళ్లు మాత్రమే అనుసరిస్తున్నారు.

'ఓటి పడవ జీవితం ఏ క్షణంలో మునుగుతుందో?' వేదాంత ధోరణిలో అనుకున్నాడతను.

ఆ క్షణంలో మనసునిండా వైరాగ్యమలుముకుంది.

ఆ శవాన్ని చూస్తూ ముందుక్కదిలాడు.

ఓ చోట ఓ శతాధిక వృద్ధుడు... కాళ్లులేని... చూపుసరిగా ఆనని ఓ వృద్ధుడు వెంటపడి వేధించి మరీ యాచిస్తున్నాడు. అతని శరీరంలో ఆకలి బాధ, కళ్లల్లో బ్రతకాలన్న ఆర్తికనిపించాయి త్రివిక్రమరావుకు.

విరక్తిగా నవ్వుకున్నాడో క్షణం.

'ఎందుకో అతనికి ఈ బ్రతుకుమీద అంత తీపి?'

కనీస అవయవాలు కూడా సరిగాలేవు. తింటానికి తిండిలేదు.

అతని శరీరం భూదేవికేగాక అతనికీ భారమే. పదిమంది చేత అసహ్యించుకుంటూ ఇంకా ఎంతకాలం బతకాలనో ఆ తపన. బతికి ఏం సాధించాలనో? నిర్లిప్తతగా నవ్వుకుంటూ ముందుక్కదిలాడు.

హుస్సేన్‌సాగర్‌ని సమీపించి ఓ రాతిపై కూర్చున్నాడు.

అలలు తీవ్రంగా ఎగిసెగిసి పడుతున్నాయి అతని మనసులాగే. తీరం చేరాలని ప్రయత్నిస్తున్న కెరటాల్లానే ఉన్నాయతని ఆలోచనలు. ఎన్ని విధాలుగా ఆలోచించినా పరిష్కారం కుదరని సమస్య.

అలలపై కెరటాలపై సూర్యకాంతి మెరుపులను అవలోకిస్తున్నాడతను. అతని మెదడులో ఓ మెరుపు. అదేక్షణంలో అతని పెదవులపై ఓ విరిసీ విరియని దరహాసం. దొరికింది పరిష్కారం. తన సమస్యకు పరిష్కారం దొరికింది. ఒన్‌షాట్ టూ బర్డ్స్.

రాతిమీంచి లేచాడు. గంభీరంగా అయిందతని మొహం. నిర్లిప్తతగా నడుస్తున్నాడు. ఏర్పాట్లు పూర్తి చేసుకునే సరికి మరో అర్ధగంట పట్టింది. ఆ తర్వాత నింపాదిగా నడుస్తున్నాడు. ఇప్పుడతని మనసులో ఎలాంటి సంఘర్షణా లేదు. ఎలాంటి అలజడి లేదు. యోగిలా ఉన్నాడతను. భావ రహితంగా ఉందతని మొహం.

ఓ బార్ అండ్ రెస్టారెంట్ ముందు నడుస్తున్నాడు.

ఓ క్షణమాగి బార్‌వైపు చూశాడు.

ఎందుకో ఆ క్షణంలో అతనికి తాగాలనిపించింది.

బార్‌లోకి కదిలాడు. ఓ టేబుల్‌నెంచుకుని కూర్చున్నాడు.

త్రాగాడు. తాగుతూనే ఉన్నాడు. నిముషాలు గంటలయ్యాయి. జేబు ఖాళీ అయింది. శరీరం భారమైంది. తూలుకుంటూ బయటకొచ్చాడు. ''ఎవరికి ఎవరు... చివరికి ఎవరు'' అంటూ ఎప్పుడో చూసిన సినిమాలోని పాటను కూనిరాగంగా మార్చుకుని కదిలాడు.

ఇంటిని సమీపించాడు. అతనేమయ్యాడో తెలీక కలవరపడుతూన్న ఇంటిల్లిపాదీ అతని ఆగమనాన్ని చూసి రిలీఫ్ ఫీలయ్యారు. అతనెవరినీ పట్టించుకోక నేరుగా వెళ్ళి పడక్కుర్చీలో కూర్చున్నాడు.

''ఏమండీ... భోజనం?'' అతన్ని కదిలించింది భాగ్యం.

మూసుకుపోతున్న కళ్ళను బలవంతాన తెరుస్తూ ఆమెవైపు చూశాడు.

'భాగ్యం కేవలం తను ఆమె మెళ్ళో తాళి కట్టిన పాపానికి గత ముప్పైమూడేళ్ళుగా తనకు సేవ చేస్తున్న ప్రాణి'

ఆమె కళ్ళల్లో అంతులేని నైరాశ్యం.

''నాకాకలిగా లేదు భాగ్యం'' నీర్సంగా ఉందతని కంఠం.

''జరిగిందేదో జరిగిపోయింది రండి. కాస్త ఎంగిలిపడండి'' బ్రతిమిలాడింది భాగ్యం. అదే సమయంలో ఎవరింట్లోనో గోడ గడియారం అర్ధరాత్రి పన్నెండయినట్లు సూచిస్తూ గంటలు కొట్టింది.

భారంగా నిట్టూరుస్తూనే కుర్చీలోంచి లేచాడు. రెండు మెతుకులు కతికి అదే కుర్చీలో విశ్రమించాడు. అతని మొహంలో రిలీఫ్. ఓ సమస్యకు పరిష్కారాన్ని కనుగొన్న ఫీలింగ్.

కళ్ళు మూసుకున్నాడు త్రివిక్రమరావు.



బజారుకు బయిలుదేర్తున్న వెంకట్రామయ్యను సమీపించాడు పోస్ట్‌మన్.

''సర్. మీకు రిజిస్టర్ కవర్''

''నాకా?'' ఆశ్చర్యంగా చూశాడు వెంకట్రామయ్య.

''అవును'' అని అతనిచే సంతకం పెట్టించుకుని ఓ కవర్ చేతికిచ్చి వెళ్ళిపోయాడు పోస్ట్‌మన్.

ఫ్రం అడ్రస్ చూశాడు 'త్రివిక్రమరావు' అనుంది.

తలపంకిస్తూ కవర్ ఓపన్ చేశాడు. మడతలు పెట్టబడున్న ఓ కాయితాన్ని బయటికి తీసి సరిచేసి చూశాడు. త్రివిక్రమరావు దస్తూ





రిని గుర్తుపట్టి ఆసక్తిగా చదివాడు.

"వెంకట్రామయ్యా ఓడిపోయాను. జీవితంలో పూర్తిగా ఓడిపోయాను. మనిషిగా పుట్టిన ప్రతిజీవి ఏదో ఒకటి సాధించాలి. కానీ నేను ఏమీ సాధించని అసమర్థుడిగా మిగిలాను. కనీసం కొడుకుల్నైనా తీర్చిదిద్దుకోలేకపోయాను. ఒకప్పటి నీ బోధ ఇప్పుడర్థమవుతూంది. ఏం లాభం. పెద్దలు మిగిల్చిన గూడు కూడా పోయింది. వెంకట్రామయ్యా నా ఎల్లైసీ, పి.యఫ్. వగైరాలు కలిపి అరవైవేలకు పైనే వస్తుంది. అంతో ఇంతో బంగారం ఇంట్లో ఉంది. అది నీకు కట్నంగా సరిపోతుందనుకుంటాను. ఇక నీ షరతు ప్రకారం నా కుమారుల్లో మార్పు ఈ లెటర్ నీకు చేరేసరికి అది కూడా సాధ్యమవుతుందని భావిస్తున్నాను. సాధ్యమైనంత త్వరలో వాళ్ళ వివాహం జరిపిస్తావని భావిస్తూ నీ బావ త్రివిక్రమరావు"

స్థాణువైపోయాడు వెంకట్రామయ్య. అతని మనసులో ఏదో అనుమానం. లెటర్ సరిగా అర్థంగాక మళ్ళీ మళ్ళీ చదివాడు. అనీజీగా ఫీలయ్యాడు.

'నాకు ఎల్లైసీ, పి.యఫ్. వగైరాలు కలపి అరవై వేలకు పైనే వస్తుంది. అంతో ఇంతో బంగారం కూడా ఉంది. అది నీకు కట్నంగా సరిపోతుందనుకుంటాను. ఇక నీ షరతు ప్రకారం నా కుమారుల్లో మార్పు. ఈ లెటర్ నీకు చేరేసరికి అదికూడా సాధ్యమవుతుందని భావిస్తున్నాను. సాధ్యమైనంత త్వరలో వాళ్ళ వివాహం జరిపిస్తావని భావిస్తున్నాను.' లెటర్లోని ఈ వాక్యాలే అతన్ని ఆలోచింపచేస్తున్నాయి. క్రమంగా మనసులోని అనుమానం మహావృక్షమైంది.

చేతిసంచీని లోపల విసిరేసి కంగారుగా బయటకు పరుగెత్తి కనిపించిన ఆటో ఎక్కి అడ్రస్‌చెప్పి "పోనివ్" అన్నాడు వెంకట్రామయ్య.

అతని శరీరంలో వణుకు మొదలైంది. శరీరం కంపిస్తూంది. సీట్లో కూర్చోలేకపోతున్నాడు. అతని ఆరాటాన్ని గమనించి స్పీడ్ రైజ్ చేశాడు ఆటో డ్రైవర్.

ఇరవై నిముషాల తర్వాత ఆటో త్రివిక్రమరావు ఇంటి ముందాగింది. లోపల్నుంచి అరుపులు, ఏడుపులు బిగ్గరగా వినిపిస్తున్నాయి. వెంకట్రామయ్య గుండె గుభిల్లుమంది. ఆటో చార్జి చెల్లించటం కూడా మరిచి లోపలకు పరుగెత్తాడు.

మధ్య గదిలో గుంపుగా జనాలు కనిపించారు. గందరగోళంగా కేకలు అరుపులు, ఏడుపులూ, రకరకాల వ్యాఖ్యానాలు.

ఆతృతతో వాళ్ళమధ్యనుంచి చోటుచేసుకుని ముందుకు చూశాడు. అతని అనుమానం యదార్థమే అయింది.

మధ్య గదిలో పడుకోబెట్టబడుంది త్రివిక్రమరావు శవం. భవబంధాల నుంచి విముక్తి పొంది హాయిగా విశ్రాంతి తీసుకుంటున్నట్లున్నాడు. నిద్రపోతున్నట్లే ఉంది అతని శవం. హృదయవిదారకంగా విలపిస్తున్నారు భాగ్యం, వనిత, పంకజం, కాంతం, పావనిలు. ఓ పక్కగా నిల్చుని కుమిలిపోతున్నారు సత్యం, శివం, సుందరంలు.

వెంకట్రామయ్యను చూస్తూనే అతన్ని అల్లుకునిపోయి ఏడ్చింది భాగ్యం. అతని కళ్ళ నుంచి నీళ్ళు ధారాపాతంగా కారుతున్నాయి.

త్రివిక్రమరావు పిడికిట్లో కనిపించిందో పేపర్. కళ్ళు తుడుచుకుంటూ దాన్ని తీసి చదివాడు వెంకట్రామయ్య.

"సత్యం, శివం, సుందరం ఒకరి జీవితాన్నుంచి మరొకరు అనుభవాల్ని నేర్చుకోవాలి. మిమ్మల్ని తీర్చిదిద్దటంలో అసమర్థుడనైన నా జీవితం మీకో అనుభవం కావాలి. ఒక్క కూతురి పెళ్ళిచేయలేక పెద్దలు మిగిల్చిన ఇల్లమ్మాను. ఆ డబ్బు చేతికందకుండానే జారిపోయింది. ఇలా ఎందుకు జరిగింది. నాకున్న దుర్వ్యసనాలు ఓ కారణమైతే, నా వారసుల వ్యసనాలు మరో కారణం. చరిత్రలో వ్యసనాలకు బానిసలైన ఎవరిగతైనా నాలానే ఉంటుంది. మీరు కళ్ళు తెరవకుంటే మీ గతికూడా ఇంతే. నా మరణమైనా మీకో సందేశం కావాలి. మీ పిల్లల జీవితాలైనా క్షేమంగా గడవాలి. నా ఎల్.ఐ.సి, పి.యఫ్. డబ్బు,ఇంట్లోనున్న బంగారంతో వనిత పెళ్ళిచేయండి. ఇదే నా ఆఖరి కోరిక. మీకేమి ఇవ్వలేక పోయిన ఓ అసమర్థపు తండ్రి- త్రివిక్రమ



రావు''

మౌనంగా ఆ లెటర్‌ను శివాని కందించాడు వెంకట్రామయ్య.

వ్యసనపరుల జీవితాలు మంచుపల్లకీల్లో ఊరేగే మిధ్యాబింబాలు. గెలుపులోనున్నప్పుడు అందంగా మంచుపల్లకీలా ఆకర్షణీయంగా ఉంటారు. ఓటమిపాలైతే ఎండకు కరిగి నీరవుతారు. అర్భకులవుతారు, అసమర్థులవుతారు.

ఆ లెటర్ చదివిం తర్వాతనైనా సత్యం, శివం, సుందరంల్లో మార్పురాకపోతే వారి జీవితాలే వృధా.

★

## "ఉపసంహారం"

ఇది కేవలం ఓ త్రివిక్రమరావు కథ మాత్రమేకాదు. క్లబ్బులో పేకాడే, సారాకొట్లని, బ్రాకెట్ షాపులని పావనంచేసే, సీజన్‌లో రేస్‌క్లబ్‌ల్లో కాపురచేసే, అన్ని సీజన్‌లలో గ్రామ నగర పొలిమేరల్లో మూగజీవాలతో తమ భవిష్యత్‌లను ముడిపెట్టుకునే అనేకమంది త్రికవిక్రమరావుల కథ ఇది.

పండిత పుత్రులందరూ శుంతలుకానట్లే వ్యసనపరుల పుత్రులందరూ వ్యసనపరులే కావాలని లేదు. కాకూడదనీ లేదు. మొత్తంమీద ఆ పెద్దల ప్రభావం తమ వంశాంకురాలపై అంతో ఇంతో పడేదానికి అవకాశముంది.

ఈప్రపంచంలోలాభపడిన జూదగాళ్ళెవరూ లేరని ఖచ్చితంగా చెప్పవచ్చు. కేవలం నిర్వాహకులు తప్ప.

ఉదాహరణకు ఈ నవల్లోని ఆనందరావు

అతని క్లబ్బులోకి ఎ,బి,సి,డి అనే వ్యక్తులు వచ్చారనుకుందాం. తొలిరోజున ఎ,బిలు లాభం పొందారనుకుందాం ఆ లాభం చెరి రెండొందలనుకుంటే సి,డిలు నష్టపోయింది అయిదొందలవుతుంది. ఎందుకంటే ఆనందరావుకి క్లబ్‌రెంట్‌కింద వందరూపాయలు సమర్పించారు కనుక. ఆ తర్వాతరోజు ఎ.బిలు చేరి రెండొందలయాభై పోగొట్టుకుంటే సి,డిలకు చెరో రెండొందలొచ్చింది. మిగతా వంద ఆనందరావు పరమైంది. ఇలా రొటేట్ అవుతూనే ఉంటుంది. ఈ రోజు లాభపడిన వాడు రేపు నష్టపడక తప్పదు. కానీ నిర్వాహకులకు మాత్రం ఎప్పుడూ లాభాలే తప్ప నష్టాలుండవు.

ఓ వ్యక్తి కోడిపందాలాడి వెయ్యి సంపాదిస్తాడు. ఆ ఉత్సాహంతో ఆ రాత్రి మరికొంచెం ఎక్కువతాగి ఫ్రెండ్స్‌కు తాపి విందు భోజనంతో జల్సాచేస్తాడు. అయిదొందల దాకా ఖర్చుపెడతాడు. రెండోరోజు అదే పందాల్లో 'వెయ్యి' పోగొట్టుకుంటాడు. నిన్న లాభించిందానికీ, ఈ రోజుకీ చెల్లు అనుకుంటాడు. మరి జేబులో తక్కువైన అయిదొందల మాటో అది అతనికి అప్రస్తుతం. ఇలా ఉంటాయి జూదగాళ్ళ లాభాలు.

లాటరీలూ అంతే

ఈనాడు దేశంలో కొన్ని వందల లాటరీలు చలామణీ అవుతున్నాయి. ప్రతిరోజు ఎక్కడో చోట ఏదో ఒకటి. ఒకటేమిటి కనీసం నలభై యాభై అయినా డ్రా అవుతూనే ఉంటాయి. కానీ ఫలితం ఎవరికి దక్కుతుందో ఎవరికీ అర్థంకాదు. కేవలం నిర్వాహకులికి తప్ప.

మొత్తం బహుమతుల విలువ లక్షరూపాయలైతే ఇరవైలక్షల విలువ చేసే టికెట్లు ప్రింటవుతాయి. కనిష్ట బహుమతులు మాత్రం గ్రహీతలకి, అగ్రశ్రేణి బహుమతులు మిగిలిన టికెట్లకీ.

సారా దురాచారమనీ, ప్రాణాంతకమనీ ప్రభుత్వాలకీ తెలుసు ప్రజలకీ తెలుసు అయినా నిషేధించరు. అలా నిషేధిస్తే ప్రభుత్వాలకి నష్టం. వాళ్ళ ఆదాయం కోసం ప్రజలపై ప్రభుత్వం విసురుతున్న అంటువ్యాధి ఈ మద్యపానం. ప్రతిరోజూ 'కల్తీసారా తాగి మృతి' అనే వార్తలు చదువుతున్నా ఆ వ్యసనాన్ని దూరం చేసుకోలేకపోవటం ప్రజల బలహీనత.

పురుగుల్ని వెలుతుర్లా ఆశాపరులను ఆకర్షించే రాక్షసక్రీడ రేసెస్. రేస్‌క్లబ్‌ల నియంత్రణకు వెచ్చించే లక్షలాది రూపాయలు ఎవరిసొమ్మో అర్థం చేసుకోలేని ఆశాపరులు.

వ్యసనపరుల జీవితాలు మంచుపల్లకీల్లాంటివి. గెలుపు చల్లగా హాయిగా ఉన్నతంగా ఉంటుంది. ఓటమి వేడై కరిగించేస్తుంది. నీరులా కారిపోతారు. అంతే!

★





# చిదంబర రహస్యం

'చిదంబరం' పేరు వినగానే చటుక్కున 'చిదంబర రహస్యం' అనే నానుడి గుర్తుకురావడం సహజం. ఇద్దరు వ్యక్తులు జరిపిన రహస్య మంతనాలను- ''ఏమిటో ఆ చిదంబర రహస్యం!''- అనే నుడికార ప్రయోగంతో సూచించడం పరిపాటి. 'చిదంబర రహస్యం' అనే సమాసానికి అర్థం నిజానికి ఆధ్యాత్మికపరమైందేగాని లౌకికపరమైంది కాదు. ఇలాంటిదే మరోప్రయోగం —'లోగుట్టు పెరుమాళ్ళుకెరుక' అనేది. ఇది కూడా ఆధ్యాత్మికమైనదే. అయితే దీనికి లౌకికార్థం విస్తృతంగా ఉంది. విశేషమేమిటంటే ఈ ప్రయోగాలన్నీ మనకు ద్రవిడ దేశం నుంచి దిగుమతైనవే. తమిళనాడు ద్రవిడ సాంప్రదాయానికి ఉనికిపట్టు అవటం ఇందుకు కారణం. ''కథ 'కంచి'కి చేరింది'' —సామెతలోని 'కంచి' (కాంచీ

చిదంబరంనటరాజు దేవాలయం

పురం), ''లైసెన్సుల కుంభకోణం'' అనే ప్రయోగంలోని 'కుంభకోణం', 'చిదంబర రహస్యం'లోని చిదంబరం— తమిళనాడులోని ఊళ్లపేర్లే. ఇలాంటి చిన్నచిన్న సాంప్రదాయాన్ని విశ్లేషణలతో చూస్తే, మొత్తం మీద తమిళనాడుకు కర్నాటక, ఆంధ్ర, మహారాష్ట్ర, కేరళ భాషా సంస్కృతులపై ప్రభావం ఉందని చెప్పడానికి ఉదాహరణలు చాలానే దొరుకుతాయి. అంతటి విశిష్ఠత తమిళనాడు పొందటానికి కారణం ద్రవిడ సంస్కృతికి ఉనికిపట్టయి ఆధ్యాత్మికంగా, చారిత్రకంగా ఉత్తర భారతానికి, ఆర్యసంస్కృతికి సాటిగా నిలవటమే! భారతదేశంలో చరిత్ర ఎప్పుడూ ఆధ్యాత్మికతనుపెనవేసుకొనే సాగింది. ఒకటి లేకుండా, రెండవది మనుగడ సాగించలేదు.

## వెయ్యేళ్ళ దేవాలయ ప్రాభవం

ఉత్తరభారతంలో దేవాలయాల వైభవం, సుమారు 320-650 ఎ.డి.ల ప్రాంతంలో మొదలయిందని తెలుస్తోంది. ఈ కాలాన్ని గుప్తరాజుల స్వర్ణయుగంగా భావించవచ్చు. ఈ దేవాలయాలవైభవం, నిర్మాణం అంతా ఒక ప్రత్యేకమైన 'నాగర' శిల్ప నిర్మాణంలో జరిగింది. దక్షిణాన ఆదేకాలంలో సుమారు 500-800 ఎ.డి. ప్రాంతంలో దేవాలయ వైభవం ప్రాణం పోసుకుంది. ఈ కాలంలో దక్షిణాన ప్రసిద్ధులైన పల్లవులు (కంచి, మహాబలిపురం), బాదామీ చాళుక్యులు, మధురై పాండ్యరాజు (మధురమీ

నాక్షి దేవాలయం)ల చేతిమీదుగా అతిపెద్దదేవాలయాల నిర్మాణాలు జరిగి, దేవాలయ ప్రాభవం శిఖరాలను అందుకొంది. 8వ శతాబ్దంలో చాళుక్యుల పతనానంతరం రాష్ట్రకూటులు దక్షిణాన దేవాలయ సాంస్కృతిక ప్రాభవాన్ని మరింత పునరుజ్జీవింపచేశారు. ఈ దేవాలయాలన్నింటికీ చారిత్రక ప్రాధాన్యత ఎంతఉందో, ఆధ్యాత్మిక ప్రాధాన్యత కూడా అంతా ఉండటం విశేషం. మానవజాతిలోని భిన్నరుచులవారికి ఈ దేవాలయాలు దర్పణాలయినయి అంటే అతిశయోక్తికాదు. శిల్పకళ, సంగీతం, నాట్యశాస్త్రం వంటి ఉన్నతకళలు మేధావివర్గాలను ఆకర్షిస్తే, ఆధ్యాత్మికత భక్తకోటిని ఆకర్షించింది.

వాస్తు సూత్రాలకు మూలాధారం బ్రహ్మసూత్రాలు, పురాణాలు, ఆగమాలు. ఇవిగాక తాంత్రిక సాహిత్యం, బృహత్ సంహిత కూడ దేవాలయ వాస్తుశాస్త్రంలో ప్రక్షిప్తం అయినాయి. మొత్తంమీద దేవాలయ నిర్మాణంలో నాగర, ద్రావిడ, వేసార అనే మూడు పద్ధతులను ఈ సాహిత్యం రూపకల్పన చేసింది. దక్షిణాన ముఖ్యంగా తమిళనాడులో కన్పించే దేవాలయాన్నీ ద్రావిడ, వేసార మిశ్రాలే. తంజావూరులోని బృహదీశ్వరాలయం, చిదంబరంలోని నటరాజ ఆలయం చోళరాజులకాలంలోనే నిర్మితమైందని శాసనాల ఆధారంగా తెలుస్తోంది. బృహదీశ్వరాలయం (బృహత్=పెద్దది, ఈశ్వర=ఈశ్వరుడు)లోని గర్భగుడిపైన ఒకేరాతితో 66 మీటర్ల ఎత్తు గోపురాన్ని నిర్మించటం ఆ కాలం సాంకేతిక నిపుణతకు అద్దం పడుతుంది. సుమారు 600 ఎ.డి. నుండి 1600 ఎ.డి. వరకు వెయ్యి సంవత్సరాలపాటు సుదీర్ఘంగా సాగిన దేవాలయ ప్రాభవం తమిళనాడుకు ప్రపంచవ్యాప్తంగా ఎనలేని ఘనతను తెచ్చిపెట్టింది. పల్లవుల (600ఎ.డి) నాటి కాంచీపురం, మహాబలిపురం శిల్పకళ శివకంచి, విష్ణుకంచి దేవాలయాలు, విజయనగరరాజుల కాలంలో నిర్మితమైన మధురమీనాక్షీ దేవాలయం (1350 ఎడి-1565ఎడి), చోళరాజులకాలంలో దేవాలయం (1000 ఎ.డి) సువిశాలమైనవి.



ఒకేచోట నిల్చుని శివుడినీ, గోవిందరాజునీ దర్శించే వైనం - హరిహరులకు అభేదంచాటే సాంప్రదాయం.

నటరాజ దేవాలయంలోనే వున్న మురుగన్ ఆలయపు శిల్పకళ.

## చిదంబర నటరాజాలయం

సుమారు పదిహేను వందల ఎకరాలలో విస్తరించిన నటరాజస్వామి దేవాలయ నాలుగు గోపురాల చుట్టు అల్లుకొన్న ఊరే చిదంబరం.

చిదంబరం మద్రాసు నుంచి సుమారు 250 కిలోమీటర్ల దూరంలో ఉంది. చిదంబరం దేవాలయానికి తమిళ సాంప్రదాయంలో అనేక పేర్లు ఉన్నాయి. 'తిల్లై', 'పులియు' వంటి మాటలు 'చిదంబరం' అనే అర్థాన్ని సూచిస్తాయి. 'పులియు', 'పులి పాలి'- అంటే మహర్షులని అర్థం. 'తిల్లై' అంటే చెట్టు అని అర్థంకూడా ఉంది.

పూర్వం శివుడు వ్యాఘ్రపాద మహర్షి రూపంలో ఇక్కడ చాలాకాలం తపస్సు చేశాడని తమిళ గ్రంథాలు సూచిస్తున్నాయి. పెరుంబట్టు పులియు మహర్షి కూడా ఇక్కడ తపస్సు చేశారని కొన్ని శాస్త్రాలు తెలుపుతున్నాయి.

తమిళ సాంప్రదాయంలో 'కోయిల్' అంటే రెండర్థాలున్నాయి. ఒకటి శైవభక్తుల ప్రతీకైన చిదంబర నటరాజస్వామి ఆలయం. రెండవది వైష్ణవ భక్తుల హృదయమైన తిరుచినాపల్లి శ్రీరంగనాథ దేవాలయం. (శ్రీరంగంలో ఉంది).





లభ్యమైన శాసనాల ప్రకారం నటరాజ దేవాలయాన్ని 900 ఎ.డిలో ఆదిత్య చోళ నిర్మించాడని తెలుస్తోంది. నటరాజ స్వామి దేవాలయ ప్రాంగణంలో అనేక ఇతర దేవతల ఆలయాలు ఉన్నాయి. 1500 ఎ.డిలో అచ్యుత దేవరాయలు గోవిందరాజు గుడిని నటరాజు గుడికి ఎడమవైపుగా కట్టించటం జరిగింది. అయితే ఈ చర్యను గర్హిస్తూ అనేకమంది శైవదీక్షితులు ఆత్మహత్యకు పాల్పడ్డారని చారిత్రక సత్యాలు వెల్లడిస్తున్నాయి. కుళశేఖర ఆళ్వా, అనేక నాయన్మార్‌లు నటరాజస్వామిని ప్రస్తుతిస్తూ రాసిన గీతమాలికలు, పద్యగ్రంథాలు లభించినా వీటి రచనాకాలం ఇదమిత్థంగా తెలియదు. విష్ణువుకు ప్రతీకగా గోవిందరాజులు, శివుడికి ప్రతీకగా నటరాజు ఒకేచోటి నుంచి హరి, హరులుగా దర్శనం ఇస్తారీ దేవాలయంలో.

ఈ దేవాలయప్రాంగణం చుట్టూ ఈనాటికీ ఎంతో గొప్పగా శోభిల్లే ప్రకృతి సంపదను, పూలతోటను, చక్కని వనాలను రాజరాజరాజేంద్రచోళుడు కట్టించాడని శాసనాల ఆధారంగా తెలుస్తోంది.

దేవాలయ మధ్యన గర్భగుడిలో నెలకొని ఉన్న నటరాజు విగ్రహం పదవశతాబ్దంకన్నా పాతది కాదని శాస్త్రవేత్తల అభిప్రాయం. గర్భగుడిలో రెండు నటరాజ విగ్రహాలున్నాయి. వాటిలో ఒకటి ఎమరాల్డుతో చేసినది చాలా చిన్నది. ఇది చూపరులకు దర్శనసమయంలో కన్పించదు. రెండవ విగ్రహం 'చతుర తాండవ' భంగిమలో ఉంటుంది. దీన్ని పంచలోహాలతో చేశారు. ఈ విగ్రహాన్నే భక్తులు దర్శించుకొనేందుకు వీలుగా ప్రతిష్ఠించారు.

ఈ దేవాలయానికి నలువైపులా ఉన్న నాలుగు ద్వారాలు పెద్దపెద్ద గోపురాలు. వాటి శిల్పకళ అద్భుతమైంది. ఒక్కో గోపుర ద్వారం గోడలపైన భరతనాట్యానికి చెందిన 108 నృత్యరీతుల భంగిమలుంటాయి. తూర్పు ముఖ గోపురాన్ని కోప్పుంగ సింగరాజు నిర్మించారు. దక్షిణ ముఖగోపురాన్ని సుందర పాండ్యరాజు నిర్మించారు. ఉత్తర ముఖద్వారం బాగా కూలి



నటరాజు దేవాలయానికి పడమరవైపున్న వేయి మంటపాల నాట్యభవనం.



బంగారు తొడుగు విమానంలో నటరాజ గర్భగుడి.

పోగా, కృష్ణదేవరాయలు పునర్మించారు. ఈ ఉత్తర ముఖద్వారం మొదట్లో ఈ విషయాన్ని ప్రకటించే శిలాశాసనాన్ని ఇప్పటికీ చూడవచ్చు. ఆ పక్కనే కృష్ణరాయలు, ఆయన ఇద్దరి భార్యల విగ్రహాలు కనిపిస్తాయి. పశ్చిమ ద్వారాన్ని కోప్పుంగ సింగరాజు నిర్మించారు.

ఈ దేవాలయప్రాంగణంలోని అనేక దేవాలయాలలో వినాయకుడి దేవాలయం, సుబ్రహ్మణ్యస్వామి దేవాలయం, అర్ధనారీశ్వర దేవాలయం, గంగాళ్మూర్తి దేవాలయం, కాళీనృత్య భంగిమ కన్పించే దేవాలయం ముఖ్యమైనవి. ఈ దేవాలయంలోకి దక్షిణ, తూర్పు ప్రాంగణాలలోంచి ప్రవేశించగానే పెద్దపెద్ద నందీశ్వర విగ్రహాలు సాక్షాత్కరిస్తాయి. లేపాక్షి, బృహదీశ్వర ఆలయాలలోని నంది విగ్రహాల తర్వాత ఈ నందివిగ్రహాలే భారతదేశంలోకెల్లా పెద్దవని చెప్పవచ్చు. దక్షిణ ముఖద్వారం దగ్గరే భారతదేశంలో కెల్లా పెద్ద వినాయకుడి దేవాలయం ఉంది. ఈ దేవాలయంలోనే సిద్ధి, బుద్ధి అనే వినాయకుని భార్యల దర్శనం కూడా లభిస్తుంది.

## శైవ సంప్రదాయంపై చేయి:

తమిళనాడున శైవ, వైష్ణవాలలో శైవమే ఎక్కువ వర్ధిల్లిందని చెప్పుకోవచ్చు. ద్రవిడ సంప్రదాయంలో శైవారాధన విశిష్ఠతతోపాటు శివుడి కుమారుడైన సుబ్రహ్మణ్యస్వామి (మురుగన్) ఆరాధన ఎక్కువ. తర్వాత స్థానం వినాయకుడిది. తమిళనాడున ఊరూర, వాడవాడలా వినాయక, సుబ్రహ్మణ్యంల గుళ్ళు సాక్షాత్కరిస్తాయి. అక్కడక్కడా సరస్వతీ దేవాలయం కూడా సాక్షాత్కరిస్తుంది.

భారతదేశంలో సరస్వతీ దేవాలయాలు కాశ్మీర్‌లోనూ, ఆంధ్రదేశంలోని బాసర్‌లోనే ఉన్నాయని ప్రజల విశ్వాసం. కాని, తమిళనాడులో ఎవ్వరూఊహించనంతగాసరస్వతీవిగ్రహాలు ప్రతిచోటా సాక్షాత్కరిస్తాయి. ముఖ్యంగా బృహదీశ్వరాలయంలో వీణా పుస్తకధారిణైన సరస్వతీ





ఆరాధన కన్పిస్తుంది. అలాగే చిదంబర నట రాజస్వామి ఆలయంలోనూ చిదంబరం ఊరి లోనూ, పరిసర ఊళ్ళలోను సరస్వతీ ఆలయా లు, విగ్రహాలు తరుచూ దర్శనమిస్తాయి.

ఆంధ్రులకు వెంకటేశ్వరస్వామి ఎలా ఇల వేలుపో, తమిళులకు శివుడు, మురుగ (సుబ్ర హ్మణ్యస్వామి), వినాయకులు ఇలవేలుపులు. సుబ్రహ్మణ్యస్వామి ప్రాధాన్యం వహించే ఆరు దేవాలయాలు తమిళనాడులోనే ఉన్నాయి. సు బ్రహ్మణ్యేశ్వరుడని తమిళులు ఆరాధించే సు బ్రహ్మణ్యస్వామికి ఆరు ముఖాలు అని, ఒక్కో ముఖానికి ఒక్కో దేవాలయం ప్రాధాన్యత వహిస్తుందని తమిళశాస్త్ర గ్రంథాలు వివరిస్తు న్నాయి. చిదంబరం నటరాజస్వామి ఆల యంలో కూడ సుబ్రహ్మణ్యస్వామి కోవెలలు అనేకం సాక్షాత్కరిస్తాయి.

పడమర ముఖద్వారం వైపు బాగా [illegible] వెళ్తే కనిపించే సుబ్రహ్మణ్యేశ్వరాలయం ఒక [illegible]తి గుహలో భూగర్భంలో నిర్మితమై ఉంది. ఈ గుహ గోడలపైన అద్భుత పెయింటింగ్‌లు ఉన్నాయి. వాటిలో రెండు పెయింటింగ్‌లలోని ఏనుగులను ఎటునుంచి చూసినాఅవి మనవై పే ముఖంపెట్టి ఉన్నట్టు స్పష్టంగా దర్శించగ లుగుతాం. అయితే ఇవి పురాతనమైనవికావు. కాకపోతే ఆ గుహలోని కోణంను గుర్తించి గీచిన పెయింటింగ్‌లవటం వలన ఈ విచిత్రావ కాశం చూపరులకు లభించింది.

నటరాజాలయ ప్రాంగణంలో అతిపెద్ద పుష్కరిణి ఉంది. పుష్కరిణికి ఎడమవైపున వేయి మంటపాల మందిరం ఉంది. ఈ వేయి మంటపాల నాట్య సభ నిర్మాణం పల్లవులనా టిది. కంచిలోనూ, మధురైలోనూ ఇటువంటి వేయి మంటపాల నిర్మాణాలను చూడవచ్చు. ఇవి ఆనాటి రాజులు కోవెలలో భక్తినృత్యాలు తిలకించటానికి కట్టించిన నాట్య మంటపాలు చిదంబరం నటరాజ దేవాలయంలో 'మానవి ళ్‌కుత్తన్' అని మరోపేరు కూడా ఉన్న కళింగ రాయలు ఈ వేయిమంటపాల దేవాలయాన్ని పుష్కరిణిని నిర్మించాడు. ఇది ఆలయానికి



పుష్కరిణి నుంచి చూస్తే కనిపించే దక్షిణ, తూర్పు ద్వార గోపురాలు.



వేయి మంటపాల భవనం ముందు దృశ్యం

పడమర ద్వారం వైపున ఉంది.

పడమర ద్వారం వైపునుంచి ఉత్తరద్వారం వైపుకు వెళ్ళే దారిలో ఒకచోట రెండు ఒంటి రాయి స్తంభాలు నాటి ఉంచారు. ఇక్కడ నుంచొని చూస్తే ఆలయ నాలుగు గోపురాలు ఒకేసారి కన్పిస్తాయి. ఇక్కడనుంచి మినహా మరెక్కడ నుంచొని చూసినా ఆలయ గోపురాలు నాలుగు కనిపించవు. ఇక్కడనుంచి ఆలయ గర్భగుడి బంగారుశిఖరం, మేరు పర్వతంకూడా స్పష్టంగా చూడగలం.

ఆలయ ప్రాకారాన్ని ఆనుకొని అనేక మంటపాలు, గదులు ఉంటాయి. దేవాలయం నలువైపులా విస్తరించి ఉన్న సువిశాల ప్రాకారంలో ఉండే ఈ గదుల్లో తీర్థయాత్రికులు విశ్రమించేవారు. రాజభటులు దేవాలయానికి కాపలా నుంచొనే వారు. ఈ ప్రాకారాన్ని రెండవ కుళోత్తుంగ చోళుడు కట్టించాడని శాసనాలు చెప్తున్నాయి.

చారిత్రక, ఆధ్యాత్మిక ప్రాధాన్యం గల నటరాజస్వామి దేవాలయమేగాక చిదంబరంలో ఇతర దేవాలయాలు కూడా ఉన్నాయి. వీటిలో ఒకటైన అనంతేశ్వర దేవాలయం 1000 ఎ.డి.లో పరాంతకుడు కట్టించినట్లు అక్కడ లభించిన శాసనాలు చెపుతున్నాయి. అదిగాక, సిర్‌కాళి, తిళ్ళైకాళీ దేవాలయాలు నటరాజస్వామి దేవాలయానికి తూర్పున ఉన్నాయి. వీటిని కూడా కుళోత్తుంగుడే నిర్మించాడని అనేక శాసనాల ఆధారం ఉంది.

ఆధ్యాత్మికతత్వం ప్రకారం సృష్టిక్రమం, పరిణామం 24 అంశాలతో కూడుకొన్నట్లు స్పష్టమవుతుంది. మన పూర్వీకులైన పతంజలి, కపిల, గౌతమి, జైమినీ, పిప్పలాయన, వ్యాస మహర్షులు ప్రతిపాదించిన అనేక యోగ సూత్రాలాధారంగా ఆత్మసాక్షాత్కారం పొందిన యోగులు భగవంతుడిని, ఆయన నుంచి ఉద్భవించి, ఆయనలో లీనమవుతున్న సృష్టికాలాన్ని స్పష్టంగా దర్శించగలిగారు. వారిచ్చిన వివరణలాధారంగా భగవంతుడినుంచి సృష్టి త్రిగుణాలలో, పంచభూతాల సాయంతో సంక





ల్పమాత్రంగా ఆవిర్భవించిందని తెలుస్తోంది.

మరో మాటలో చెప్పాలంటే సృష్టిక్రమంలో తప్పనిసరిగా మేళవిస్తున్న 24 అంశాలలో బుద్ధి, అహంకారము, పంచభూతాలైన ఆకాశము, నీరు, గాలి, పృథివి, అగ్ని, పంచేంద్రియాలైన కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము, పంచతన్మాత్రలు, పంచ ప్రాణాలు, మనస్సులాంటివి ముఖ్యమైనవి. వీటి మేళవింపుతో సృష్టి క్రమం ఎలా జరుగుతున్నదన్నది మరో అద్భుత ఆధ్యాత్మిక ప్రపంచం.

అయితే ఈ ఇరవైనాలుగు అంశాలూ భగవంతుడినుంచే ఉద్భవించి, ఆయనలోనే లయమవుతున్నాయికాబట్టి వీటిలో ప్రతి ఒక్కటీ ఆయనే అయివున్నాడు. వాటిలో ఒకటైన పంచభూతాలు కూడా ఆయనే. పంచభూతాలు అంటే ఆకాశం, నీరు, భూమి, వాయువు, అగ్ని. వీటిలో ఒకటైన 'ఆకాశం' కూడా భగవంతుడేనని ఆధ్యాత్మికులు గ్రహించారు. అటువంటి 'ఆకాశం'ను నటరాజస్వామి దేవాలయంలో ప్రతిష్ఠించారు. 'ఆకాశం'ను ప్రతిష్ఠించటం ఎలా, దాన్ని దర్శించటం ఎలా అన్న తాత్కాలికమైన ప్రశ్నలకు నేటి గణితశాస్త్రం, సైన్సు కూడా సమాధానాలు చెప్తాయి. ఐన్‌స్టీన్ 'ఈథర్' అనేది ఒకటుందని విశ్వసిస్తూ 'సాపేక్ష సిద్ధాంతాన్ని' ప్రకటించాడు. అలాగే గణితశాస్త్రంలో ఒక రాశిని ఊహించి దానిపై లెక్కలు తాత్కాలికంగా కట్టి, ఫలితాన్ని ప్రయోగపూర్వకంగా రుజువు చేసుకొన్నాక తాము ఊహించిన 'రాశి' సరైనదేనని నిర్ధారిస్తారు. ఆధ్యాత్మిక విషయంలో కూడా ప్రయోగం, అనుభవం, నిరూపణకు, నిర్ధారణకు హేతువులు. రాజయోగ ప్రకారంగాని, భక్తి కర్మ, జ్ఞానయోగాల సాధన ద్వారాగాని ఆత్మసాక్షాత్కారం పొందిన వ్యక్తికి పంచభూతాలలోని ఆకాశం అక్కడా ఉందని సర్వేసర్వత్రా ఉందని స్పష్టంగా తెలుస్తుంది. కాని, సాధారణ వ్యక్తికి తెలియదు. ఎందుకంటే సాధారణ వ్యక్తి ఎటువంటి ఆధ్యాత్మిక సాధన చేయలేదు. తెల్లనికాంతి ఏడురంగుల మిశ్రమం అని ప్రతి శాస్త్రవేత్తకూ తెలుసు. కానీ మామూలు వ్యక్తికి, పల్లెటూరి రైతుకు తెలుసా? అతనెప్పుడైనా దాన్ని కంటితో స్వయంగా చూశాడా?- చూడలేదు. శాస్త్రవేత్తలు చెప్పింది విశ్వసించటమే అతని పని. అవసరమైతే అతను రుజువు చేసుకోవచ్చు.

అలానే అక్కడ ప్రతిష్ఠితమైన పంచభూతాల్లోని 'ఆకాశం'ను మనం దర్శించలేమన్నది స్పష్టం. కాని నటరాజస్వామి (శివుడు - జగదీశ్వరుడైన శివుడని భావన) నృత్యం చేస్తుంటే ఆ వేగం కూడా మనం కంటితో చూడలేం. ఎలాగైతే ఒక సినిమా రీలు తిరగాల్సిన వేగంకంటే ఎక్కువ తిరిగితే, తెల్లని ఫిల్ము మాత్రమే కన్పిస్తుందో, అలాగే నటరాజస్వామి మనిషి ఊహకందని వేగంతో నృత్యం చేసినా మనకు కనిపించదు. అందువల్ల నృత్యంచేసే నటరాజ భంగిమను ఆకాశం బదులుగా ఊహించుకోవల్సిందని ఆధ్యాత్మిక జ్ఞానసంపన్నుల సూచన. అంటే నర్తనచేసే నటరాజు బదులు పంచభూతాల్లో ఒకటైన 'ఆకాశం' మూలకానికి ప్రతీక అన్నమాట. నటరాజ విగ్రహం వెనుక ప్రతిష్ఠితమైన ఆకాశాన్ని సూచిస్తూ ఒక వస్త్రాన్ని గోడకు అలంకరిస్తారు. ఆ వస్త్రం వెనుక ఆకాశాన్ని అలరిస్తున్నట్లు బిల్వదళాలతో చేసిన దండను గోడకు అలంకరిస్తారు. నర్తనచేసే నటరాజు కుడిపాదం ఈ పవిత్ర వస్త్రాన్ని దాని వెనుకనున్న బిల్వ దళమాలను దర్శించమని భక్తులకు సూచిస్తుంటుంది. నటరాజస్వామిని దర్శించినవారు దీనిని అర్థం చేసుకోక 'అక్కడేమీ లేదు. అదే చిదంబర రహస్యం' అంటారు. ఆధ్యాత్మిక భావం కలవారు మాత్రం పంచభూత సమమైన నటరాజును దర్శించి- చిదంబరం- అంటే 'జ్ఞానాకాశం' (చిత్= జ్ఞానం, అంబరం= ఆకాశం) దర్శించిన ఆనందాన్ని పొందుతారు. ఇలా పంచభూతాలైన ఒక్కొక్కదానికి పూర్వం ఒక్క దేవాలయం ఉండేది.

ఏది ఏమైనా ఆధ్యాత్మిక విశ్వాసంలేనివారు 'చిదంబర రహస్యం' విని పెదవి విరవటం పరిపాటే. ఆధ్యాత్మిక జ్ఞానం కలిగినవారు పంచభూతములు ముఖపంచకమై... అని నటరాజును కీర్తించి ఆయన పాద సుమరజాన్ని శిరస్సున ధరించి వస్తారు.

**— గిరిజానారాయణ్**









# మియామి కుషన్

డిస్ట్రిబ్యూటర్స్:

**ప్రాఫిటబుల్ ఫుట్‌వేర్**

# చతుర ప్రపంచం

## దేవుడిలాంటి భర్త కావాలంటే...

భార్యాభర్తలిద్దరూ ఉద్యోగస్థులైనప్పుడు ఇంటి పనిలోనూ, వంటపనిలోనూ భాగం పంచుకోకుంటే పనులు సకాలంలో కాక ఎన్నో ఇబ్బంది లెదుర్కోవల్సి వస్తుంది. అయినా ఆఫీసు వదలంగానే అటునించటే ఏ క్లబ్బుకోపోయి తీరిగ్గా తొమ్మిదింటికో, పదింటికో ఇంటికి చేరే భర్తలూ ఉన్నారు. భార్య కూడా తమలాగే ఉద్యోగం చేసి అలసిపోయి ఉంటుందనీ, ఆమెకు కాస్త సాయపడదామనే స్పృహే ఉండదీ మహానుభావులకు. ఇద్దరూ ఒకే సమయానికి ఆఫీసుకి బయలుదేరడం, ఒకే సమయానికి ఇంటికి చేరడం జరిగినా కొందరు పతిదేవులకు అన్నీ రాజోపచారాల్లా జరగాల్సిందే! పూచికపుల్ల అవతలపెట్టని ఈ పెద్దమనుషుల దృష్టిలో వంటపని, ఇంటిపని అనేవి ఆడవాళ్లకు ప్రత్యేకం. తమ పని హాయిగా కాలుమీద కాలు వేసుకుని ఆజ్ఞలు జారీచేయటమే. మనకి నిత్యం తారసపడుతుండే వీరి సంఖ్యలో ప్రథమస్థానం పాకిస్తాన్‌దేనట. అమెరికాలోని బాల్టిమోర్‌కి చెందిన 'ఇంటర్నేషనల్ ఉమన్స్‌లీగ్' నిర్వహించిన సర్వేలో 98 శాతం పాకిస్తానీ పురుషులు వంటపనిలో భార్యకు ఏమాత్రం సహకరించరని తేలింది. "వంట పని మగవారు చేయడం మా మతగ్రంథం 'ఖురాన్'కి విరుద్ధం" అని దబాయిస్తారు వారు.

అయితే భార్యలకి సాయపడే వారిలో ఆస్ట్రేలియన్లని ప్రముఖంగా చెప్పుకోవచ్చునని వెల్లడించిందా సర్వే. అక్కడి వారు సగటున రోజుకు మూడున్నర గంటలపాటు భార్యలకి ఇంటిపని - వంటపనులలో సాయంచేస్తారు. ఆదివారం నాడైతే- ఆఫీసర్ స్థాయి వారైనా సరే బట్టలు ఉతకడం, పిల్లలకి పాలు పట్టడంతోపాటు వంటకూడా చేసి భార్యాబిడ్డలకి కొసరికొసరి తినిపిస్తారట. ఆ తర్వాత అంట్లు తోమే కార్యక్రమాన్ని కూడా దిగ్విజయంగా నిర్వహించి భార్యలను సంతోషపెడతారు వారు. అవసరమైతే ఇల్లు కడగటానికి కూడా ఆ 'ఉత్తమ భర్తలు' వెనుదీయరు. కనుక దేవుడిలాంటి భర్తలు కావాలంటే అమ్మాయిలంతా ఆస్ట్రేలియాకు పరుగులెత్తాల్సిందేనన్నమాట!





## వింత ప్రతిధ్వనులు

లోతైన లోయలు, ఎత్తయిన పర్వతాలవద్ద నిలబడి గట్టిగా అరిస్తే ఆ శబ్దం మళ్లీమళ్లీ ప్రతిధ్వనిస్తుందని మనందరికీ తెలుసు. పెద్ద పెద్ద బిల్డింగులలో కూడా ఈ 'రీసౌండ్ ఎఫెక్టు' ఉండటం చూస్తూనే ఉన్నాం. అయితే కొన్ని ప్రదేశాలలో విన్పించే ప్రతిధ్వనులు మాత్రం చాలా తమాషాగా ఉంటాయి.

రోమ్‌లోని కంబానా స్మశానవాటికలోనున్న నల్లా సమాధివద్ద నిలబడి ఏదైనా పాడితే ఆ పాట మళ్లీ ప్రతిధ్వనిస్తుంది. గమ్మత్తేమిటంటే పాటలు మాత్రమేగానీ మాటలు ఇలా తిరిగి రీసౌండ్ ఇవ్వవు. పీసా టవర్ లోపల నిలబడి పాడితే దాని ప్రతిధ్వని పాత గ్రామఫోన్ రికార్డు పాటలా తిరిగి విన్పిస్తుంది. అలాగే అక్కడ ఏ వాద్యపరికరం వాయించినా గ్రామఫోన్ రికార్డు లోంచి వచ్చినట్లే దాని ప్రతిధ్వని విన్పిస్తుందట.

స్పెయిన్‌లోని మెనాయివద్ద ఓ వ్రేలాడే వంతెన ఉంది. ఆ వంతెన తాలూకు ఇనువరాడ్లలో దేన్నయినా మనం ఓ ప్రక్కన ఏ రాయితోనో కొట్టామనుకోండి. ఆ శబ్దం ఆరాడ్ మీదుగా ప్రయాణించి రెండోవైపుకు చేరి అక్కడ ప్రతిధ్వనిస్తుంది.

తమిళనాడులోని తిరువాయూరు దేవాలయం మధ్య నిలబడి చప్పట్లు కొడితే ఆ శబ్దం తిరిగి 7 సార్లు మార్మోగుతుంది. అందాకా ఎందుకు? మన హైదరాబాద్‌లోని గోల్కొండ కోటముఖద్వారం సమీపంలో నిలబడి చప్పట్లు చరిస్తే ఆ శబ్దం కోటపై భాగాన్నించి తిరిగి ప్రతిధ్వనించడం ఆ కోటను దర్శించిన వారందరికీ అనుభవమేగదా.

## ముల్లంగి వేణువు

ఆస్ట్రేలియాకు చెందిన 37 ఏళ్ల గ్రెగ్లిన్, సంగీత విద్వాంసుల కుటుంబం నుంచి వచ్చిన యువకళాకారుడు. అతడు తన పదోఏట నుంచే వేణుగానంలో తర్ఫీదుపొంది, అనతికాలంలోనే అందరి ప్రశంసలకూ పాత్రుడయ్యాడు. అంతటితో తృప్తిపడక ప్రయోగాత్మకంగా లోహాలతోనూ, ఎముకలతోనూ, కాగితం గుజ్జుతోనూ స్వయంగా వేణువుల్ని తయారుచేశాడు. అవన్నీ వెదురుతో చేసిన వేణువుల్లాగే పనిచేసి 'సెభాష్' అన్పించుకున్నాయి.

తరువాత కూరగాయల్ని మాత్రం ఎందుకు వేణువులుగా ఉపయోగించరాదనే ఆలోచన వచ్చిందతనికి. ఆలోచన వచ్చిందే తడవు వెంటనే వంకాయతో ప్రయోగంచేశాడు. కాని అది సఫలం కాలేదు. ఆ తర్వాత పొట్లకాయల్ని పొడవైన ఆలుగడ్డల్ని ఉపయోగించాడు. కాని లాభం లేకపోయింది. అలా ప్రయోగాలు





చేసిచేసి చివరికి ముల్లంగిదుంపతో వేణువును తయారుచేయడంలో కృతకృత్యుడయ్యాడు.

అందుకోసం అతను పడిన శ్రమ ఇంతా అంతాకాదు. మొదట ఏవేవో మూలికాతైలాలు ముల్లంగి దుంపకుపూసి, దాన్ని రెండునెలల పాటు భూమిలో పాతిపెట్టాడు. అలాచేయడంవల్ల దుంప గట్టిపడుతుందంటాడు గ్రెగ్లిన్. ఆ తర్వాత దాన్ని కొన్నిరోజులపాటు ఎండలో ఉంచాడు. అనంతరం దానిలోపల తొలిచి, డొల్లగా చేసి, రంధ్రాలు పొడిచాడు. అలా ఓ కొత్తరకం వేణువు తయారైంది. పైగా ఆ ముల్లంగి వేణువు మామూలు వేణువులకేమాత్రం తీసిపోకుండా కమ్మగా పాడసాగింది. దీనితో అతడిప్పుడు స్టేజీ, టీ.వి ప్రోగ్రాములు కూడా ఇస్తున్నాడట.



## రైల్వేలు పుష్టి: లాభాలు నష్టి

ఆసియా మొత్తంమీద భారతీయ రైల్వేని మించిన పెద్ద రైల్వేసంస్థ మరొకటి లేదు. ప్రపంచ వ్యాప్తంగా చెప్పాలంటే ఇది నాలుగో స్థానంలో ఉన్నప్పటికీ ఒకే ఒక్క యాజమాన్యం క్రింద ఉన్న అతిపెద్ద సంస్థలలో దీన్నే మొదట పేర్కొనాలి. మన రైలుమార్గాల మొత్తం పొడవు 62,000 కిలోమీటర్లు. నిత్యం 72,000 రైళ్ల మీద సుమారు ఒక కోటీ, పదిలక్షల మంది ప్రయణీకులు తమతమ గమ్యాలకి చేరుతున్నారు. ఏటికేడాది రైలు ప్రయాణికుల సంఖ్య గణనీయంగా పెరిగిపోతోంది. 1950-51లో వారి సంఖ్య 128.41 కోట్లుంటే, 1987-88లలో ఆ సంఖ్య 379.02 కోట్లకి పెరిగింది.

మనదేశంలో 40 ఏళ్లక్రితం వరకూ 93 శాతం రైళ్లు బొగ్గుతోనే నడిచేవి. ప్రస్తుతం 63 శాతం రైళ్లు డీజిల్ ఇంజన్లతో నడుస్తున్నాయి. రైలు ఇంజన్ల పెట్టెల ఎగుమతిలో మనదేశమే ప్రముఖస్థానం అలంకరించింది. ఇక్కడ తయారయ్యే రైలు పెట్టెల్ని, ఇంజన్లని చాలా దేశాలు దిగుమతి చేసుకొంటున్నాయంటేనే వాటి విశిష్ఠతను అంచనా వేయవచ్చు.

మనదేశంలో పశ్చిమబెంగాల్‌లోని చిత్తరంజన్‌లో విద్యుత్ రైలింజన్లు, ఉత్తరప్రదేశ్‌లోని వారణాశిలో డీజిల్ రైలింజన్లు తయారవుతున్నాయి. రైలు పెట్టెల కర్మాగారం మద్రాసులోని పెరంబూర్‌లో ఉంది.

ఇండియన్ రైల్వేని సౌలభ్యంకోసం 9 జోన్లుగా విభజించారు. మద్రాసు హెడ్‌క్వార్టర్సు

గాగల దక్షిణమధ్యరైల్వే ఈ తొమ్మిది జోన్లలోనూ ఉత్తమమైనదిగా ప్రశంసలు చూరగొంది. మన దేశం మొత్తంమీద 7,395 రైలుస్టేషన్లు ఉన్నాయి. వాటిలో కేవలం 1,100 స్టేషన్లలో మాత్రమే ప్రయాణీకులకవసరమైన విశ్రాంతి గదులు, వసతులు లభ్యమౌతున్నాయి.

ఇంతటి భారీ సంస్థకు లాభాలు కూడా దండిగానే వస్తుంటాయని భావిస్తే పొరపాటు వడ్డామన్నమాటే! మన భారతీయ రైల్వేలకి ఏటా సుమారు 1500 కోట్ల రూపాయల నష్టం వస్తోందట. బాప్‌రే...!

## "మన పాప మాస్టారు" అన్నందుకు...

సుమారు 50 సంవత్సరాల కిందటిమాట. అంతవరకూ అన్ని తరగతుల్లోనూ ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడైన ఓ యువకుడు, ఎమ్.ఎ చదువుకోవటానికి ఆర్థిక యిబ్బందులు కలిగించిన అవరోధం వలన ఆ ఉద్దేశం మానుకుని ఉపాధ్యాయశిక్షణలో చేరాడు. ఆ ట్రెయినింగ్ కోర్సులో ఉన్నతస్థానంలో నిలిచి, ప్రతిష్టాత్మకమైన హాల్‌రాయిడ్ స్మారక బహుమతిని సాధించాడు. ఆ తరువాత అక్కౌంటెన్సీకి సంబంధించిన ఒక పోటీపరీక్షలో పాల్గొని, దేశంలోకెల్లా ప్రథముడిగా నిలిచాడు. అతని ప్రతిభకు వెనువెంటనే లాహోర్‌లోని అక్కౌంటెంట్ జనరల్ కార్యాలయంలో ఉద్యోగం దొరికింది. కానీ ఉద్యోగంలో చేరిన మొదటిరోజే తన జీవితం ఆ కార్యాలయంలో నిస్సారంగా గడవనున్నదని గ్రహించి, నెలకు రూ.75 జీతంవచ్చే ఆ ఉద్యోగాన్ని వదులుకుని, నెలకు రూ.41 జీతం వచ్చే ఉపాధ్యాయ వృత్తిలో చేరాడు. ఆ యువకుడే ఆ తరువాత పుస్తక ప్రచురణ ప్రారంభించి, మనదేశంలోకెల్లా పెద్దదైన పుస్తక ప్రచురణా సంస్థల్లో ఒకటైన 'స్టెర్లింగ్ పబ్లిషర్స్ (ప్రైవేట్) లిమిటెడ్" సంస్థకు అధిపతిగా ఉన్నత శిఖరాలకెదిగాడు. "బతకలేక బడిపంతులు" అన్న సామెతను కాలదోషంపట్టించిన ఆయన పేరు ఓ.పి.ఘాయ్. పంజాబ్‌లోని అమృతసర్ జిల్లాలోని ఓ అనామక కుగ్రామంలో జన్మించిన ఓ.పి.ఘాయ్ మెట్రిక్యులేషన్ ద్వితీయశ్రేణిలో పాసయ్యాడు. అప్పట్లో పేరొందిన డి.ఎ.వి.కాలేజ్, జలంధర్‌లో చేరాడాయన. ప్రతిభావంతులైన విద్యార్థులకు కల్పతరువుగా పేరొందిన ఆ కళాశాలలోని మేధావంతులైన యువకుల సాహచర్యం మూలంగానే పట్టుదలతోనూ, కృషితోనూ దేన్నైనా సాధించవచ్చుననే విషయం తాను గ్రహించగలిగాననీ, తన జీవితంలో అభివృద్ధిపునాదులుపడింది అక్కడేననీ చెప్పుకుంటారు ఘాయ్. ఉపాధ్యాయవృత్తిని చేపట్టిన తరువాత ట్యూషన్లు చెప్పడం ద్వారా మరింత అదనపు ఆదాయాన్ని పొందగలిగాడాయన. ఉదయం 4 గంటలనుండి ప్రారంభమైన ఆయన దినచర్యరాత్రి 11 గంటలకు గానీ ముగిసేదికాదు. అలాగని తను పనిచేస్తున్న పాఠశాలను ఏనాడూ నిర్లక్ష్యం చేయలేదు. ఆయన పాఠ్యాంశాలతో బాటు జీవన పోరటాన్ని సాగించవలసిన విధానం గురించి కూడా పిల్లలకు బోధిస్తూ, తానొక గౌరవనీయ ఉపాధ్యాయుడన్న స్థానాన్ని సంపాదించాడు ఘాయ్. లాహోర్‌లోని ఈ పాఠశాలలో ఆయన పనిచేసినంతకాలం, ఏ సంవత్సరంలోనూ నూటికి తొంభైనాలుగుమందికన్నా తక్కువ మంది ఉత్తీర్ణులు కాలేదు.

ఉపాధ్యాయుడిగా కొనసాగుతున్నకాలంలోనే రేఖాగణితంకు సంబంధించిన ఒక పుస్తకాన్ని అనువదించాడాయన. ఆ తరువాత ఇంగ్లీషు వ్యాకరణం గురించి ఒక పుస్తకం వెలువరించాడు. ఆయన రాసిన పుస్తకాల్ని పంజాబ్‌లోని అత్యున్నతమైన పుస్తకసంస్థ ప్రచురించింది. వీటివల్ల ఉపాధ్యాయుడిగా ఆయన కీర్తి ఇనుమడించింది. ఈ పుస్తకాలు బాగా అమ్ముడవటంవలన రాయల్టీ రూపంలో ఘాయ్‌కి కొంత అదనపు సంపాదన లభించింది. ఈ తరుణంలో ఆయన జీవితం మరొక మలుపుతిరిగింది. తను ట్యూషన్ చెబుతున్న ఒక పాపయింటికి ట్యూషన్ నిమిత్తం వెళ్ళాడాయన. ఆయన్నిచూసిన ఆ ఇంటినౌఖరు, "మన పాప మాస్టారు వచ్చారమ్మగారూ" అని తన యజమానురాలికి విన్నవించటం, ఘాయ్ చెవినబ






డింది. 'పాప ఆయా', 'కారు డ్రైవరు' అన్నస్థాయిలో తనను 'పాప మాస్టారు' గా గుర్తించటం ఆయనకు తన వృత్తిపట్ల వైముఖ్యాన్ని కలిగించింది. అప్పటికి అసిస్టెంట్ హెడ్ మాస్టారు స్థాయిలోనున్న ఘాయ్, సన్నిహితులెంతగా వారించినా వినకుండా తన ఉద్యోగానికి రాజీనామా చేశాడు.

ఆ నమయంలో ఘాయ్ మనను పుస్తకప్రచురణ వైపు మొగ్గింది. ఒక స్నేహితుడితో కలిసి ఒక పుస్తకాన్ని ప్రచురించాడు. అది దేశ విభజన నమయం. ఘాయ్ తన మకాం జలంధర్‌కు మార్చాడు. ఆయన భాగస్తుడైన స్నేహితుడు అధ్యాపకుడిగా చేరాడు. ఇక తన మకాంను బొంబాయికి మార్చి, ఒక బంధువుకు చెందిన టెక్స్‌టైల్ ప్రింటింగ్ ఫాక్టరీలో భాగస్వామిగా చేరాడు. అక్కడ కొనసాగిన 2 నంవత్సరాలకాలంలోనూ, తన ఆదాయాన్నంతా పుస్తకాలు కొనటానికి, తన నమయాన్నంతా పుస్తకాలు చదవటానికీ వినియోగించాడు. ఈ అనుభవం తరువాత జీవితం ఆయనకెంతో ఉపయోగపడింది. ఘాయ్ మనను పుస్తక ప్రచురణవైపు మొగ్గుచూపింది. మళ్ళీ జలంధర్‌కు వెళ్ళి, గతంలో తన భాగస్తుడైన స్నేహితుణ్ణి నంప్రదించి, అతనితో కలిసి పుస్తకప్రచురణ ప్రారంభించాడు. వాళ్ళిద్దరూ ఉపాధ్యాయ శిక్షణ పొందిన వారవటమూ, ఉపాధ్యాయులుగా పనిచేసినవారవటమూమూలాన విద్యార్థులకు ఎలాంటి పుస్తకాలు కావాలో ఖచ్చితంగా గ్రహించగలిగారు. ప్రారంభించిన 5,6 నంవత్సరాలకల్లా పంజాబ్‌లో పెద్ద ప్రచురణదారుల స్థాయికెదిగారు వాళ్ళిద్దరూ. ఈ నమయంలో ఘాయ్ జీవితం మరొకమలుపు తిరిగింది.

పుస్తక ప్రచురణ, ఉత్పాదనకు నంబంధించిన ఒక కోర్స్‌లో చేరటానికి ఘాయ్ లండన్ వెళ్ళాడు. రోమ్‌లో జరిగిన ప్రచురణకర్తల అంతర్జాతీయ సదస్సులో మన దేశానికి ప్రాతినిధ్యం వహించాడు. ఆ నదస్సు అంతర్జాతీయ కమిటీసభ్యుడిగా ఎన్నికయ్యాడు. ఆ తరువాత మూడున్నరమాసాలపాటు ఐరోపా దేశాల్లో పర్యటించాడు. ఢిల్లీకివచ్చిన తరువాత అక్కడ ఒక ప్రింటింగ్ కంపెనీని కొనుగోలు చేశాడు. ఘాయ్ తన మిత్రునితో విడిపోయి, జలంధర్‌లో స్టెర్లింగ్ పబ్లిషర్స్ (ప్రైవేట్) లిమిటెడ్‌ను స్థాపించాడు. పంజాబ్‌లో, యూనివర్సిటీ పుస్తకాలను జాతీయం చేసినందున, యితర పుస్తకాలను ప్రచురించనారంభించాడు. తరువాత తన మకాంను ఢిల్లీకి మార్చాడు. త్వరలో ఆయన కుమారుడుకూడా ఆయనతో

పుస్తక ప్రచురణలో చేరాడు. ప్రస్తుతం ఈ సంస్థ, నెలకు సుమారు 15,16 పుస్తకాల చొప్పున ప్రచురిస్తున్నది. పుస్తక ప్రచురణ సంఘం, పరిశోధనా సంస్థలలాంటివాటిని స్థాపించిన ఘాయ్, ఈ రంగంలో విశేష సేవలందించిన భారతీయుల స్మృతి చిహ్నాలను పదిలపరిచే 'ఇండియన్ పబ్లిషింగ్ హాలాఫ్ ఫేమ్' ను స్థాపించాడు. ప్రస్తుతం స్టెర్లింగ్ సంస్థ- అమెరికా, ఇంగ్లండ్, న్యూజిలాండ్, బంగ్లాదేశ్, శ్రీలంక, మలేషియా, ఇండోనేషియావంటి దేశాల్లోని ప్రఖ్యాత ప్రచురణ సంస్థలతో కలిసి సహప్రచురణలు వెలువరించే ప్రయత్నంలోవుంది. ప్రపంచంలోని వేర్వేరు మతాల సారాంశాన్ని విపులీకరిస్తూ, ఆయా మతాలు భిన్నత్వంలోంచి ఒక సమదృక్పథాన్ని ఎలా బోధిస్తున్నాయో తెలుసుకోవటానికి ఉపకరించే గైడ్ లాంటి పుస్తకం—'యూనిటీ ఇన్ డైవర్సిటీ'— అనేదాన్ని సంకలనం చేసి, ఆ పుస్తకానికి సంపాదకత్వం వహించి, వెలువరించాడు ఘాయ్. ప్రస్తుతం ఈ పుస్తకం ఇరవై భాషల్లో వెలువడనున్నది. జీవితంలో ముందుకు సాగడానికి దోహదపడే శిక్షణనిచ్చే వ్యక్తిత్వ వికాస సంస్థనొకదాన్ని స్థాపించాడు ఘాయ్. "నా స్వీయ అనుభవాలు నాకు నేర్పిన పాఠాలను యితరులకూ నేర్పాలని, ఇతరులు కూడా తన జీవితాన్ని ఉన్నతంగా తీర్చిదిద్దుకునేందుకు దోహదపడాలనీ నా సంకల్పం" అంటాడాయన.

## బుల్లితల్లి

తొమ్మిదేళ్ల వయస్సులోనే తల్లిగా మారి మార్తా అనే అమెరికన్ అమ్మాయి గిన్నిస్‌బుక్‌లోకి ఎక్కికూర్చుంది. కొలంబియా జిల్లాలోని అసివేడో గ్రామానికి చెందిన ఈ మార్తాలో మూడేళ్ల వయసునుంచే విపరీతమైన ఎదుగుదల కన్పించసాగింది. అందుకని బడికి పంపకుండా ఆమెని ఇంటిపట్టునే ఉండిపొమ్మన్నారు తల్లిదండ్రులు.



కాఫీ తోటలో కార్మికులైన తల్లిదండ్రులు బయటకు పోవడంతోనే మార్తా ఇంట్లోనే ఒంటరిగా గడపాల్సివచ్చేది. ఆ విషయం కనిపెట్టి పక్కింటి యువకుడొకడు మాయమాటలు చె




ప్పి ఆమెతో స్నేహం కాడు. ఫలితంగా తెలిసీ తెలియని వయస్సులోనే ఆ అమాయ కురాలు అతనితో శారీరక సంబంధం కొనసా గించి తొమ్మిదో ఏటనే గర్భవతయింది. తల్లి దండ్రులు ఈ విషయం తెల్సుకుని లబోదిబో మన్నారు. అబార్షన్ చేయిస్తే పిల్ల ప్రాణం దక్కదని డాక్టర్లు చెప్పడంతో మరింత కృంగిపో యారు. అయితే ఇరుగుపొరుగువారు ధై ర్యంచెప్పి గ్రామంలో చందాలు సేకరించి ఆ బుల్లి గర్భవతికి మంచి మందులు, పుష్ఠికర మైన ఆహారం ఇచ్చి పోషించారు. ప్రసవం కోసం ఆసుపత్రిలో కూడా వాళ్ళే చేర్పించారు.

అక్కడ సిజేరియన్ ఆపరేషన్ చేసి బిడ్డని బయటికి తీశారు డాక్టర్లు. చాలా రక్తం పోయే ప్రమాదం ఉందని డాక్టర్లు భయపడ్డారుగానీ అంతా సజావుగానే జరిగి తల్లీబిడ్డా క్షేమంగా బయటపడ్డారు. బొమ్మలతో ఆడుకునే వయ స్సులోనే- బొమ్మలాంటి రెండున్నర కిలోల ఆడ శిశువుకు 1988 డిసెంబర్, 16న జన్మనిచ్చి చరిత్రకెక్కింది మార్తా. అందరు తల్లుల్లాగే తన బిడ్డకూ స్తన్యమిస్తూ అతి చిన్నవయస్సు లోనే మాతృత్వపు మధురిమల్ని చవిచూస్తున్న మార్తా తన బిడ్డకి అనులూసియా అని పేరుపె ట్టుకొంది.

## భాషాభేషజాలేల?

**త**మ పాండిత్యాన్ని ప్రదర్శించాలనే దుగ్ధతో ఏరికోరి వలుగురాళ్లవంటి కఠినమైన పదాల్ని వాడే భాషాపండితులు కొందరుంటారు. ప్రభు త్వోద్యోగుల్లో కొందరు అలవాటుగానో, నిర్ల క్ష్యంగానో రాసే పాషాణపాకశైలి విన్యాసాలవల్ల అసలు విషయమేమిటో బోధపడకవారి క్రింది ఉద్యోగులూ ఆ తర్వాత ప్రజలూ నానా తిప్ప లుపడుతుంటారు. కొన్ని సందర్భాలలో అది చాలా అనర్థాలకు కూడా దారి తీయవచ్చు. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని ఇంగ్లండ్ ప్ర ధాని మార్గరేట్ థాచర్ భాషను సరళతరం చేయవల్సిందిగా తన ప్రభుత్వోద్యోగులందరినీ ఇటీవల కోరింది. ప్రభుత్వాదేశాలు, విధానాలు, వాక్యాలు చిన్నగా, ఎట్టి పరిస్థితులలోనూ 20 మాటలకి మించకుండా ఉండాలి. అయో మయం కలిగిస్తూ ప్రజల్ని తికమకపెట్టే సంక్షి ప్తనామాలూ కోడ్‌లూ అసలు వాడకూడదు. సూచనలు సామాన్య ప్రజానీకానికి అర్థంకాని పక్షంలో వాటి మౌలిక లక్ష్యమే దెబ్బతింటుంద న్న ఉద్దేశంతో ఆమె ఈ భాషా సంస్కరణకి పూనుకొంది. దానిలో భాగంగానే 5 లక్షల మంది బ్రిటిష్ ప్రభుత్వోద్యోగులకు ఓ ప్రత్యేక సర్క్యులర్ జారీ చేసిందామె. అందులోని సూచనల ప్రకారం ప్రభుత్వానికి సంబంధించిన లావాదేవీలు, ఉత్తర ప్రత్యుత్త రాలు సమస్తం సరళమైన భాషలోనే జరగాలి.



ఈవిధంగాభాషాసరళతకోసంఎన్నెన్నో సుద్దులు ఆ సర్క్యులర్‌లో పొందుపరిచిందావిడ. క్షేమగ్గా ఉన్న బ్రిటిష్ ప్రధానిగారి ఇలాంటి నిర్ణయమే భారత ప్రభుత్వం కూడా తీసుకుంటే మన పాండితీప్రకాండుల భాషాభేషజాల్ని కొంతవరకైనా అరికట్టినట్లవుతుంది. తద్వారా సామాన్యుల తలనొప్పులు కొన్నయినా తీరిపోతాయి.

## ఆడవేషాల్లో మగవాళ్లు!

సినిమాల్లోనూ, నాటకాలలోనూ అడపాదడపా హీరోలో, కమెడియన్లో ఆడవేషాలు వేసుకొని ప్రేక్షకుల్ని కడుపుబ్బ నవ్వించడం మనందరికీ తెలిసిందే. అయితే నిజజీవితంలో పురుషులెవరైనా ఆడవేషాలు వేసుకు తిరుగుతారంటే అదంత నమ్మశక్యంగా కన్పించదు. కాని కేరళలోని ఓ మారుమూల గ్రామంలో ఆ ఆచారం ఇప్పటికీ కొనసాగుతూ వస్తోందంటే మనం ముక్కున వేలేసుకోక తప్పదు.



కేరళలోని 'నవర' అనే సముద్రతీరగ్రామంలో ఏటా అక్టోబరు చివరివారంలో 'కొట్టుంకులంగర' జాతర జరుగుతుంది. ఆ జాతర చివరి రెండు రోజుల్లోనూ వందలాది మంది మగభక్తులు చీరలు, జాకెట్లు, ఇతరత్రా స్త్రీల ఉడుపులు ధరించి చేతుల్లో లాంతర్లు పుచ్చుకొని రాత్రివేళ దేవాలయానికి వెడతారు.

ఆ విచిత్ర ఆచారం వాడుకలోకి రావడానికి అక్కడొక కథ ప్రచారంలో ఉంది. దాని ప్రకారం— వందలాది సంవత్సరాల క్రితం అడవిలో గొర్రెల్ని కాసుకునే ఒకానొక పిల్లవాడిని ఒక రాక్షసి పట్టుకుందట. దానికి మగపిల్లకాయల మాంసమంటే మహా ఇష్టం. ఎంచక్కా దొరికినవాణ్ని దొరికినట్లు ఆనందంగా నంజుకు తినేస్తుండేదది. అందుకని దాని బారినుండి తమ మిత్రుణ్ని తప్పించడానికి మిగిలిన గొర్రెల కాపరులంతా ఒక ఎత్తువేశారు. అదేమంటే— వాళ్లంతా చకచకా ఆడవేషాలు వేసుకొచ్చి ఆ రాక్షసి ముందు ఆడటం, పాడటం మొదలెట్టారు. రాక్షసి కూడా మగపిల్లాడు దొరికాడనే సంతోషంతో వాడినో స్తంభానికి కట్టిపడేసి వాళ్లతో కలిసి నృత్యం చేయడం ప్రారంభించింది. అదలా ఆటపాటల్లో మునిగిపోయి ఉండగా గొర్రెల కాపరులంతా తమ మిత్రుణ్ని విడిపించుకొని చడీచప్పుడు కాకుండా చీకటిలో కలిసిపోయారు.

అప్పటినుంచి అక్కడ దేవాలయం కట్టించి ఈ జాతర జరుపుకుంటూ వస్తున్నారు 'నవర' గ్రామస్థులు. ఈ కథలో నిజమెంతున్నా ఆ గుడి మధ్యలో మాత్రం నాడు గొర్రెల కాపరిని కట్టేసిన స్తంభం ఇప్పటికీ ఉందని తెలుస్తోంది.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291.

# ఒక్క పోస్టు కార్డు చాలు!...




WRITE PIN CODE IN ADDRESS

TO
VIVEKANANDHA INSTITUTE,
POST BOX NO 4986,
NO. 9, MADLEY ROAD,
T.NAGAR, MADRAS-17.
PIN 600017

మీకూ మీ అభ్యుదయానికీ మధ్యవున్న దూరం ఒక పోస్టుకార్డే అని మేమంటే మీకు విచిత్రంగానూ, తమాషాగానూ వుండవచ్చు. కానీ అది నిజం!

మీ అభ్యుదయానికి ఇంగ్లీషుభాష తెలియకపోవటమే ఒక కారణమైతే....

ఇతరులు ఇంగ్లీషులో మాట్లాడుతుంటే మీకు అర్థమైనాకూడా వాళ్ళకి ఇంగ్లీషులోనే సమాధానాలు చెప్పలేకపోతున్నామే అని మీరు మానసికంగా బాధపడ్తూంటే....

ఇదివరకూ యెన్నో మార్గాలలో ప్రయత్నించినా, యెన్ని పుస్తకాలు చదివినా, ఇంగ్లీషులో మాట్లాడలేకపోతున్నామే అన్న విసుగు మీలో పుట్టివుంటే...

మీరు యెదురుచూసే అభ్యుదయాన్ని సాధించటానికి ఒక పోస్టుకార్డు వ్రాస్తేచాలు.

నిజమే!

ఇంగ్లీషులో వ్యాకరణ తప్పులులేకుండా వుత్తరాలు, వ్యాసాలు వ్రాయటానికీ, చక్కగా, సరళంగా మాట్లాడటానికీ మీరు చేయవలసిన ముఖ్య పని ఒక్కటే. మీ కోర్కెను వివరంగా తెలుపుతూ ఒక పోస్టుకార్డుని పోస్టుచెయ్యండి. మీ పోస్టుకార్డు అందిన వెంటనే ఈ వివేకానందా ఇన్‌స్టిట్యూట్‌వారు మీకు కావలసిన వివరాలను, మీరు తీసుకోవలసినఅభ్యాసాలనన్నింటినీ పూర్తిగా అందిస్తారు.

ఎక్కడికి బయలుదేరారండి? పోస్టుకార్డు కొనటానికేనా? అయితే మీ అభ్యుదయానికైన మొదటి మెట్టు ఎక్కారు!

శభాష్!!

మీ కోర్కెను పోస్టుకార్డుద్వారా వివరంగా తెలిపి మీ యొక్క పూర్తి చిరునామానుకూడా తెలుపుతూ వెంటనే పోస్టు చేయడం మరువకండి సుమా!

మీరు పోస్టుచేయవలసిన మా చిరునామా -

Naga

# VIVEKANANDHA INSTITUTE

POST BOX NO:4986, 9, MADLEY ROAD, T.NAGAR, MADRAS-17.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004. Regd No. H/HD /402